

# జాగృతి

దశాబ్ద్యుత్సవ ప్రత్యేక సంచిక

10-11-58.

వెల: 1 రు.

# జాగృతి

సంపుటి ౧౧ పేజీలు 104
సంచిక ౪ వెల : 1 రు.

## విషయసూచిక

# జాగృతి

"అసతో మా సద్గమయ"

'తమసో మా జ్యోతిర్గమయ' 'మృత్యోర్మా అమృతంగమయ'

సంపుటి ౧౧ } విళంబి ఆశ్వయుజ బ॥ ౩౦ — ౧౮౮౦ – 10–11–58 } సంచిక ౮

# మాతృదేవి చరణసేవలో....

మాతృదేవి చరణసేవలో పదేండ్లు గడచింది. ఈ అనంతకాలంలో పదేండ్లు విశేషం కాదు. పైనున్న మహత్తర బాధ్యతలదృష్ట్యా పదేండ్లలో జరిగిన, జరుగగల సేవకూడా ఎక్కువది కాజాలదు వెయ్యేండ్లుగా తారుమారయిన భారతచరిత్రను, అవ్యవస్థతను మార్చివేసి భారత రాష్ట్రాన్ని మళ్లీ జాతీయసంస్కృతిపై పునర్నిర్మించి, మాతృదేవిని మళ్లీ ఆ మహత్తరసింహాసనంపై ప్రతిష్ఠించే మహత్తరబాధ్యత ఇది. ఆ చరిత్రకారణంగా మన నర నరాలలో జీర్ణించిపోయిన అజాతీయ భావాలను, ప్రభావాలను ఆమూలాగ్రం పెకిలివైచి సమాజంలోని ప్రతిఒకరిచేత 'తను మనోజీవనముల హైందవుడ నేను, ప్రత్యణువు హైందవమ్మొనా పరిచయమ్మో' అని సగర్వంగా అనిపించగల మహత్తర కార్యభారమది. 'ఏదేశమేగినా ఎందుకాలిడినా ఏపీఠమెక్కినా ఎవ్వరేమనినా, నేను హిందువుడనని తలలెత్తి పలికించవలసిన అసాధారణకృషియది. 'అనాదియగు నీ యఖండభారతి అనంతమ్ముగ అఖండభూమిగ, ముల్లోకాలలో వెలుగొందాలని' సమస్తసమాజము 'ముచ్చటపడి పురోగమింప'జేసే ముఖ్యకార్యమది. 'మా ప్రాణాలకు నవప్రాణం, మా జీవాలకు నవజీవం, మా రాష్ట్రానికి ఉజ్వలకేంద్రము' మా అరుణారుణ భగవపతాకమని సమస్త రాష్ట్రముచేత ప్రపంచానికి ఎలుగెత్తిచాటింపించే ఘనగంభీరకార్యమది. మాతృదేవి చరణపీఠముకడ భక్తితో, శ్రద్ధతో, వినమ్రతతో పూజ జరిపి ఆర్జించిన మహాశక్తితో విజయమువైపు పర్వులెత్తించే దివ్యకార్యమది.

అయితే ఏనాడూ ఎక్కడా దివ్యకార్యాలు, దేవిసేవలు, దైవపూజనలు నిరాటంకంగా సాగలేదు. విశ్వామిత్రుని యాగానికి మారీచసుబాహులు ఎదురైనారు; ఋషిమహర్షుల మహాతపస్సులకు రాక్షస బ్రహ్మరాక్షసులు ఎదురైనారు. తపోవనాలు సైతం విధ్వంసం చేయబడ్డాయి. శ్రీకృష్ణునాశ్రయించిన సమాజానికి నరకాసురుడెదురైనాడు. ప్రహ్లాదుని వంటి పసివాని భక్తికి సాక్షాత్తు తండ్రియే శత్రువైనాడు. భవానినారాధించిన శివాజీ ప్రభువుకు విదేశీముష్కరులడ్డయినారు. విగ్రహాలు, దేవాలయాలు సైతం నాశనం చేశారు. స్వతంత్రభారతిసేవ నభిలషించిన

## పూజా పథ్‌పర్.

శక్తిదాయినీ దుర్గా తూ హై
విభవపాలినీ లక్ష్మీ తూ హై
బుద్ధిదాయినీ విద్యా తూ హై
సబ సుఖ సిరజన హారీ...

నిశిదిన దర్శన పూజన వందన
నిశిదిన కర తేరా అభినందన
ప్రాణిమాత్రకే జన్మ జన్మకే
సభీ పాప కటజాతే మాతా...

జగతీ కే బంధన ఆకర్షణ
యది స్వయం కాలసే భీ హో రణ
మాఁ తేరే పూజా పథపర్ హమ
లడతే భిడతే బఢతే జాయేఁ...

రాణాప్రతాపున కింకొక రెదురైనారు. ఏ పురాణముచూచినా, ఏ చరిత్ర వెదకినా స్పష్టపడుతున్న విషయమిది. నేడు భారత చరిత్రకూడా అందుకు విరుద్ధంగా లేదు. భారత సేవకు అడ్డు పడే భారతీయులు జన్మించారు. హిందూరాష్ట్రస్థాపనను నిరోధించే హిందువు లుద్భవిస్తున్నారు. సేవయం దాసక్తి, తీవ్రత పెరిగినకొద్దీ, అందుకు విఘాతాలు పెరుగుతుండడం ఈచరిత్ర కంతటికీ సహజంగా కనిపిస్తోంది. అయితే ఏనాడూ ఆ దైవీశక్తులుగాని, దేవీభక్తులు ముష్కరుల ముందు లొంగిపోయింది లేదు. ఇందుకూ ఆ చరిత్రలే సాక్ష్యం.

సంపూర్ణస్వరాజ్య, స్వధర్మ సంస్థాపనా వాగ్దానాలతో సాగించబడ్డ స్వాతంత్ర్య సమరం స్వాతంత్ర్యావతరణతో, స్వధర్మ, సంపూర్ణస్వరాజ్య వ్యతిరేక సమరంగా మారి పోయింది! అయితే ప్రజానీకం ఆనాటి సమరనాయకులకుగాక, ఆ ఆదర్శాలకు మాత్రమే బద్ధమైఉంది. అందుకే ఆ నాయకులు పథభ్రష్టులైనా సమరం సాగుతూనేఉంది. మాతృదేవి పర్యవేక్షణలో సాగుతున్న ఈ సమరంలో స్వధర్మ, సంపూర్ణస్వరాజ్యాశయంపక్షం స్వీకరించిందిజాగృతి. దేవీసేవలో అందరికీ ఎదురైన, ఎదురవుతుండే కష్టనష్టాలే జాగృతికీ ఎదురవుతున్నాయి. స్వజాతీయులే కొందరు దీని నెదిరిస్తున్న సందర్భాలు లేకపోలేదు. అయితే మార్గము కంటకాకీర్ణమని ఎరిగి బయల్దేరిన పథికుని ఈ చిల్లరముల్లులేమీ చేయలేవు. కనుకనే నేడు దశాబ్ద్యుత్సవం సాధ్యమైంది. దేవీ కృపవల్ల ఇలాంటి దశాబ్దా లనంతంగా లభించి, సంపూర్ణ స్వరాజ్య, స్వధర్మ సంస్థాపనే కాకుండా ఈ రాష్ట్రం వాటికి శాశ్వత నిలయంగా ఉండేందుకై కృషిచేస్తూ మాతృదేవి చరణపీఠం కడ శాశ్వత పూజారిగాఉండే మహద్భాగ్యం కల్గించాలని ఈ శుభ సమయంలో భగవానుని ప్రార్థిస్తోంది.

---

## యువ రచయితలకు, కొత్తవారికి సూచన

యువ రచయితలు, కొత్తవారు కొందరు రచనలు సాగించాలనే అభిలాషతో తమ్ము ప్రోత్సహించవలసిందిగా కోరుతూ లేఖలు వ్రాస్తున్నారు. అయితే వారందరికీ విడివిడిగా లేఖలు వ్రాయడంగాని, వారు కోరినట్లు వారి రచనలను దిద్ది పంపడంగాని అసాధ్యమైనవిషయం. అందువల్ల వారికి జవాబులుకూడా వ్రాయలేకపోతున్నాం. అయితే అలాంటివారు తగినంతమంది ఉంటే వారి విషయంలో ప్రత్యేకంగా ఏదైనా పద్ధతి ఆలోచించాలనిఉంది. అందువల్ల అలాంటివారు, (వారి మిత్రులింకెవరైనా ఉంటే వారూ) తమ పేరు, చిరునామా, వయస్సు, విద్య, వృత్తి, రచనలో అనుభవం, ఏరకం రచన చేయాలనిఉంది- ఇలాంటి వివరాలతో వ్రాస్తే ఎలా సహకరించగలమో యోచించగలం. మా జవాబుకై 15 న. పై తపాలాబిళ్ళలు పంపవలసి ఉంటుంది. — సంపాదకులు.

## ధన్యవాదాలు

పాఠకుల, రచయితల, శ్రేయోభిలాషుల, ప్రకటనదారుల వివిధ రకాల సహాయ సహకారాలతో జాగృతి దశాబ్ద్యుత్సవం జరుపుకో గలుగుతోంది. ఈ శుభసమయంలో అందరికీ ధన్యవాదాలు తెలుపుతున్నాం. జాగృతి ఒక వ్యాపారసంస్థగా ప్రారంభం కాలేదు, నడపబడడంలేదు. ఒక మహత్తర ఆశయాన్ని ముందుంచుకొని సమాజంకోసం, సమాజంవల్ల నడుస్తున్న సంస్థ. అందువల్ల ఈ సంస్కృతిపై విశ్వాసమున్న సమాజమంతటి సహకారాన్ని సదా అభిలషిస్తుంది. ఎక్కువమంది చందాదారులను చేర్పించటంలోను, మీ చుట్టుపట్ల ప్రతిఒకరికి జాగృతిని పరిచయం చేయడంలోను, రచయితలు ఉత్తమ రచనలను పంపడంలోను, ట్రస్టుకు అవకాశాన్నిబట్టి ధనసహాయం చేయడంలోను, ప్రకటనదార్లు ఎక్కువ ప్రకటనలివ్వడంలోను ఇంకా ఎక్కువ సహకారాన్నిస్తూ, రానున్న దశాబ్దాలలో మనం మరింత వేగంగా పురోగమించ తోడ్పడవలసిందిగా ప్రార్థిస్తున్నాం. —సం.

# ★ నరకాసుర వధ కథా విశేషం ★

శ్రీ బాబాసాహెబ్ ఆప్టే



కురుక్షేత్ర సంగ్రామంలో శ్రీకృష్ణ పరమాత్మ 'ఆయుధమున్ ధరించ'ననీ, కేవలం సలహాలుమాత్రమే ఇస్తూంటాననీ చెప్పి శస్త్రసన్యాసం చేసినా, అంతకుపూర్వం అనేక దుష్టులను అణగించి, నియంత్రించినట్లు ప్రసిద్ధమే. అలాంటి అసురుల్లో నరకాసురు డొకడు. ఇతడు భూమి పుత్రుడు. నరకాసురుని వధించిన పిమ్మట, అతడు నిర్బంధించిన పదహారు వేల రాజకన్యలు శ్రీకృష్ణుని పతిగా స్వీకరించారనే కథకూడా ప్రసిద్ధమే. నరకాసురవధచేసిన కీర్తి శ్రీ కృష్ణునిది కాదని, సత్యభామ చేతుల్లో అతడు నిర్జితుడైనాడనికూడా అక్కడక్కడా మనకు వర్ణన కన్పిస్తుంది. కనుక ఇది ఆధారంగా "నరకాసురత్వం" అంటే "అశుచిత్వం" అని వివరించి "అశుచిత్వాన్ని" స్త్రీలమైన మేము తొలగిస్తామని సత్యభామ ప్రకటించిందని కొందరు వ్యాఖ్యానిస్తారు. ఈ వ్యాఖ్య నంగీకరిస్తే నరకాసురుడు పదహారు వేల రాజకన్యల బంధించడం, వారు విముక్తులై శ్రీకృష్ణుని పతిగా స్వీకరించడం మొదలైన సుపరిచిత కథలు కేవలం కట్టుకథలుగా విడిచిపెట్టాల్సి వస్తుంది. కొందరు అది కాదు- నరకాసురుడు లంపటుడు; తన కామతృప్తికై అతడు పదహారు వేలమందిని పట్టి తెచ్చాడనీ, వారినందరినీ విడిపించడానికే నిజంగా శ్రీకృష్ణుడు నరకాసురుని మీదికి దాడిపోయినాడని ప్రసిద్ధంగా అంటున్నదే. అంటే నరకాసుర వధానంతరం ఆ పదహారు వేలమందికి స్వీయ సమాజంలో గౌరవ మర్యాదలు లభింపచేయడానికై శ్రీకృష్ణుడా అందరినీ భార్యలుగా స్వీకరించాడనే విషయం క్రమబద్ధంగానే కన్పిస్తుంది. అలా అందరినీ వివాహంచేసుకోడానికి శ్రీకృష్ణుని కాముకభావం కారణం కాదు; పురుషార్థమైన స్వాభిమానమూ, పరమ కారుణిక భావమూ కారణమని వీరి వాదం.

మనం ఇక్కడ ఆలోచించవలసింది మరొక విషయం. ఈ నరకాసురుడెవరసలు? నరకాసురుడెవడు, ఎక్కడివాడని, అతని పూర్వ చరిత్రను గురించి ఆలోచిస్తే, అతనిపై దాడిచేయవలసివచ్చిన కారణంకూడా బోధపడుతుంది. ఇతడు భూమిపుత్రుడు గనుక భౌమాసురుడనే మరో పేరు ఒకటికూడా ఉన్నది. భూమిపుత్రుడని ఇతణ్ణి వ్యవహరించడం నిజంగా ఆశ్చర్యజనకమైన విషయం; అంతకంటే మరీ ఆశ్చర్యకరం అతణ్ణి నరకాసురుడని పిలవడం. నరకం అనేది ఉత్తమ స్థానం కాదు. నరకం పాపులు యాతనలూ, శిక్షలూ అనుభవించే అమంగళకరమైన భయంకరలోకం. అలాంటి వాడిని భూమిపుత్రుడనడానికీ, నరకాసురుడనడానికీ ఏమైనా సంబంధం ఉన్నదా ?

## భౌమాసురుడని ఎందుకన్నారు ?

శ్రీకృష్ణుని చరిత్ర మనకు భాగవత దశమ స్కంధంలో అన్నిటికన్నా ప్రామాణికంగాలభిస్తుంది. ఈదశమ స్కంధంలో 51వ అధ్యాయంలో భౌమాసురవధ వర్ణితమైయున్నది. ఇంద్రుని తల్లి అదితియొక్క కుండలాలను నరకాసురుడు దొంగిలించాడు. అలాగే ఇంద్రునిఛత్రాన్నీ, అమరపర్వత స్థానాన్నీ బలాత్కారంగా తీసుకున్నాడు. ఈ విషయం శ్రీకృష్ణునికి విన్నవింపబడ్డమీదట, శ్రీకృష్ణుడు నరకాసురునిమీదికి దాడిబోయి, అతణ్ణి వధించాడు. అక్కడినుంచి నరకాసురుని



రాజధానికి వెళ్ళగా, అక్కడ బంధితలైన రాజకన్యలు శ్రీకృష్ణుని తమ మానస భర్తగా అంగీకరించమని ప్రార్థించారు. నరకాసురుని తల్లి మనమణ్ణి తీసుకొని శ్రీకృష్ణుని శరణువేడింది. అప్పుడు ఆ బాలుణ్ణి అనుగ్రహించి అదితి కుండలాలనూ, ఇంద్ర ఛత్రాన్నీ, స్వర్గానికి పంపించాడు. శ్రీకృష్ణుని శరణువేడినప్పుడు, నరకాసురుని తల్లియైన పృథ్వి ఇలా అన్నది.

'యదావాం ఉద్ధృతా నాథ! త్వయా సూకరమూర్తినా।
త్వత్స్పర్శసంభవః పుత్రః తదాయం మేఽభ్యజాయత।
సోఽయం చ త్వయైవ దత్తో మే త్వయా చ వినిపాతితః॥

నరకాసురుడు వాస్తవంగా నీపుత్రుడే. వరాహమూర్తివై మునుపు నీవు నన్నుద్ధరించినపుడు నీవలన వీడు జన్మించాడు. నేడు నీ చేతులలోనే వాడు వధింపబడ్డాడు. వరాహ అవతారంలో భూమి నుద్ధరించినపుడు, వరాహ సంపర్కంచే జన్మించినవాడు నరకాసురుడని తాత్పర్యం.

## వరాహ అవతారము

పై వర్ణనను అన్వయించుకుంటే భూమి అన్నా పృథ్వి అన్నా ప్రజల సమష్టిని తెలిపే లాక్షణిక పదంగా మాత్రమే గ్రహిస్తే, నరకుడు ఈ ప్రజల్లోంచి ఉద్భవించినవాడని తెలుస్తుంది. వరాహం అనికూడా లాక్షణికంగానే ఉపయుక్తం కావింపబడింది. ఎందుకంటే వరాహ అవతారంలోకూడా చక్ర, గదలతోనే విష్ణువు యుద్ధం చేశాడనీ, ఆయనకు సహస్ర బాహువు లున్నాయనీ పురాణాలు వర్ణించాయి. వరాహ ఉత్పత్తి, హిరణ్యాక్షుని ఎలా నియమించాలని ఆలోచించే బ్రహ్మ నాసారంధ్రంలోంచి జరిగిందని వర్ణన ఉన్నది. మొదట లతిసూక్ష్మరూపుడై, చూస్తూండగానే పర్వతం అంతఎత్తున పెరిగాడు. దీన్ని సమన్వయించుకోవాలి.

ఆనాటికే భారత వైభవ కీర్తి విదేశాలకు ప్రాకింది. ఆ వైభవాన్ని దోచుకునేందుకు భారతేతరమైన దాడిమూకలు వచ్చి పడుతుండేవి. వాటికి నాయకుడు హిరణ్యాక్షుడు. వీరు క్రూరులు. వీరు చేసే అత్యాచారాలకు నిలువలేక ప్రజలు దక్షిణదిశగా పారిపో నారంభించారు. సప్తసింధుప్రాంతమంతటా దీపం వెలిగిన కొంప ఒక్కటీ మిగలలేదు. అప్పటికి రాష్ట్రీయతయొక్క సంఘటితభావం ఇంకా ఉదయించలేదు. కనుక బ్రహ్మ బాడుగసైన్యాన్ని (mercenaries) నిర్మించాలని అనుకున్నాడు. సమాజంలోంచి లక్షలమందిని చేర్చుకున్నాడు. ఈ సైన్యంయొక్క సామూహిక రూపాన్నే వరాహం అని వర్ణించారు. బాడుగసైన్యానికీ వరాహానికీ పోలికలు చాలా ఉంటాయి. తమోగుణోద్భవమైన అకర్మణ్యభావం ఉంటుందే కాని సంయమం, స్వాభిమానం, కృతజ్ఞత, న్యాయనీతి అనే గుణాలు ఉండవు. వరాహంలా తెగించి ఎప్పుడైనా పోరాడవచ్చు కాని ఆదర్శంపట్ల నిష్ఠ, పట్టుదలా, సహకార భావమూ, బాడుగ సైన్యానికి ఉండదు. ఒకవైపునుంచి పోరాడుతున్నా, అంతకంటే అధికంగా లాభిస్తుందని తోస్తే ప్రతిపక్షుల్లో కలయడానికి సిద్ధపడతారు. ఈ బాడుగ సైన్యంతో హిరణ్యాక్షుని ఓడించిన పిమ్మట, పారిపోయిన ప్రజలు ఆనందంతో తిరిగివచ్చారు. ప్రజలకు ఈ సైన్యంపట్ల కృతజ్ఞతాభావముండడం సహజమే. దానికి ప్రతిఫలంగా ఆసైన్యంలో ప్రతి ఒక్కరికీ భూ, సువర్ణ బహుమానాలు విరివిగా లభించాయి. యుద్ధసమయంలో ప్రజలధనంతో సైన్యాలనుపోషించడంమంచిదే. కాని విరివిగా ఆతరువాతకూడా బహుమతులు పొంది తామూ సమాజంలోని ప్రజలమే ననే భావాన్ని విస్మరించి ఆ సైనికులందరూ సోమరులై పోయినారు. ఈ విషయాన్ని ఆసైనికులకు తెలిపి వాళ్ళను తిరిగి కర్తవ్య నిష్ఠులుగా చేయాలని కొందరు యత్నించారు. దాన్నే పురాణాల్లో అవతారకార్యం సమాప్తం అయిన తరువాత దేవతలందరూ వరాహమూర్తిని సమీపించి అధమయోని త్యజించమని చెప్పినట్లూ ఆయన స్వజనవ్యామోహం విడిచిపెట్టలేనందున శంకరుడు తన త్రిశూలంతో ఆ వరాహ పరివారాన్ని వధించినట్లూ వర్ణించారు.

భారతీయ సమాజంలో కర్తవ్యంగాభావించి ప్రతివ్యక్తీ ఏదో ఒక కార్యాన్ని చేస్తూఉండేవారు. అదే వర్ణాశ్రమ పద్ధతిగా రూపొంది సమాజ వికాసానికి తోడ్పడింది. బాడుగ పని చేసే వ్యక్తులంటే సమాజం అధమంగాచూచేది. అలాంటి దశలో వరాహయుగంలో అవసరం కొద్ది బాడుగసైన్యాన్ని నిర్మించాల్సివచ్చింది. తత్ఫలితంగా వ్యాపించిన అకర్మణ్యత సమాజంలో అణగిఉండిపోయింది. నరసింహ, వామన, పరశురామ, రామావతారాలలో బాడుగ సైన్యంతో కాక ధ్యేయనిష్ఠ, పౌరుషపరాక్రమం, రాష్ట్రాభిమానపూర్ణభావంతో పని జరిగింది. ఈ పరంపర శ్రీరామచంద్రుని కాలానంతరం ఖండితమైంది.

రామచంద్రుని బాల్యకాలంలో ప్రజలు రావణుని అత్యాచారాలకు అణగి భయార్తులైనారు. రాముని బాల్యంలో కన్పించిన పౌరుషం ప్రజలకు కొంత ఆశను కల్గించినా యౌవరాజ్యాభిషేకం కాకుండానే పదునాలుగేండ్ల వనవాసానికి వెళిపోగానే ప్రజలలో అంతులేని నిస్పృహ వ్యాపించింది. అలాంటప్పుడు రాముడా గండం గడిచి వస్తాడనే ఆశకూడా ఏకోశానా లేనిప్రజలకు దక్షిణంలో రావణుడు వధింపబడ్డాడనే వార్త హఠాత్తుగా, ఆశాతీతంగా విన్పించింది. రావణ వధకై దక్షిణంలోనే కాని, ఉత్తరంలో ప్రయత్నమేమీ జరుగలేదు. ఒకేసారి బాధావిముక్తి, రామరాజ్య ప్రాప్తితో, పది ఉపవాసాలుచేసిన చపలుడు తిండి విపరీతంగా తినేట్లు సుఖాలలో పడి ప్రజలు అకర్మణ్యులై పోయినారు. రాముణ్ణి దేవుణ్ణిగా చేసి రామరాజ్య పోషణకై కావలసిన కర్మమయ జీవితాన్ని విస్మరించారు. వరాహయుగంలో అణగి పడిఉండిన ఆ అకర్మణ్యభావం ఈ మధ్య పోషణలేక పైకి కన్పించక పోయినా-అయాచితంగా, కష్టపడకుండా రామరాజ్యం లభించడంతో తిరిగి సమాజంలో తలఎత్తింది.

## రెండు మనస్తత్వాలు

అలాంటి సమయంలో కర్తవ్యాకర్తవ్య ధర్మజిజ్ఞాస చేసుకునేందుకు ఒకవేళ తెలివితేటలున్నా, సాహసం ఉండదు. సమాజంలో కుక్షింభరులు, కుక్షింభరత్వ జిజ్ఞాసను మించి ఆలోచించలేరు. కాని ధర్మపరాయణుల ఆలోచన ఎప్పుడూ ఇహంలో జీవన సార్థక్యం, లోకళ్యాణం కొరకే తపిస్తుంది. అలాంటి కర్తవ్యపరాయణులుసహజంగావచ్చే ఇంద్రియగత,సుఖాలపెంపును ప్రోత్సాహించేయక, సమష్టికర్తవ్యానుష్ఠానాన్నే ప్రచారిస్తుంటారుగనుక, సమాజం సుఖించి, వైభవయుతమై, సమాజధారణ జరిగి శాంతి సమరసత్వాలతో శోభిల్లుతుంది. అలాంటప్పుడు కుక్షింభరులు అక్కడక్కడున్నా, కర్తవ్యానుష్ఠాన తీవ్రభావం జాగ్రత్తగా ఉంటుంది గనుక ఆంతరిక శాంతియేగాక, ఆక్రామకుల బాధలనుండికూడా తప్పించుకొని రాష్ట్రం వర్ధిల్లి సమాజం అబాధకంగా వికసిస్తుంటుంది.

కాని కుక్షింభరులసంఖ్య దేశంలో ఎక్కువగాఉంటే ఆదేశం నరకమే. కుక్షింభరులకు ఇంద్రియచాపల్యం అధికంగా ఉంటుంది. భోగలాలసను సంతృప్తి పరచుకునేందుకు ఎంత నైచ్యానికేనీ ఒడికడతారు. కాని వారిలో సాహసం, ప్రయత్నశీలం ఉండదు. గౌరవ మర్యాదల జీవనం అంటే ఏవిటో తెలియని అలాంటి జనాభా ఎక్కువగాఉన్న దేశంలో ప్రాణ మాన విత్తాలకూ, గౌరవ మర్యాదలకూ సంరక్షణ ఏర్పడదు. అలాంటి క్షుద్రస్థితి సమాజంలో వ్యాపిస్తే,అదే తరుణంగాభావించి రజోగుణ ప్రధానులైన విదేశీయులుగాని, దేశంలోని ఒక వర్గీయులుకాని, ఆ తమోమయస్థితి నుపయోగించుకొని చెలరేగి దేశాన్ని ఆక్రమించి, తమోప్రధానులైన ప్రజలను బానిసలుగా చేస్తారు. ఆ బానిసలు తమ క్షుద్రవాంఛలకై తమ ప్రభువు లెలా, ఎంతనీచ కర్మ చేయుమని ఆదేశించినా చేస్తారు. అప్పుడు సజ్జనుల జీవితం సహజంగా దుర్భరమైపోతుందికదా! ధర్మనిర్ణయాభావం, కర్తవ్యాపేక్ష, ప్రయత్నశీలం నశించి, తమోగుణ ప్రధానులైన ప్రజలు ఎక్కువై, బానిసత్వం ఏర్పడి గౌరవ మర్యాదలకూ, ప్రాణ, మాన, విత్తాలకు సంరక్షణకూడా కలగని సమాజం నరకంకాదా! సమాజపు ఆ పరిస్థితి ఆసురత్వంకదా! అలాంటి నరక సదృశమైన ఆసురత్వం సమాజంలో వ్యాపించింది గనుకనే ఆ సమష్టి నారకీయ ఆసురత్వాన్ని నరకాసురుడన్నారు.

అలాంటి నరకాసురత్వ ఛాయలో సజ్జనులను పట్టి హోమగుండంలో వ్రేల్చిన జరాసంధులూ, తండ్రినిబట్టి బంధించిన కంసులూ, జన్మించారంటే ఆశ్చర్యంలేదు. తమోగుణ ప్రధానమైన ప్రజలు తమ కుక్షింభరణంకొరకు వీరికి సాయపడేవారు. వీరిఛాయలో వారిసంఖ్య బలపడేది. ధర్మం నశించింది. వర్ణాశ్రమాచార ధర్మాలనుండి ప్రజలను పరాఙ్ముఖులుగా చేసేందుకు ప్రయత్నం ప్రారంభమైంది. కొందరు మహాధీరులను మినహాయిస్తే సాధారణ ప్రజ గాలివాటుగా పరుగెత్తనారంభించారు.

సజ్జనులైన పాండవులు అరణ్య, అజ్ఞాత వాసాలలో నానాకష్టాలు పడుతూంటే, దుర్మార్గులైన కౌరవులు సకలభోగాలూ అనుభవిస్తుండేవారు. ఇక ధర్మాధర్మ విచక్షణచేసి, సన్మార్గగాములుగా ఉండవలసిన భీష్ముని లాంటివారు





'అర్థస్య పురుషో దాసః,
దాసస్త్వర్థో న కస్యచిత్ ।
ఇతి సత్యం మహారాజ,
బద్ధోస్మ్యర్థేన కౌరవైః॥'

అన్నారంటే ఆనాటి సమాజం ఎలాఉండేదో ఊహించుకోవచ్చు.

ఇలాంటి కాలంలో ఈ పాపాన్ని భరించలేక పృథ్వి బ్రహ్మను శరణువేడింది. అంటే సమాజంలోని మనుషులు ఒకచోట చేరి తమ మేధాశక్తిని మధించడం ఆరంభించారు. తరువాత అందరూ శ్రీకృష్ణుని చేరి అప్పటి పరిస్థితుల్లో సమాజాన్ని వికసింప చేయటానికి, ఆచార, విచార స్వేచ్ఛను స్థాపించడానికి సాయపడమని వేడుకోగా ఆయన అవసరమైతే శక్తి నుపయోగించి అయినాసరే సాధిద్దామని ప్రవచించి ప్రయత్నం ఆరంభించాడు. ఆ ప్రయత్నంలో మొదటి ఘట్టం ధర్మంమీద శ్రద్ధమాత్రమే ఉండి జ్ఞానం లేనివారిని చేరదీసి వారికి కర్మ విజ్ఞానం ప్రబోధించడం. ఆ కర్మ విజ్ఞానప్రబోధంతో కొన్ని వేలమంది మేల్కొని, తామూ అలాగే ప్రబోధించ నారంభించారు.

శ్రీకృష్ణుని యీ ప్రబోధం గురించి మూడు ఘట్టాలు మన కింకా లభిస్తున్నాయి. 1. గీత, 2. ఉపగీత, 3. అనుగీత సంవాదం.

దీనితో దేశంలో కర్తవ్యాకర్తవ్య భావం ఆరంభమైంది. ఆచార, విచార స్వేచ్ఛ ప్రబలింది. దాని కొటంకం కలిగినప్పుడు శ్రీకృష్ణుని శక్తి ఆటంకాన్ని ఏరిపారవేసింది. ముఖ్యంగా దీనికై మూడు తత్వాలను ఉపదేశించాడు. ఈ మూడు పై మూడు ప్రబోధ ఘట్టాలలోనూ కనిపిస్తాయి. ఒకటి వ్యక్తి నిష్ఠమైన సుఖ వాంఛను విడనాడడం, రెండోది అకర్మణ్య భావాన్ని విడనాడడం, మూడోది నీచ సేవను విడనాడడం. దీనితో సమాజంలో ఆధ్యాత్మ భావం తీవ్రంగా జాగృతం అయింది.

## స్త్రీ సమాజం :

సమాజంలోని పురుషులు ఈ ఆధ్యాత్మ భావాన్ని గ్రహించారు. కానీ ఆచరించలేక పోయినారు. స్త్రీలకు భిన్న శరీరాలలో ఏకాత్మానుభూతి ననుభవించే శక్తి నిసర్గసహజం. అదిగాక పురుషునికంటే స్త్రీ వేగంగా స్వాభిమాన, విశ్వాసాలతో ఏపనైనా కష్టపడి సాధిస్తుంది. అలాగే ఈ ఆధ్యాత్మవిద్యను స్త్రీ సమాజం గ్రహించి సమాజంలో నిలబెట్టింది. స్త్రీలు తలచుకుంటే పురుషులు అనుసరించాల్సిందేకదా! కనుక స్వాభిమానం, ఆత్మ విశ్వాసాలతో నిజమని నమ్మిన స్త్రీ వర్గం చేతిలో సమాజంలో వ్యాపించిన నరకాసురత్వం నశించింది గనుక ఆ స్త్రీ సమాజ సమష్టి ప్రతినిధి రూపిణియైన సత్యభామ చేతిలో నరకాసురుడు నశించాడని వర్ణించారు.

## నరక చతుర్దశి :

అందుకే నరక చతుర్దశినాడు మనం చేయవలసిన కర్మ ఉన్నది. ఆరోజు బ్రాహ్మీ ముహూర్తంలో లేచి, పనుల్లో ప్రవృత్తులు కావాలి. సూర్యోదయానికి పూర్వమే మంగళ స్నానం చేయాలి. దాంతో శారీరక శుద్ధితో మానసిక మాలిన్యాన్ని కడిగివేసుకొని ప్రసన్న చిత్తులవాలని భావం. ఈ ప్రకారంగా తమోగుణ ప్రధానుడైన నరకాసురుణ్ణి సమాజంలోంచి వెళ్లగొట్టాలి. ఆ నరకాసురుని కథానంతరం దీపమాలికలు వెలుగుతాయి. ఆనందం తాండవిస్తుంది - నరకాసురుని వధానంతరమే కర్మప్రవృత్తి మేలుకొంటుంది. ప్రేమపూర్వక సహకార్యసిద్ధి ప్రాప్తిస్తుంది. అప్పుడేలక్ష్మీపూజనం. నరకాసురుని వధించారు; లక్ష్మిని పూజించారు. అప్పుడే శక్తి ఉదయిస్తుంది. మంచి ఇతరుల్లో ఉన్నా గ్రహిస్తారు. అందుకే దీపావళి తరువాత బలిప్రతిపద వస్తుంది. నరకాసురుడు చనిపోగా పాపులసంఖ్య తగ్గినందున యమునికి తీరిక లభించి సోదరిదగ్గరకు వెడతాడు. అదే యమ ద్వితీయ. ఇదీ నరకాసుర వధకు వ్యాఖ్య.

## పదహారు వేల రాజపుత్రికలు :

నరకాసుర రాజ్యంలో సత్యజ్ఞానం, కర్తవ్య ప్రవణం, ఆలోచనా స్వాతంత్ర్యం బందీలైనాయి. ఆనాటి వ్యాఖ్య ననుసరించి ధర్మ, సత్య, జ్ఞాన, స్వాతంత్ర్యాలకు నాల్గింటికీ వేదాలు నాలుగూ మూలస్తంభాలు. ఈ నాలుగు వేదాలూ కలిసి 16 వేల ఋచలౌతాయి. వేదాన్ని శ్రుతి అంటారు. శ్రుతిని సమాజం ఈనాటికీ తల్లిగా భావిస్తుంది. శ్రీకృష్ణుడు పరిపూర్ణ పరబ్రహ్మ రూపుడైన జగత్పితగా భావిస్తే, మాతృరూపిణులైన 16 వేల ఋచలను నారకీయ ఆసురత్వ స్థితిలోంచి ఉద్ధరించి స్వీకరించాడనే భావం అవగతం అవుతుంది.

ఆ పదహారువేల రాజకన్యలను శ్రీకృష్ణుడు తన తదనంతరం అర్జునునికి అప్పగించాడు. కాని అర్జునుడు రక్షించలేక పోయినాడు. అంటే శ్రీకృష్ణుని అనంతరం ఆబాధ్యత ననుసరించవలసిన అర్జునుడు ఈ కర్మవిద్యను నిలుపలేకపోయినాడు. అందువల్ల తిరిగి అకర్మణ్యభావం బాగా వ్యాపించి ఇతోధికంగా ప్రబలింది. అందుకనే యీ పంచసహస్రాబ్దాల చరిత్రలో క్రమాగత పతనాన్ని చూస్తున్నాం. ఇది దీని వివేచన. రాష్ట్రశక్తికి స్ఫూర్తి నిస్తేనే తిరిగి ఆ నరకాసురత్వం నశించే పరిస్థితి వస్తుంది.

(అనువాదం : నారాయణరావ్, సదాశివ)



# ★ శివస్తోత్రమ్ ★

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

శివస్య నను బ్రహ్మణః పర మభేద ఏవేతి చేత్
శివే కిముపచరే బ్రహ్మణి మన స్సమాధీయతాం
వదేచ్ఛ యది భో భవాన్ అపునరాగతేశ్చావధి
ర్మహాలయ ఉరీవృతా ప్రథమసృష్టి రీశే స్థితా.

శివునకు, బ్రహ్మకు పెద్ద భేదము లేనిచో శివునియం దెంగులకు, బ్రహ్మయందే మనస్సు నిలుపరాదా అని నీవన్నచో; మహాప్రళయము తిరిగి రానంతవరకే. మరల ప్రథమసృష్టి శివాధీనమై యున్నది.

ప్రమా విమలితోన్మనీ చరమభాగ బింద్వంతర
స్థితం సువినిరూపణస్థితి మతీతవ త్త్వ న్మహః
నిరూపయితృ కర్తృతా మ్యపహతే దృశీ త్వ త్కృపా
శివోఽహ మితి యా మతి ర్భవతు నిశ్చలా సా మమ.

జ్ఞానముచేత స్వచ్ఛమైన ఉన్మనీ చరమభాగమునంగున్నదియును; నిరూపించుటకు వీలులేనిదియు నైనట్టిదీ నీ మహస్సు. నీ దయ ఇట్టిదని చెప్పరాదు; ఈ చేయునది నేనని చెప్పుటకు వీలులేదు. శివోహామన్న నామతి నిశ్చల యగుగాక.

ప్రభో భవ దధశ్చ నైకశివమూర్తయః ప్రోజ్వలా
భవంతి కథయంతి తద్జ్ఞపరిషత్ స్థితాః పండితాః
ప్రభో భవ దుప ర్యనేక శివసంతతి ర్దృశ్యతే
త్వదంతర నిరంతర స్థ శివసంతతి ర్వర్తతే.

పండితులైన పారిషదులు నీ ఈ మూర్తిక్రింద అనేక శివమూర్తు లున్నవని చెప్పుచున్నారు. నీపైన ననేక శివమూర్తులు కలవు. నీ లింగాంతరమునందే అనంత శివమూర్తులు కలవు.

ప్రభో త్వమసి సర్వజీవ పశుభావ రేఖాపతిః
అహంచ ఖలు సర్వజీవ పశుభావ రేఖాపతిః
పతిత్వ మిహ చార్థతో భవతి లోకనాథ ద్విధా
కృపాపరమవార్నిధే కురు తదర్థ మత్రైకధా.

నీవు అన్ని జీవులయొక్క పశుభావమునకు అధినాధుడవు అన్ని జీవులయొక్క పశుభావము కలిపి నాయం దున్నది. నీవు పశుభావపతివి; నేను పశుభావపతిని. ఈ పతి యన్న శబ్దమునకు నీయం దర్థము వేరు: నాయం దర్థము వేరు. ఈ యర్థమొక్కటిగ చేసిపెట్టుము.

పురా హార భవన్మహాః పరివిలీన మాహేశ్వరాః
కియ ద్ధృదయదైన్య మాప్నుయు రహం నజానే ప్రభో
మదీయ హృదయస్థితాం కృపణతాం తు జానే ప్రభో
ప్రమాణ మిహ ధూర్జటే తులయితుం విహాతుం భవాన్.

పూర్వము మాహేశ్వరులు నిన్ను పొందుటకు ఎంత దైన్యముపొందిరో నాకు తెలియదు. ఇప్పటి నాహృదయ మందలి దైన్యమే నాకు తెలియును. అది ఎక్కువో, ఇది ఎక్కువో తూచుటకుగాని, వదిలిపెట్టుటకుగాని నీవే సమర్థుడవు.

ఇదం జగతి నిర్మమత్వ మభివాంఛితస్యేశితు
ర్హరస్య బహుదూర సంస్థితి రనాగతి స్సా మృతేః
కథం ప్రతిదినం గమిష్యతి సుషుప్తి వేళావధేః
ఇతీత్థ మతిదుర్ఘటం భవతి మే ప్రభో జీవితం.

నేను నిర్మమత్వమును కోరుచున్నాను. శివుడు చాల దూరమునందున్నాడు. మృత్యువు రాలేదు. నిద్ర పోవువరకు ప్రతిదినము గడచుట కష్టముగా నున్నది. ప్రభో నాజీవిత మింత దుర్ఘటముగా నున్నది

సదా శిరసి చంద్రమా వసతు వామభాగే గిరే
స్సుతా భవతు భోగిరా ట్సరతు కంఠదేశే మహా
లవోఽపి విభవాకృతే స్తత న మే సమాగచ్ఛతి
నచే ద్వససి తేజసా మనసి మే ప్రమాదీపక-

చంద్రుడు తలమీద, పార్వతి వామభాగమున, కంఠమునందు పాము - నీ ఈ విభవాకృతి నాయందు కొంచె మైనను వచ్చుటలేదు. తేజస్సుచేత నా మనస్సునందు నీవు నివసించుచున్నావు.

యమః ఖలు ప్రతీక్షతే నిరంతర మస్మదప్యంగణే
యమః ఖలు నవిద్యతే మనసి మే వృథాశావతి
ప్రయత్నరహితం చ మాం ప్రయితతే ను క స్త్వ న్మహ
స్సర స్తటనివాసినం ఘటయితుం తృషా దుఃఖితం.

నా ప్రాణముల ముంగిట యముడెల్లప్పుడు ప్రతీక్షించుచున్నాడు. యమము నా మనస్సునం దెచ్చటను కన్పించుటలేదు. నీ తేజస్సను చెరువు ఒడ్డున కూర్చుండి, దప్పికగొన్న వానినిగా ప్రయత్న రహితుడనైన నన్ను చేయుటకు ఎవడు ప్రయత్నించును ?

— // —

# జాగృతి చిరంజీవియై వర్ధిల్లుగాక!

### పెద్దల, మిత్రుల ఆశీస్సులు, శుభాకాంక్షలు, సూచనలు

## సద్గురు శ్రీ ఓంకార్

...త్వరితగతిన, మతి భ్రమణంలో పోతున్న ఈ నాటి దేశంలో మీరు నిలవ దొక్కుకొనగల్గటమే గాక, అభివృద్ధిచెందడ మొక ఘనవిజయం. ఈ నవీన యుగంలో మీరు మన మహత్తర సంస్కృతీ ధ్వజాన్ని స్వీకరించి, మన ప్రజల జీవితంతో మన వారసత్వాన్ని మేళవింప జేసేందుకు యత్నించారు... పురోగమించండి. అధికాధిక శక్తిసంపన్ను లగుదురుగాక! మీ ఆశయములు మరింతగా పాదుకొని, ఈజాతి దృఢమైన, చలింపబడజాలని పునాదులపై ధృవపడుగాక!

మీకునచ్చితే, నేను దృఢంగా విశ్వసిస్తున్నట్లుగా ప్రస్తుత ప్రాదేశిక ప్రాతినిధ్య విధానా (Territorial representation) నికి మారుగా, వృత్తి ప్రాతినిధ్య విధానానికి(Functional representation) వైయ్యక్తిక ఆస్తిపాస్తులకు, వైయ్యక్తికనంలో ప్రభుత్వ ప్రమేయం లేకుండా ఉండేందుకు, ప్రభుత్వ అధికారం పరిమితంగా ఉండేందుకు కృషిచేయండి.

పాశ్చాత్యదేశాల్లో సృష్టింపబడుతున్న ఈ సోషలిష్టు భావాలు, వర్గ, వర్ణ రహిత సిద్ధాంతాదులు, ఇత్యాది తళుకు బెళుకులకు ప్రలోభపడకుండా పురోగమించండి. మీరు మీరుగా నిలబడండి- అల్పసంఖ్యాకులుగా ఉన్నాసరే...

ఆశీస్సులు

సద్గురు శ్రీ ఓంకార్

## శ్రీ గురాజీ

జాతీయ ఆశయాలను వ్యాపింపజేసే ప్రయోజనకరమైన సుదీర్ఘ జీవితాన్ని ఆకాంక్షిస్తున్నాను.

(తంతి) శ్రీ గురాజీ.

## శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

జాగృతి దశాబ్ద్యుత్సవం జరుగుతోందని విని అమందానందము నొందితిని. మీరు సాధించిన ఘనవిజయానికి నా అభినందనలందుకోండి. ఆంధ్రదేశ సేవలో మరింత ఘనమైన భవిష్యత్తుకు సంబంధించి నా హృదయపూర్వక ఆశీస్సుల నందుకోండి.

శ్రీ ఆర్. అనంతకృష్ణశర్మ

## శ్రీ వి. వి. గిరి

ప్రారంభంలో మీరు ఎదుర్కొనవలసిన సాధక బాధకా లెరుగుదును. ఈ సరికి పత్రిక విజయానికి చక్కనిబాటలు దిద్దుకున్నదని ఆశిస్తున్నాను... దశాబ్ద్యుత్సవ సందర్భంలో మీకు, పత్రికలోపనిచేస్తున్న ఇతరులకు ధన్యవాదాలు.

శ్రీ వి. వి. గిరి.

## ఆనిబిసెంట్ "న్యూఇండియా" పత్రికను గుర్తుచేయుచున్నది.

...చాలా ఆనందించితిని. ఈ పది సంవత్సరములలో జాగృతి చేసిన సేవ చాలా ఉత్కృష్టమైనది. ఇంత స్వల్పకాలములో ఇట్టి మహాసేవ నే దేశీయపత్రిక చేయలేదని చెప్పుట అతిశయోక్తికాదు. అతి స్వల్పకాలములో గొప్ప దేశసేవ చేసినట్టియూ, డా. ఆని బిసెంటు స్థాపించినట్టి 'న్యూఇండియా' పత్రిక ఎట్టి సేవ ఆకాలములో చేసినదో అట్టిసేవ జాగృతి వారపత్రిక చేసినది. ఈ పవిత్ర సమయమున నామనఃపూర్వక శుభాకాంక్షలు.

శ్రీ అవసరాల రామారావ్

...కొత్తగా స్థాపింపబడ్డ ఒక పత్రిక భారతదేశంలో పదేండ్లపాటు నడిచిందంటే అది ఘనవిజయమే... మీకు అభినందనలు... శుభాకాంక్షలు.

శ్రీ కె. హనుమంతయ్య

జాగృతి దశాబ్దంపాటు ప్రచురణ సాగించినదని విని కేంద్రహోంమంత్రి చాలా ఆనందించారు. ఈ శుభసమయంలో వారు శుభాకాంక్ష లందజేస్తున్నారు.

శ్రీ ఎ. కె. మిత్ర

... విజయీ భవ ...

శ్రీ ఎస్. రాధాకృష్ణన్

...శుభాకాంక్షలు...మీ పత్రిక అనేక సంవత్సరాలపాటు జాగృతిని కల్గించుచుండుగాక!

శ్రీ రాజాజీ.

...శుభాకాంక్షలు...

—శ్రీ ఎం. హనుమంతరావు

# విజయీభవ!

## శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

జాగృతి స్వీకరించిన ప్రయోజనకరమైన కృషియొక్క దశాబ్ద్యుత్సవాన్ని జరపడం చాలా ఆనందం కలిగిస్తోంది. మన దేశమువంటి ప్రజాస్వామ్యదేశాలలో సమాజానికి చెందిన అన్ని వర్గాలు స్వేచ్ఛగా భావప్రకటనచేయడం అవసరం. సమాజంలోను ఒక ముఖ్యవర్గపు అభిప్రాయాలను ప్రకటించడంలో జాగృతి చాలా శక్తివంతంగాను, స్వేచ్ఛగా అభిప్రాయాలను ప్రకటించగలిగేదిగాను గుర్తించాను. ఎప్పుడూ అత్యంతాసక్తితో పత్రికను చదువుతూ, నాకు ఇతరత్రా తెలియడానికి అవకాశంలేని విలువైన అభిప్రాయాలుండడాన్ని తెలియజేస్తూ నాకు చాలా ప్రయోజనం కలిగిస్తోంది. వైయక్తిక, సామాజిక సేవలో పత్రిక సుదీర్ఘమైన, ప్రయోజనకరమైన జీవితం పొందాలని ఆకాంక్షిస్తున్నాను.

శ్రీ యం. వెంకటరంగయ్య

## శ్రీ బలరాజ్ మధోక్

...కుహనా జాతీయవాదము, విచ్ఛిన్నకర భావాలు, కులతత్వము ఇత్యాదులు పెచ్చు పెరిగిపోయిన వాతావరణంలో ఈ జాతీయ పత్రిక ఒక ప్రత్యేక స్థానాన్నాక్రమించగల్గడం నిజంగా ఘనమైన విషయం...జాగృతికి ఇంకా ఇంకా విజయవంతమైన భవిష్యత్తు నాకాంక్షిస్తున్నాను.

శ్రీ బలరాజ్ మధోక్

## శ్రీ ఎ. భగవంతరావు

...చాలా సంతోషం...ప్రజల ఆర్థికజీవనాన్ని అభివృద్ధి చేసేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్న భారత్ వంటి ప్రజాస్వామ్య దేశంలో వార్తాపత్రికల ప్రాముఖ్యతను గురించి వేరే చెప్పవలసిన పనిలేదు. ఈరోజుల్లో జాతీయ భాషలో నడుపబడే పత్రిక ప్రారంభ సాధక బాధకాలన్నిటినీ మీరు విజయవంతంగా అధిగమించినందుకు మిమ్మభినందిస్తున్నాను. రానున్న దశాబ్దాలలో మీ పత్రిక ఇంకా విజయాన్ని పొందాలని కోరుతున్నాను.

శ్రీ ఎ. భగవంతరావు

## శ్యామలాల్ శర్మ

"జాగృతి" దేశాన్ని నేడు ఎదుర్కొంటూన్న అనేక ప్రమాదాలపట్ల ప్రజలను, ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ నిజాయితీతోనూ, నిష్ఠతోనూ దేశప్రజలకు సేవ చేస్తోంది. ఈ జాతీయ వారపత్రికయొక్క ఉజ్వల భవిష్యత్తును ఆశిస్తూ దానికై పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

శ్రీ శ్యామ్‌లాల్ శర్మ
కాశ్మీర్ ప్రజా పరిషత్ అధ్యక్షుడు

## శ్రీ గోపాలరావ్ ఠాకూర్

రాష్ట్రీయ, స్వతంత్ర భావములతో, విపత్కర పరిస్థితుల నెదిరిస్తూ, దృఢంగా నిలచి నేడు 'జాగృతి' దశాబ్ద్యుత్సవం జరుపుకోవటం హర్షదాయకం; అభినందనీయం. నిరంతర జాగరూకతయే స్వాతంత్ర్యానికి మూల్యమనే సత్యాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రజలకు మార్గదర్శనం చేస్తూ పత్రికలు రాష్ట్రజాగరణ చేయాలి. అధికారంలో ఉన్నవారికి వంతపాడటమే తమ విధానంగా పెట్టుకొని నేడు చాల పత్రికలు నడుస్తుండటం దురదృష్టకరం. ఇట్టి వాతావరణంలో 'జాగృతి' రాష్ట్రజాగరణను కొనసాగించటం ప్రశంసార్హం. భవిష్యత్తులో కూడ జాగృతి ఈ మహత్కార్యాన్ని కొనసాగిస్తుందని విశ్వసిస్తున్నాను.

శ్రీ గోపాల్‌రావ్ ఠాకూర్

## శ్రీ పింగళి నాగేంద్రరావు

తమ శుభలేఖ అందినది...స్వస్తి. విజయీభవ! అప్రాచ్య శక్తుల ఆహుతి కాకుండ, ఆంధ్రప్రజలకు జాగృతిని కల్గిస్తూ, స్వజాతి స్వధర్మ సముద్ధరణకు సంస్కృతీ విజ్ఞానమును జాగ్రత్త చేసుకొన కంకణముకట్టిన సరస్వతీ రక్ష మీ జాగృతి... మీరు ప్రచురించు వ్యాసము, కథ, గేయము, వార్త...పత్రికా లోకమున జాగృతి నొక ధర్మ సంస్థగా సమర్థించుచున్నవి. ఇతోధిక ధర్మప్రచారముతో జాగృతి విజయ పరంపరల నందుగాక...

శ్రీ పింగళి నాగేంద్రరావు

## పాంచజన్య

జాగృతికి నవంబరు 9 న పదేండ్లు నిండటం అత్యంత హర్షదాయకం. విశుద్ధ రాష్ట్రీయ భావనను ప్రసరించుటలో, ప్రచారం చేయుటలో 'జాగృతి' అభూతపూర్వమైన కృషి సలిపిందనేది నిశ్చయం. ముఖ్యంగా సామాన్య పత్రికలు పాశ్చాత్య ప్రభావగ్రస్తములైన సమయంలో ఈ కృషి జరగటం విశేషం. 'జాగృతి' తన ఉద్దిష్ట మార్గంలో నిరంతరం పురోగమించే సామర్థ్యాన్ని ప్రసాదించమని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

శ్రీ తిలక్ సింహ పరమార్
సంపాదకుడు

## వివేక్

...జాతీయ సేవలో మీకు మరింత ఉజ్వల భవిష్యత్తు నాకాంక్షిస్తున్నాను. మీ మార్గంలో అడ్డుపడే ఆటంకాల నెదుర్కొనడంలో మీకు భగవంతుడు అనంతమైన ధైర్యాన్ని ప్రసాదించ భగవానుని ప్రార్థిస్తున్నాను.

శ్రీ బి. ఎన్. జోగ్, సంపాదకుడు

# శతమానం భవతు!

## ది ఇండియన్ అండ్ ఈస్టరన్ న్యూస్‌పేపర్ సొసైటీలు

గడచిన పదేండ్లుగా జాగృతి ప్రత్యేకతతో జాతీయసేవ చేస్తున్నందుకు చాలా ఆనందంగా ఉంది. నా ఉద్దేశ్యం ప్రకారం ఈ విజయం ప్రధానంగా వ్యవస్థాధిపతుల దూరదృష్టి సమర్థతలవల్లను, పనివారల ప్రయోజనకరమైన సహకారంవల్లను సాధ్యమైంది. ఈ శుభసమయంలో జాగృతి రానున్న సంవత్సరాలలో సర్వతోముఖ విజయాన్ని పొందాలని ఆకాంక్షిస్తున్నాను.

కార్యదర్శి

## గోలుకొండ పత్రిక

...జాగృతి వారపత్రిక తన దశమ వార్షికోత్సవమును జరుపుకొంటుందని తెలిసి చాలా సంతసించాను. పత్రికా నిర్వహణం అనేక క్లేశాలతో కూడియున్న వర్తమాన కాలంలో న్యూస్ ప్రింట్ మున్నగు అవాంతరాల నెన్నిటినో విజయవంతంగా ఎదుర్కొని అప్రతిహతంగా ప్రగతి పథంలో పురోగమిస్తున్న మీ జాగృతి వారపత్రికకు నా అభినందనలు. భారతీయ సంస్కృతిని పునరుజ్జీవింపజేయడమే ప్రధానాశయంగా పెట్టుకొని సర్వరంగములను తదేక దృష్టితో తీర్చి దిద్దడానికి దీక్షబూనిన మీ పత్రిక శతవార్షికోత్సవాన్ని అనుభవించవలెనని ఆశిస్తున్నాను. మీరు విషయాన్నే ప్రధానంగా గైకొని, నిష్పాక్షికంగా, నిర్భయంగా, నిస్సంకోచంగా విమర్శిస్తూ పత్రికా ప్రయోజనాన్ని పరమార్థంగా పరిగణిస్తూ కృషిచేస్తున్నందుకు ధన్యవాదాలు.

"శిషో రపి గుణా వాచ్యా—దోషా వాచ్యా గురో రపి" శత్రువైనను గుణాన్ని పొగడవలసిందే; గురువైనను దోషాన్ని తెగనాడవలసిందే అను నానోక్తి సర్వవిదితం. వ్యంగ్య మర్యాదచేగాని...కర్తవ్యాకర్తవ్యాన్ని ఉపదేశించు మీ జాగృతి చిరంజీవిని కావలెనని ఆశిస్తూ నా శుభాకాంక్ష లందజేస్తున్నాను.

శ్రీ నూకల నరోత్తమరెడ్డి
సంపాదకులు

## శ్రీ రామ కృష్ణ ప్రభ

ప్రజలలో అవిద్యా నిద్రను దులిపి జ్ఞాన జాగృతిని వెలయించుచు దేశీయ విజ్ఞాన సౌధ పునర్నిర్మాణమునకై పాటుపడుచు ప్రథమ దశాబ్దిని గడచి ద్వితీయ దశాబ్దిలో అడుగిడుచున్న మీ పత్రికారాజమునకు- సర్వేశ్వరుడు క్రొంగ్రొత్త సొంపులను, నిత్యాభివృద్ధి జేకూర్చుగాతమని ఆశించుచున్నాను.

శ్రీ నేలటూరి భక్తవత్సలం, సంపాదకులు

## కళ్యాణ కల్పతరువు

జాగృతి తన దివ్యమైన సేవలో పదేండ్లు పూర్తిచేసిందని తెలుసుకొని ఆనందిస్తున్నాను. దానికి ఇలాంటి మహోత్సవాలింకా అనేకం రావాలని ఆకాంక్షిస్తున్నాను. శ్రీహరికి నమస్కారములతో.

శ్రీ హనుమాన్‌దాస్ పొద్దార్
సంపాదకులు.

## విజయవాణి

జాగృతి పత్రిక పదిసంవత్సరములు జయప్రదముగా ప్రచురింపబడి ఏకాదశ జన్మదినోత్సవమును జరుపుకొనుచుండుట సంతోషదాయకము... భారతీయులు కొందరు మఱచిపోయిన, మఱచిపోవుచున్న ప్రాచీన భారతీయ వైజ్ఞానిక ధర్మములను, విశేషములను జాగృతి జ్ఞాపకముచేయుచున్నది. ఇట్టియుద్బోధలు అత్యవసరమని నేను నమ్మువాడను. దేశభాషలో అందున తెనుగుభాషలో పదిసంవత్సరములు ఒకవారపత్రిక నిర్విఘ్నముగా ప్రచురితమగుట సామాన్య విషయముకాదు. జనసంఘ బలముతో జాగృతికి చక్కని ఉనికి లభించినది. జాగృతి చిరస్థాయియై వర్ధిల్లుగాక యని భగవంతుని ప్రార్థించుచూ 11వ జన్మదినసందర్భమున నా శుభాకాంక్ష లందజేయుచున్నాను.

శ్రీ మల్లెల శ్రీరామమూర్తి.
సంపాదకులు

## ముులుకోల

"ఈ 10 సంIIలనుండి జాగృతి తాను నమ్మినసిద్ధాంతాన్ని అచంచల దీక్షతో కొనసాగించిందని చెప్పగలను. ఒక లక్ష్యం దీక్షతో జోడించి కొనసాగించినప్పుడే సఫలత పొందుతుంది. అందుకు జాగృతికి అగ్రతాంబూలం యివ్వవచ్చును."

శ్రీ బండి బుచ్చయ్య
సంపాదకులు

## ది యూనివర్సల్ మదర్

"ధైర్య సాహసోపేతములైన చక్కని ఆశయాలను ముందుంచుకొని, మహత్తర హిందూ జాతీయాదర్శాన్ని స్వీకరించి, హిందువులందరం 'మాత'యని సంబోధించే గోరక్షణకై చాలా కృషిచేస్తూ పదేండ్ల ప్రచురణ జరిపిన మిమ్మభినందించుట నాకు గర్వదాయమైన సదవకాశం.

భారతీయపత్రికారంగంలో మీరు ధైర్యవంతమైన ఉదాహరణగా నిలువ గలరని ఆకాంక్షిస్తున్నాను...."

శ్రీనివాస్‌దాస్ పొద్దార్, సంచాలకులు.

# జాగృతి దశాబ్దకాలంపాటు జరిపిన

## ప్రారంభం, పురోగమనం, దశాబ్ద్యుత్సవం!



స్వరాజ్యమొచ్చిన తొలిరోజు లవి. ఇక స్వధర్మ సంస్థాపన తరువాయి కార్యక్రమం. సంపూర్ణ స్వరాజ్యపు సమస్యకూడా మిగిలి ఉంది. అప్పటికే దేశంలో సంపూర్ణ స్వరాజ్య వ్యతిరేకశక్తులు, స్వధర్మ వ్యతిరేకులు తగినంత బలపడి ఉన్నారు. ఆసమయంలో సంపూర్ణ స్వరాజ్య సాధనకు, స్వధర్మ సంస్థాపనకు కృషిచేసేందుకై ఒక పత్రిక స్థాపించాలని మా మిత్రబృందాని కొక ఆలోచన కలిగింది. ఇతర మిత్రులనుకూడా సంప్రదించడం జరిగింది. అందరూ ఏకగ్రీవంగా ప్రోత్సహించారు. నాడు మమ్మ అసలు ప్రోద్బలంచేసినవారిలో (నేటి జాగృతి ప్రకాశన్ ట్రస్టు కార్యదర్శి), శ్రీ ఎల్. నిరంజనరావు, శ్రీ బి. వెంకటేశ్వరరావు ప్రభృతులు, ప్రోత్సహించిన వారిలో శ్రీ బాపూరావ్, శ్రీ పార్థసారథి, ఇత్యాదులు చాలామంది ఉన్నారు. మా ఆశయాలకు, యత్నానికి తగిఉండేలా "జాగృతి" అనే పేరిట మా పత్రిక నడవాలని కూడా నిశ్చయమైంది. అయితే ఈ ఆలోచనలకు రూపకల్పన జరిగేందుకు చాలా వ్యవధి పట్టింది. పెట్టుబడికూడా సమస్యే. శ్రీ వెంకటేశ్వరరావు, తదితర మిత్రులు అక్కడా ఇక్కడా ప్రోవుచేసి చేసిన ఋణసహాయంతో చివరకు సర్వధారి మార్గశిర్ష బహుళ విదియా శనివారం 18-12-1948 జాగృతి ప్రథమ సంచిక కవిశిలక ప్రెస్ ద్వారా అవతరించింది. నేను సంపాదకుడుగాను, శ్రీ భండారు సదాశివరావు సహాసంపాదకులుగాను ఉండేవారం. అయితే ప్రథమ సంచిక ఇంకా పూర్తిగా పోస్టయినా చేయబడకుండానే నన్ను, నాటి వ్యవస్థాపకులు శ్రీ శేషగిరిరావుగార్లను ప్రభుత్వంవారు నిర్బంధించారు. మేముచేసిన నేరమేమిటో తెలియలేదు. తీరా విచారిస్తే ఆర్. యస్ యస్. వారు తమపైనున్న నిషేధాన్ని తొలగించేందుకు జరిపిన సత్యాగ్రహవార్త నేదో మూల ప్రచురించామట! ఆనాడు వారి వార్తల నెవరూ ప్రచురించేవారుకాదు. నల్గురితో పాటు మేమూ ఆవార్తలను తొక్కిపెట్టకపోవడం నేరమైంది! నాటి వాతావరణ మలాంటిది! చివరకు మమ్మేదో విచారణచేసి వెంటనే విడుదల చేశారు. పత్రికను నిషేధించేందుకు తగిన కారణం ప్రభుత్వానికి దొరకడంలేదు. కాని ఏదో కన్నెర్ర దానిని పీడిస్తోంది. చివరకు నేను, ప్రచురణకర్తా రు. 2000 చొప్పున ధరావతులు కట్టాలని తాఖీదులు పంపారు. ఈ అన్యాయాన్ని ఎదిరించడం మా కర్తవ్యమైంది. ఎదిరించాం. ఆనాటి జిల్లా కలెక్టర్ శ్రీ పి. క్రోంబీ. స్వతంత్రుడు. హుందాతనం ఉన్నవాడు. మా మాటలలోని న్యాయాన్ని, నిర్దోషిత్వాన్ని గుర్తించి ఆ బెడదలన్నీ వదలించాడు. ఇలా ప్రారంభంలోనే పత్రికా స్వాతంత్ర్యానికై పోరాటం జరపవలసివచ్చింది.

### శ్రీ బుద్ధవరపు వెంకటరత్నం

ప్రథమ సంపాదకులు

ఇలా ప్రభుత్వం మాకు ప్రతిబంధకాలు కల్పించడం ప్రారంభించడంతో అచ్చొత్తేందుకు ప్రెస్సులవాగుకూడ భయపడనారంభించారు. రెండవసంచిక నచ్చొత్తేందుకు ప్రెస్సు కరువైంది! చివరకు ఎలాగోలా శ్రీ సదాశివరావుగారి ప్రయత్నఫలితంగా అజంతా ప్రెస్ శాస్త్రిగారు ధైర్యంతో ముందుకొచ్చారు. తొలిరోజుల్లో రచనల సేకరణకూడా కొంతఇరకాటంగానేఉండేది. మా ఆశయాల కనుగుణమైన విలువైన వ్యాసాలు సేకరించడం ఒక సమస్యగా ఉండేది. ఆ సందర్భంలో కీ. శే. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు, కీ. శే. కొండా వెంకటప్పయ్య,కీ. శే.అడవి బాపిరాజు బోంట్లు మమ్మ చాలా ఉత్సాహపరచేవారు. శ్రీ విశ్వనాథవారుకూడ ప్రోత్సహించేవారు. ఇక శ్రీ దివాకర్ల వేంకటావధాని, శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ, న్యాఫర్త్రిశ్రీ, శ్రీ నూరంపూడి భాస్కరరావు, శ్రీ భాగవతుల కుటుంబరావు, కిరణ్ ఇత్యాదులందరూ మా కిచ్చిన సహకారం అసాధారణమైంది.మా సంపాదకవర్గంలో సభ్యులు కాకపోయినా సంపాదకబాధ్యతా నిర్వహణలో శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయ శాస్త్రి (ప్రస్తుతం గోల్కొండ పత్రికలో పని చేస్తున్నారు.) ఇచ్చిన సహకారంకూడ మరువరానిది. అనుక్షణమూ మారిపోతున్న దేశపరిస్థితులను, ఎక్కువవుతున్న సమస్యలను అర్థం చేసుకుంటూ మా ఆశయాలనుగుణంగా విధా

(తరువాయి 22 వ పుటలో)

### వృధాపోని ఆశీస్సులు

"కలుగుంగావుత మీదు జాగృతికి నిష్కళంకైన సత్కీర్తి పే
ర్వెలయుంగావుత సారభౌమ కిది పృథ్విన్ గౌరవంబిచ్చుచున్
కలిదోషంబు లడంచి జనులకుం గల్యాణ మీగల్గుచున్
చెలగుంగావుత దేశదేశముల వాసిం గూర్పగా జాలుచున్."

కీ॥ శే॥ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి శతావధాని

# ఎదురీత, పెద్దల ఆశీస్సులతో విజయయాత్ర!

## వాస్తవ జాతీయ దృక్పథాన్ని ఆంధ్రుల కిచ్చిన ఏకైక పత్రిక



### శ్రీ భండారు సదాశివరావు

ప్రథమ సహసంపాదకులు

'జాగృతి' తెలుగు వారపత్రిక ప్రారంభమై పది సంవత్సరాలు గడిచి పదకొండో సంవత్సరం వచ్చింది. ఆ సందర్భంలో జాగృతి దశాబ్ద్యుత్సవంకూడా జరుపుకుంటున్నది. ఇది సంపాదక, పాలకవర్గానికే కాక, జాగృతి పాఠకులుకూడా హర్షించవలసిన విషయం. నేడు పత్రికా రచనకూడా ఒక విధమైన గుత్త వ్యాపారం అయిపోయింది. ధనవంతులు వరుసగా అన్ని భాషల్లోనూ పత్రికలు స్థాపించి డబ్బు చేసుకోడంతోపాటు, ప్రజల మనస్తత్వాన్ని తమ కనురూపంగా మార్చుకునేందుకు ప్రభుత్వం చేసే ప్రయత్నాలకు వత్తాసుగా ఉండడంకూడా కన్పిస్తున్నది. ప్రభుత్వ విధానాలు తమకు విరోధంగా ఉన్నప్పుడు తప్పితే, జాతీయ సమస్యలపట్ల ప్రతి పత్రికా చాలావరకు ఉదాసీన భావాన్నే కనబరుస్తూ వస్తున్నది. ప్రజాస్వామ్య రాజ్యంలో పత్రికల పాత్ర చాలా ప్రముఖమైనది. ఒక్కొక్క విధానాన్ని ప్రకటిస్తున్నప్పుడు, దేశంలో నూతన ప్రజాస్వామ్యాన్ని విజయవంతం చేయడానికి, అత్యవసర వార్తలను అత్యవసరంగా గుర్తించి నిష్పాక్షిక విధానం అవలంబిస్తూ, ప్రజలకు ప్రతినిధులుగా, ప్రభుత్వానికి వివరణ కర్తగా ఉండడమేగాక, అవసరమైనప్పుడు ఎంతో దృఢంగా ప్రభుత్వ విధానాలనూ, సమాజంలోని చెడుగులనూ విమర్శించి, ఇటు ప్రజలకూ, అటు ప్రభుత్వానికీ మార్గదర్శిలా, వంతెనలా పనిచేయాలి.

కాని మనదేశంలో ఆ మనస్తత్వం పత్రికల కింకా అలవడలేదు. కొన్ని ప్రభుత్వ, ప్రభుత్వ సమర్థక విధానాలను, ఏవో కొన్ని అత్యవసర పరిస్థితుల్లో - అదీ స్వార్థానికి ఎక్కడ దెబ్బతగులుతుందో ననే భయం పుట్టినప్పుడు- తప్పితే - అవలంబిస్తూన్నాయి. కొన్ని పూర్తిగా శత్రుభావంతో నడుస్తున్నాయి. అంతేగాని పత్రికల నిజమైన స్థాయిని నిలుపుకుంటూ నడిచేవి తక్కువ. అలాంటి పత్రికలు ఒకవిధంగా బ్రతికే అవకాశంకూడాలేదు. ప్రభుత్వాన్నో, పెట్టుబడిదారులన్నో, ఈ రెండూ తప్పినప్పుడు ఏపార్టీనో అంటిపెట్టుకొనినడిచే పత్రికలే దాదాపు కన్పిస్తున్నప్పుడు ఒక ఆదర్శాన్ని, ఒక ఉద్దేశాన్ని అనుసరించి పత్రికలను నడపాలంటే చాలాకష్టమే. అలాంటికష్టాలనే ఎదుర్కొంటూ ఏదైనా ఒక పదికాలాలపాటు పనిచేసినపత్రిక కన్పించిందంటే ఏదో విశేషం ఉన్నదన్న మాటే.

జాగృతి కథలపత్రికకాదు, ఒకటి రెండు కథలనుకూడా ఇస్తున్నా; సినీపత్రికకాదు- ఒకటి రెండు సినీ విమర్శలూ, స్టిల్సూకన్పిస్తున్నా; సరే, దినపత్రికకాదుకదా! అంతేకాక ఈ పదిసంవత్సరాలలో జాగృతిని కొంత విమర్శనాదృష్టితో చూచినవారికి మరోవిషయం గోచరిస్తుంది. అత్యవసర పరిస్థితులలో తప్పితే జాగృతి ప్రాంతీయవార్తలకూ, స్థానిక రాజకీయాలకుకూడా ఎక్కువప్రాధాన్యత ఇవ్వలేదు. ఒకఉద్దేశాన్ని ముందుపెట్టుకొని నడిచిన పత్రికలా కన్పిస్తుంది జాగృతి.

1948 డిసెంబరులో జాగృతిని ప్రారంభించినప్పుడు 'దేశం స్వతంత్రమైంది. ప్రతిపౌరుడూ నేడు దేశం మొత్తానికి ప్రభువైనాడు. ప్రాంతీయ, స్థానిక అవసరాలు, వాటి లాభాలూ తక్షణం కన్పించేవి ప్రత్యక్షంగా ప్రజలకుసంబంధించిన వెన్నిఉన్నా, ప్రతిపౌరుడూ యావద్దేశ సమస్యలతో సంబంధం కలిగిఉండి, యావద్దేశీయ విధానాలను సరిగా ఆకళించుకొని, ఒక ఓటుద్వారా ఆవిధానాలకు వాస్తవ సాఫల్యాన్ని లభింపచేసేట్టు చైతన్యయుక్తంగా ఉండాలి. అలాంటి చైతన్యాన్ని వ్యాపింపచేస్తూ, ఒకరిదయాదాక్షిణ్యాలకూ,ఒకరిభయానికీ లొంగిపోక ప్రజలకు భారతీయ జీవన మాధ్యంగా సమస్యల ఆంతర్యాన్నీ, పరిష్కారాన్నీ వివరించడానికే జాగృతి జన్మించిందని సూచించారు. ఇలాంటి పత్రికలు ఉండడం చాలా అవసరంకూడాను. నిత్యజీవితానికి ప్రజలకు ప్రాంతీయ, స్థానిక ప్రభుత్వ యంత్రాంగంతోటే సంబంధం ఉంటుంది.బాగోగులకు, కష్టనష్టాలకు ప్రజలందుకే స్థానిక, ప్రాంతీయ

(తరువాయి 77 వ పుటలో)

### సార్థకమైన ఆనాటి ఆశాభావం

"ఈ పత్రికను కొలది కాలము క్రిందటనే ప్రచురణ ప్రారంభంచేసి ఉత్సాహముతో పని చేయుచుండుట శ్లాఘ్యము- ఆంధ్రదేశమున మధ్యకాలమున అనేక పత్రికలు బయలు దేరినవి. కాని వానిలో ఏవేవి ఎంతకాలము నడుపబడునో చెప్పుటకు సాధ్యముగాదు. అట్లు ప్రారంభింపబడిన పత్రికలు కొన్ని అప్పుడే మరుగుపడినవి. 'జాగృతి' పత్రిక అట్లు మరుగుపడక జాగ్రతతో చిరకాలము నడుచుచుండునట్లు సంపాదకులు ప్రయత్నింతురుగాక యని కోరుచున్నాను. పత్రిక ఆశయములు శ్లాఘాపాత్రములు......"

కీ|| శే|| దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు

(౨౦ వ పుట తరువాయి)

నాలు నిర్ణయించుకొనడంకోసం స్వధర్మ సంస్థాపనాప్రియులందరితోనూ చర్చించి విధానాలు నిర్ణయించుకుంటుండేవారం. అలాంటి చర్చలలో ఆధునికతకు, ప్రాచీనతకు చక్కని సమన్వయాన్ని కుదుర్చుకొనడంలో శ్రీ బాపూరావ్ ఇస్తుండే సలహాలు మా కెంతగానో ఉపకరిస్తుండేవి.

మాకు తరచు ముద్రణబాధకూడ తప్పలేదు. ఏవారాని కావారమే ప్రసూతి వేదనగావుండేది. ఎప్పటికప్పుడే ఆఖరిఘారము ప్రత్యూషంలోనే బయటపడుతూండేది. (రాత్రితెల్లవార్లు గెటప్, ప్రుయికింగు అయ్యేవి) వాణి, సాహిణి, కృష్ణ, శ్రీరామ, గ్రంథాలయ, యూనివర్సల్ - ఒక టేమిటి ఎన్నిప్రెస్సులలోనో వేయించవలసి వచ్చేది పత్రికను. స్వతంత్రా కస్సరస్సు పుట్టే వరకు బ్లాకుమేకింగుకు తలాకచోటుకు, మద్రాసుకూ పంపవలసివచ్చేది. ఆనాడు ప్రకటనలు కూడా అంతగా లభించేవికావు. వీటిననుసరించుకొని ఆర్థికమైన చిక్కులుండేవి. అన్నీ అలాగే సర్దుకుంటూ పోతుండేవాళ్లం. అదంతా ప్రథమ దశ.

ద్వితీయ దశలో - భారతముద్రణాలయావతరణ కారణంగా మాకు పెద్ద బెడద తీరింది. విజయనామ సంవత్సర విజయదశమినుండి పత్రిక ఢిల్లీలోని హిందూస్థాన్ ప్రకాశన్ ట్రస్టు తరఫున ప్రచురించ నారంభించాం. విడిగా ప్రచురించేకన్న మా ఆశయాలతో సన్నిహితంగా ఉన్న ఆ సంస్థ తరఫున ప్రచురించడం ఎక్కువ ప్రయోజనకరమని భావించాం. ఆ సంస్థకు శ్రీ జి. సోమరాజు, విజయవాడ ప్రతినిధిగా ఉండేవారు. భారత ముద్రణాలయంకూడా వారిదే. ఇలా జాగృతిని ఆ సంస్థతో మిళితం చేయడంతో మా సమస్యలు చాలాభాగం తగ్గిపోయాయి. సరియైన కార్యాలయంకూడా ఏర్పాటైంది. నేనూ, శ్రీ టి. యల్. నారాయణ సంపాదక శాఖలో ఉండేవారం. శ్రీ పి. రామచంద్రమూర్తి, శ్రీ కె. బాలసత్యనారాయణగార్లతో విడివిడిగా ప్రచార, ప్రకటన విభాగాలు ప్రారంభమైనాయి. శ్రీ బాలకవి కుమారస్వామిగారు వ్యవస్థాపక్ గా ఉండేవారు. ఈ విస్తరణతో చాలావరకు విస్తరణ జరిగి క్రమేపీ ప్రజాపత్రిక కాగల విశ్వాసం సుదృఢమైంది. అనేకులు యువరచయితలు, అనువాదకులు పుంఖానుపుంఖంగా రచన సాగించడం జరిగింది. శ్రీ గిరిధరరావు, శ్రీ వీరంరాజు వెంకటేశ్వర్లు, శ్రీ తారానాథ్, శ్రీ ప్రకాశ్, శ్రీ గో. వేం. ల. నరసింహారావు, మొదలగువా రెందరో సహకరించ నారంభించారు.

ఈ దశలోనే కారణాంతరాలవల్ల, నేను ఇతరత్రా స్వీకరించవలసివచ్చిన వివిధ బాధ్యతలవల్ల సంపాదకత్వభారం చాలవరకు శ్రీ నారాయణగారే వహించడం ప్రారంభమయింది. యువకులు, చేయితిరిగిన విమర్శకులు, ముఖ్యంగా రాజకీయ వాతావరణ పరిజ్ఞానంలో సిద్ధహస్తులు అయిన వీరి చాలకత్వంలో పత్రిక చాలా ముందుకుపోయింది. నేడు జాగ్రతి మనకు సమగ్రంగా కనబడుతున్నదంటే వీరి కృషి దానికి కారణమని చెప్పక తప్పదు. ఇదే దశలో ప్రకటనా విభాగం కూడా చాలా బలపడింది. బొంబాయి మార్కెట్ లో జాగృతి స్థిరపడింది. అన్ని విషయాలలోను ఇప్పుడు జాగృతి స్థిరపడ్డ పత్రిక, బహుళ ప్రచారం పొందిన ఒక మహా వ్యవస్థ. వివిధ సమస్యలపై నిష్పక్షపాతంగా పోరాడగల న్యాయవాది. ఈ పదేండ్ల చరిత్రే ఇందుకు తార్కాణం.

ఈ పదేండ్లలోనూ ఎందరిసహకారంతోనో ముందుకు వెళ్ళింది. ఇది ఏఒకరిద్దరి కృషియన్నా అసత్యమే అవుతుంది. మాకు సహకరించిన వారిలో సందర్భానుసారంగా చాలామందిని ఉదహరించాను. వీరుకాక శ్రీ పైడిముక్కల వెంకట్రామయ్య, శ్రీ హనుమచ్ఛాస్త్రి, శ్రీ రాఘవాచార్య, శ్రీ శరభయ్య, శ్రీ మద్దిపట్ల సూరి, శ్రీ సత్యనారాయణరాజు ఇత్యాదులెందరెందరో వివిధ సమయాలలో అనేకవిధాల సహకరించారు. వారందరికీ ధన్యవాదాలు.

తృతీయదశలో జాగృతి మరొక అడుగు ముందుకు వేసింది. ఇంతవరకు హిందూస్థాన్ ప్రకాశన్ ట్రస్టు తరఫున ప్రచురింపబడుతున్న జాగృతి 14-2-58నుండి జాగృతిప్రకాశన్ ట్రస్టు తరఫున నడుపబడ నారంభమైంది. ఢిల్లీ కేంద్రంగా ఉంచుకొని ఇక్కడ పత్రిక ముద్రణాలయం నిర్వహించడం చాలా సాధకబాధకాలతో కూడిన పని యని అనుభవంవల్ల కేంద్రానికీ, మాకూకూడా అర్థమైంది. ఒక స్వతంత్రమైన ట్రస్టును ప్రారంభించాలనే ఆలోచన కల్గింది. ఆస్తులు, అప్పులభారం స్వీకరించే పక్షంలో హిందూస్థాన్ ప్రకాశన్ ట్రస్టువారు దీనిని స్వతంత్రటస్టు కప్పగించేందుకు సంసిద్ధత వెలిబుచ్చారు. పర్యవసానంగా మొదటినుండి మాకు ప్రోత్సాహకులుగాను, మా శ్రేయోభిలాషులుగాను, ఆశయములతో ఏకీభవించేవారూ అయిన శ్రీ నిరంజనరావుగారు, శ్రీ బాపురావ్ గార్లూ, మొదటినుండి కాకపోయినా, ఆ తర్వాత అనేక సంవత్సరాలనుండి మా పత్రిక శ్రేయోభిలాషులలో ముఖ్యులైన శ్రీ పి. లింగయ్య చౌదరి, (బందరు) శ్రీ కె. లక్ష్మీనారాయణ శాస్త్రి (తెనాలి) గార్లతో జాగృతి ప్రకాశన్ ట్రస్ట్ ప్రారంభింపబడ్డది. హిందూస్థాన్ ప్రకాశన్ ట్రస్టుకు చెందిన జాగృతి పత్రిక, భారత ముద్రణాలయం, సాహిత్య నికేతన్ పుస్తక విక్రయశాల అన్నీ ఈ క్రొత్త ట్రస్టుకు ఆస్తి అప్పులతో సహా అప్పగించబడ్డాయి. ట్రస్టుకు శ్రీ లింగయ్యచౌదరిగారు అధ్యక్షులుగాను, శ్రీ నిరంజనరావుగారు కార్యదర్శిగాను ఎన్నికైనారు. ప్రస్తుతం జాగృతి దీని తరఫున ప్రచురితమవుతోంది. ద్వితీయదశలోవలె నామమాత్రపు సంపాదకత్వంకూడా నాకు సాధ్యం కాలేదు. అందువల్ల ఈ దశలో శ్రీ టి. ఎల్. నారాయణ, శ్రీ కందర్ప రామచంద్రరావు గార్లు సంపాదకులుగా పని ప్రారంభమైంది. శ్రీ పి. రామచంద్రమూర్తిగారు ప్రచారవ్యవస్థాపక్ గాను, శ్రీ వి. మహాలింగంగారు ప్రకటన శాఖాధిపతిగాను, శ్రీ కె. శ్రీనివాసశర్మగారు (ట్రస్టు సంస్థల మేనేజరు) వ్యవస్థాపక్ గాను నేడు జాగృతి నడుస్తోంది. ఈనాడు జాగృతి దశాబ్ద్యుత్సవం జరుపుకొనడం పెద్దల ఆశీర్వచన ఫలం, పాఠకుల ఆదరాభిమానాల చలవ; ఏజెంట్లు, ప్రకటనదారుల విశేషాభిమాన పర్యవసానం. ముమ్ముందింకను ద్విగుణీకృతోత్సాహంతో జాగృతి జైత్రయాత్ర చేయగలదని ఆశిస్తున్నాను. ★

# జాగృతి ప్రకాశన్ ట్రస్ట్

రిజిష్టర్డ్ నెం. 151.  స్థాపితం 12–9–57

దేశంలో వ్యాపిస్తున్న విదేశీ జీవన విధానాల స్థానే భారతీయ జీవన విధానాన్ని ప్రతిష్ఠించే ఆశయంతో 12-9-57 వ తేదీన జాగృతి ప్రకాశన్ ట్రస్ట్ స్థాపింపబడ్డది. ప్రారంభంలోనే ఢిల్లీ హిందూస్థాన్ ప్రకాశన్ ట్రస్ట్ వారు ఆంధ్రలోని తమ ఆస్థిపాస్థులను, సంస్థలను ఈ ట్రస్ట్‌కు అప్పగించారు. జాగృతి ప్రకాశన్ ట్రస్ట్ ఆశయములు కార్యక్రమం ట్రస్ట్ డీడ్‌లో ఇలా నిర్వచింపబడ్డాయి :

"ట్రస్టు ప్రధానాశయము భారతీయ సంస్కృతిని - అనగా హిందూ సంస్కృతిని, అనగా ఈ హిందూస్థాన ప్రజల ప్రాచీన సంస్కృతీ సభ్యతలను- పునరుద్ధరించుట, పెంపొందించుట, ప్రచారము చేయుట.

ఈ ప్రధానాశయమును సాధించునిమిత్తం ట్రస్టీలు ఈ క్రింది కార్యక్రమమును కొనసాగింప నిశ్చయించిరి :



పిన్నమనేని లింగయ్య చౌదరిగారు



లక్కరాజు నిరంజనరావుగారు

1. భారతీయ సంస్కృతియొక్క పునరుద్ధరణ ప్రచారములకై తెలుగు, సంస్కృతము, హిందీ లేక ఇతరభాషలలో గ్రంథములను, కరపత్రములను, వివిధములైన పత్రికలను, ఇతర ప్రచురణలను ఉచితముగా పంచుటకుగాని, అమ్మకమునకుగాని ప్రచురించుట, ముద్రించుట.

2. ట్రస్టుయొక్క ఆశయములను సాధించుటకై ముద్రాపకులుగను, ప్రచురణ కర్తలుగను, లిథోగ్రాఫర్‌లుగను, బ్లాక్ మేకర్‌లుగను, టైప్ ఫౌండర్‌లుగను, బుక్ బైండర్‌లుగను, పుస్తక విక్రేతలుగను వ్యాపారమును కొనసాగించుట, ముద్రణ యంత్రములను, ఇతరయంత్రములను స్థాపించుట.

౩. శరీర వ్యాయామంలోనూ, అస్త్రవిద్యలోనూ, ఆటలలోనూ భారతీయ పద్ధతులను పునరుద్ధరించి, పెంపొందించి, ప్రచారం చేసేనిమిత్తం వ్యాయామశాలలను, క్రీడా కేంద్రాలను, క్లబ్బులను, అట్టి ఇతర సంస్థలను స్థాపించుట, నడపుట; వానికి సహాయపడుట.

ఈ ఆశయాలకు క్రమ క్రమంగా రూపకల్పనచేయ ట్రస్ట్ సంకల్పం. ఇందుకై భారతీయ సంస్కృతీ ప్రియులందరియొక్క, అన్నివిధాలైన సహకారమును, ఎల్లప్పుడు అభిలషించుచున్నది.



బాపూరావ్ జీ



కె. వి. యల్. యన్. శాస్త్రిగారు

# వివిధ దేశాల పత్రికల కొన్ని విశేషాలు

## భారత్‌లో పత్రికాస్వేచ్ఛ ఉంది కాని ప్రభుత్వానికి విమర్శ అయిష్టం!

ఇంతవరకూ అందిన లెక్కలనుబట్టీ 1957 సంవత్సరంలో భారత దేశంలో ఆంగ్ల పత్రికల సర్క్యులేషన్ 0.9%; తెలుగు పత్రికల సర్క్యులేషన్ 28.9% పెరిగింది. హిందీ పత్రికల సర్క్యులేషన్ 8.8% తగ్గింది. ఆంగ్ల పత్రికల సర్క్యులేషన్ అత్యధికం 24.67 లక్షలు. 22.3% ద్వితీయ స్థానం హిందీ పత్రికలది. 20.25 లక్షలు 18% తెలుగు పత్రికల సర్క్యులేషన్. 5% దిన పత్రికల సర్క్యులేషన్ 31.46 లక్షలు అందులో ఆంగ్ల దినపత్రికల సర్క్యులేషన్ 10.05 లక్షలు. హిందీ పత్రికలు 3.64 లక్షలు. తెలుగు పత్రికల సర్క్యులేషన్ ఒకటి రెండు లక్షల మధ్యఉంది.

## ఆంధ్రలో 260 పత్రికలు

1957 డిశంబరు 31 నాటికి ఆంధ్రప్రదేశ్‌లో మొత్తము మీద 260 పత్రికలు ఉన్నట్లు తెలిసింది. వీటిలో 16 దినపత్రికలు, 76 వారపత్రికలు, 116 మాసపత్రికలు. 1957లో 46 కొత్తపత్రికలు ప్రారంభంఅయినవి.

కొత్తగా ప్రారంభమయిన వాటిలో 25 తెలుగువి. వీటిలో ఒక్కటి దిన పత్రిక. 5 వార పత్రికలు, 16 మాసపత్రికలు. ఇవి కాగా 6 ఇంగ్లీషు పత్రికలు, 5 ఉర్దూ పత్రికలు, ఒక హిందీపత్రిక కూడా ఆరంభమయినవాటిలో ఉన్నాయి.

1956 ఆఖరికి ఆంధ్రప్రదేశ్‌లో మొత్తంమీద 101 పత్రికలగురించి నికరమయిన సమాచారం సేకరించడం జరిగింది. ఇవికాక మరియొక 73 పత్రికలు ఉన్నాయని తెలిసింది. కాని వీటినిగురించిన వివరాలు మాత్రం లభ్యంకాలేదు. ఇంకా 32 పత్రికలగురించి సమాచారం దొరకనేలేదు.

(ప్రెస్ రిజిష్ట్రార్ కార్యాలయ సమాచారం)

* * * *

భారతదేశంలో పత్రికా స్వాతంత్ర్యం ఉంది. అయితే ప్రజాస్వామ్య పత్రికారచన ఇంకా బాగా వికసించవలసి ఉంది.

ప్రతిదానికీ ప్రభుత్వాన్ని గ్రుడ్డిగా సమర్థించడం అధిక సంఖ్యాకుల ధోరణిగాఉంది. విజ్ఞతా పూర్వకమైన విమర్శ తక్కువగాఉంది. ఆచరణలో ప్రభుత్వ విధానాలు, వైఖరి విమర్శకు విరోధంగాఉన్నాయి. వస్తున్న కొద్దివిమర్శనుకూడా సహించలేక ప్రధానమంత్రి ఇటీవల ఇలా అన్నారు. "మనం (కాంగ్రెసు) చేసే తీర్మానాలన్నీ చప్పగా ఉన్నవనీ, మామూలుగా ఉన్నవనీ విమర్శించడం ఇతర పక్షాలవారికేగాక పత్రికలకుకూడా ఒక అలవాటుగా తయారైంది. ఈ వైఖరి పొరబాటు. కాంగ్రెసు సమావేశాలన్నీ, ప్రతి ఒక్క సమావేశమూ చాలా ముఖ్యమైనదని గమనించడం అవసరం."

## బ్రిటన్‌లో ఒక్కొక పాఠకుడూ అనేక పత్రికలు కొంటాడు

ప్రపంచంలోని మరే ఇతర దేశంకన్నకూడా బ్రిటన్‌లో ఒక్కొక పాఠకుడు ఎక్కువ పత్రికలు కొంటాడు. ప్రతి రోజూ బ్రిటనులో వెయ్యి మందికి 609 దిన పత్రిక అమ్ముడు పోతుంటాయి. ద్వితీయ స్థానం స్వీడన్‌ది (506). అమెరికాలో 352.....అయితే బ్రిటనులో ఇలా కొనడం ఎక్కువే అయినా ఉన్న ఉదయపు దినపత్రికలు తక్కువ. వీటిలో కొన్నిటి సర్క్యులేషన్ ప్రపంచంలోకెల్ల చాల ఎక్కువ. సగటున రోజూ సగటున ఒక్కొక పత్రిక 2,54,000 ప్రతులమ్ముడుపోతాయి. డైలీ మిర్రర్ సంఖ్య అత్యధికం 46,57,873 ప్రతు అమ్ముడుపోతాయి." అన్నిటికన్న తక్కువ అమ్ముడు పోయే పత్రిక కమ్యూనిష్టుల డైలీవర్కర్. 62,351 మాత్రమే. (లండన్‌లోని సెంట్రల్ ఆఫీస్ ఆఫ్ ఇన్ఫర్మేషన్, రిఫరెన్సు డివిజన్ సమాచారం)



ఆంధ్రలో హిందూస్థాన్ ప్రకాశన్ ట్రస్ట్ ప్రతినిధిగా పనిచేసిన శ్రీ జి. సోమరాజు

## రష్యాలో పత్రికాస్వేచ్ఛ ఉంది కాని అది క్రెమ్లిన్ ఆజ్ఞలకు పరిమితం!

రష్యాలో పత్రికా స్వాతంత్ర్యం ఉంది. కాని అది క్రెమ్లిన్ కనుసన్నలకు పరిమితం! చదువరులూ ఉన్నారు. కాని వారికి లభించేది అధికారంలో ఉన్నవారి బులెటిన్లు!

* * *

| కొన్ని రష్యను పత్రికలు | వాటి ప్రచురణకర్తలు |
| --- | --- |
| ప్రావడా | కేంద్ర కమ్యూనిష్టు కమిటి |
| ఇజ్వెష్టియా | సుప్రీం సోవియట్ ప్రెసీడియం |

| | |
|---|---|
| ట్రూడ్ | సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ |
| ఇండస్ట్రియల్ & ఎకనామిక్ న్యూస్ పేపర్ | మంత్రివర్గం క్రిందనున్న ఒకకమిటీ |
| ఎగ్రికల్చర్ | వ్యవసాయ మంత్రివర్గం |
| విజిల్ | రైల్వేమంత్రి, రైల్వే కార్మిక సంఘం |
| లిటరరీ గజెట్ | రచయితల సంఘం |
| సోవియట్ సంస్కృతి | ప్రభుత్వ సంస్కృతిశాఖ |
| మెడికల్ వర్కర్ | ఆరోగ్యశాఖ వగైరా |
| రెడ్ స్టార్ | రక్షణశాఖ |

(యు. యస్. యస్. ఆర్. రిఫరెన్సు బుక్)

పైన మనకెక్కడా స్వేచ్ఛగా పౌరులు, సంస్థలు నడిపే పత్రికలు కనిపించవు! అన్నీ ప్రభుత్వశాఖలో, పార్టీయో నడిపేవిమాత్రమే! ఇలాంటి పత్రికలు 7537 (1957 లెక్కలప్రకారం) ఉన్నాయి. అవి మొత్తం 5,35,00,000 ప్రతు లమ్ముడుపోతాయి.

## అమెరికా పద్ధతులు:

## మీఇంటివద్ద అచ్చయ్యేపత్రికలు

అమెరికాలోనూ మనదేశంలోలాగానే పత్రికలకు పూర్తిస్వేచ్ఛ ఉన్నది. అక్కడ నూటికి నూరుమంది చదువుకొన్నవారు అయినందున పత్రికలు చదివేవారిసంఖ్యా, దానితోపాటే పత్రికలు అమ్ముడుబోయే సంఖ్యా అపారంగా ఉన్నది. ఈనాడు న్యూయార్కు టైమ్స్ పత్రిక ఆదివారం సంచిక 60, 70 పేజీల దాకా వేస్తుంటారు.

నేడు అమెరికాలో అచ్చగా దిన పత్రికలే, 1,750 ఉన్నవి. ఇవన్నీ నిత్యం అమ్మే మొత్తం ప్రతుల సంఖ్య 5,70,00,000. వీటిలో కొనిటికి అంతర్జాతీయ ప్రచారం, మరి కొన్నిటికి దేశవ్యాప్త ప్రచారం ఉన్నది. మిగతావి రాష్ట్ర, ప్రాంతీయ, పట్టణ దినపత్రికలు. కాగా వార పత్రికలు, వారానికి రెండుసార్లు వచ్చేవి, మూడుసార్లు వచ్చేవి అమెరికాలో 10,000 దాకా ఉన్నవి. ఇంకా అనేక మాస పత్రికలుకూడా ఉన్నవి.

ప్రస్తుతం న్యూయార్కు టైమ్సు పత్రిక సాగిస్తున్న పరిశోధన పూర్తిగా ఉపయోగంలోకివచ్చినప్పుడు "7 నిమిషాల క్రిందటి తాజా వార్త" అనికూడా వ్రాసే అవకాశం కలుగుతుంది. ఈ క్రొత్త పరిశోధన విప్లవాత్మకమైనది. దానిప్రకారం పత్రిక అచ్చయి మన ఇంటికి రానక్కరలేదు. ఇంటింటా రేడియో సెట్టులాగానే ఒక యంత్రమూ, న్యూస్ ప్రింట్ కాగితం చుట్టలూ ఉంటవి. పత్రికా కార్యాలయంలో ఎడిటింగ్ జరుగుతూ, ఎప్పటివార్తలు అప్పుడు మామూలు పత్రిక- పేజీ సైజులోనే ఏ పేజీ కాపేజీ అక్కడ పత్రికా కార్యాలయంలో మీటనొక్కితే ఇక్కడ మన ఇంటిలో అచ్చయే ఏర్పాటుకోసం పరిశోధన సాగిస్తున్నారు. అమెరికాలో కల్లా రీడర్సు డైజెస్టు పత్రిక హెచ్చు సంఖ్యలో పోతుంది. ప్రతిసంచిక, 1,02,75,979 ప్రతులు వేస్తారని 1955 సంవత్సరపు ఆడిట్ బ్యూరో ఆఫ్ సర్క్యులేషన్సువారి లెక్కల ప్రకారం తెలుస్తున్నది. లైఫ్ పత్రిక ప్రతిసంచిక 55,07,456 ప్రతులు, టైమ్స్ ప్రతిక 18,60,512 ప్రతులు పోతుంది.

ఇక దినపత్రికలసంగతి తీసుకుంటే 1955నాటి పై సంస్థ లెక్కలనుబట్టి 'న్యూయార్కు న్యూస్' అనే పత్రిక హెచ్చుగా పోతుంది. సోమవారంనుంచి శనివారంవరకు అమ్మే ప్రతులు రోజుకు సగటున 20,94,564 కాగా ఆదివారం 36,94,851 ప్రతులు పోతున్నవట. న్యూయార్కు టైమ్సు 5,55,726 ప్రతులు, ఆదివారం 12,27,708 ప్రతులు. బాల్టిమోర్ సన్ పత్రిక 3,98,069, ఆదివారం 3,19,460 ప్రతులు పోతుంది. షికాగో ట్రిబ్యూన్ రోజూ 9,07,570, ఆదివారం 14,28,916 ప్రతులు పోతుంది. అమెరికాలో పత్రికల అమ్మకాల ధోరణికి ఇవి కొన్ని ఉదాహరణలు. ఆదేశంలో సంపాదకులవీ, రచయితలవీ మొత్తం 100కు పైగా సంఘాలున్నవి. ప్రపంచంలో మొట్టమొదటగా జర్నలిజాన్ని పాఠ్యాంశంగా బోధించే కార్యక్రమం అమెరికాలో మిస్సోరీ విశ్వవిద్యాలయం యేర్పాటు చేసింది.

(శ్రీ బి. ఎస్. ఆర్. కృష్ణ.)



# హిందువులంగా జీవిద్దాం! హిందూస్థానం సృష్టిద్దాం!!

— స్వామి చిన్మయానంద —

నైతిక, సాంస్కృతిక రంగాలలో పతనమైఉన్న నేటి స్థితిలో ధర్మాన్ని పూర్తిగా త్యజించడమంటే పతనాన్ని త్వరితాతి త్వరితంగా పూర్తిచేయడమే అవుతుంది. మన మతం ఎంత పతనస్థితిలో వున్నదనుకున్నా, ఏమతమూ లేని స్థితికన్న అది నయమే. హిందూత్వాన్ని పునరుద్ధరించుకొని, నిరూపితమైన దాని వైశిష్ట్య ఛాయల్లో, గతమందు మనము సంస్కృతీ, నాగరికతా రంగాలలో అనుభవించిన ఘనమైన దశకు చేరయత్నించడమే విజ్ఞత.

భారతదేశంలో హిందూత్వమనగానే మనకు ఏవో కొన్ని ఆచారాలు, ఏదో ఒకరకం వేషభాషణాదులు, ఆహారవిహారాదులు అనేమాత్రం లోకి వచ్చినమాట నిజమే. మన దేవుళ్లు 'కంట్రోలు ఆఫీసర్ల' స్థాయికి పడి, భక్తులైన హిందువులు ఏదో రుసుం చెల్లించగానే వారికోర్కెలకు 'పర్మిట్లి'చ్చే దాతలస్థితికి వచ్చారు!

ఈ పతనం ఏదో ఆకస్మాత్తుగా జరిగిన చారిత్రిక ఘటనకాదు. వేల సంవత్సరాలుగా హిందూత్వం స్థితి 'ఎవడికి పుట్టిన బిడ్డవిరా ఎక్కెక్కి ఏడుస్తావ'న్నట్లున్న అనాథ బాలుని స్థితిగా ఉంది. దానిని పోషించే ప్రభుత్వంగాని, ప్రోత్సహించే ధనికులుగాని లేరు. ఒకానొక సమయంలో విజ్ఞానవంతులైన వేదాంతులు ప్రభుత్వానికి సలహాదార్లుగా ఉండేవారు. కాలక్రమాన ఆ సలహాదార్ల స్థాయీ పడిపోయింది, పరిపాలకుల స్థాయీ పడిపోయింది. వారంతా విలాసాల వెచ్చదనంలో, అధికార తృష్ణలో చిక్కుకుపోయి నేడు మన మున్నదుస్థితి దాపురించింది. నేడు విద్యావంతులు వ్యతిరేకనినాదాలు చేస్తోంది నిజంగా ఈ అధర్మంవల్లనే.

హిందూత్వం పరిశుద్ధతకు సంబంధించిన మహా విజ్ఞానం. మనం యత్నించి అందుకొనదగిన, భాగం పంచుకొనదగిన పటుత్వం అందులో ఉంది. మన వైయక్తిక, సాంఘిక, జాతీయ, అంతర్జాతీయ సమస్య లన్నిటికీ అందులో చక్కని సమాధానాలు లభిస్తాయి. హిందూత్వానికి ఆధారభూతాలైన అనేక అంశాలు మన పవిత్ర గ్రంథాలలో కనిపిస్తాయి. హిందూత్వం వేదాంత మతం; ఉపనిషత్తుల శాశ్వతమతం.

మానవుడు చరమదశలో ఏకంగా భగవంతుడే అవుతాడని ఉపనిషత్తులు అసందిగ్ధంగా ఉద్ఘాటిస్తున్నాయి. తనలోని నిత్య సత్యరూపమైన సుందర దైవత్వాన్ని కప్పివేసే పంకిలాలను అనుక్షణమూ కడిగివేసుకుంటూ, జీవితంలోని నిత్యానుభవాలతో క్రమబద్ధమైన, శాస్త్రీయ జీవితాన్ని గడపమని అతడు సూచింపబడ్డాడు. ఒక వ్యక్తి ప్రయత్నపూర్వకంగా, తనను పవిత్రం చేసుకొని నిత్య ప్రకృల స్వరూపాన్ని ఎలా పొందాలి? అనేదే హిందూత్వంలోని విషయ సంగ్రహం. పురాణ, ఇతిహాస, శాస్త్రాది వేల గ్రంథాల, సిద్ధాంతాల ఘన వర్ణనల (Camouflage) క్రింద ఆరాధింపబడే పవిత్ర సత్యనిలయం హిందూత్వంలో ఉంది. ఇవన్నీ ఎంత ఎక్కువైపోయాయంటే ఈనాటి కళాశాలాశిక్షిత నిరక్షరాస్యుడు ప్రాచీన సంస్కృత రచనల యెడ అజ్ఞానముచే ఈ తోరణాల మధ్యనున్న సత్యనిలయాన్ని దర్శించలేకపోతున్నాడు.

మతంయందు విశ్వాస మున్నవారు దాని కమనీయమైన సూత్రాలను అనుసరించడానికి సిద్ధంగా లేకపోతే అది నిష్ప్రయోజన మవుతుంది. నిజానికి రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక తత్వం, సిద్ధాంతం ఏదైనాసరే, నిత్యజీవితంలో దాని ననుసరించేవారు లేకపోతే అది మనకు కల్గించే ఉన్నతి ఏమిఉంటుంది?

మన సంస్కృతి ఎంత గొప్పదైనా, చరిత్ర పుస్తకాల్లో పేర్కొనబడ్డ ఆ గత వైభవంవల్ల ఈనాటి కష్టదశలో మనకు ఒరిగేదేమీ ఉండదు. ఆఫ్రికా అడవుల్లో ఉండే కొండజాతి వాళ్లు అత్యంత ఆధునిక నాగరికులుగా తయారుకావాలనుకుంటే ఆధునిక జాతుల నాగరికతలను గూర్చి చదువుతే ఆ పరిణామం రాబోదు. నాగరిక జీవిత మూల్యాలను గుర్తించి జీవించాలి. కేవలం తెలుసుకొని ఊరుకుంటే చాలదు. తమ విజ్ఞాన ఫలితాన్ని వారు పొందగలిగేది ఆ ప్రకారం జీవిస్తేనే. అలా నాగరికులుగా తయారు కావాలనుకుంటే వారి నేటి అనాగరిక ప్రవృత్తులను, ఆలోచనలను పూర్తిగా త్యజించవలసి ఉంటుంది.

త్యజించడం అనేది లేకుండా ఎలాంటి అభివృద్ధీ ఎన్నడూ సాధ్యంకాదు. యువకులమై మహత్తర కార్యాలకు సిద్ధపడాలంటే బాల్యావస్థను, బాల్యక్రీడలయందలి వ్యామోహాన్ని

త్యజించాలి. మళ్లీ యవ్వన తీవ్రతలను త్యజిస్తే గాని మాననీయమైన వయసును చేరం.

భౌతికజీవితపు అల్ప పశు మూల్యాలను త్యజించి, సత్యభూయిష్ఠమైన ధార్మిక జీవన మూల్యాలను స్వీకరిస్తేగాని ధర్మదేవత ఆశీర్వచనం లభ్యంకాదు. పాకశాస్త్రాన్ని చదివితే-అది ఎంత చక్కగా వ్రాయబడ్డా ఆకలి తీరదు. మందుపేరు ఎన్నిమార్లు ఉచ్చరించినా రోగం నయంకాదు. మనకు రోగం నయంకావాలంటే మనమే ఆమందును తినాలి. అలాగే ధర్మం నిర్దేశించిన జీవన మూల్యాలను అనుసరించినప్పుడే దాని ఆశీర్వచనం మనకు లభిస్తుంది.

ప్రతిమానవుడు తన పరిమిత జీవితకాలంలో సర్వమతముల సారమగు ఆ శాశ్వతానంద పదాన్ని గుర్తించ యత్నించాలి. ఉపనిషత్సత్యముల వెలుగులో, మన సాంఘిక జీవనమున మత ప్రాముఖ్యతగల వివిధ వ్యవస్థల వెనుకనున్న శాస్త్రీయ దృక్పథాన్ని గుర్తించ యత్నించవచ్చు. చివరకు మనం అసలు హిందూత్వమను పరమపావన విజ్ఞానాన్ని దర్శిస్తాం.

హిందూత్వమంటే ఏమిటో తెలుసుకుందాం. హిందూత్వం సత్యబద్ధమని గుర్తించినప్పుడు, ఇక ఈ ప్రాచీన పవిత్ర ధార్మిక మూల్యాలను జీవితంలో వీలున్నంతవరకు అనుసరిస్తానని మనకోసమే కాకుండా, ఈ సమస్త ప్రపంచ అభ్యున్నతికోసంకూడా నిజాయతీతో ప్రతిజ్ఞ తీసుకుందాం.

మనం హిందువులంగా జీవిద్దాం! వేల శంకరులు, వందల బుద్ధులు, వివేకానందులతో కూడిన హిందూస్థానాన్ని సృష్టిద్దాం !!

(కేనోపనిషత్ గ్రంథంనుండి)

ఒక విధముగాఁ జూచిన హైందవమానసము వాస్తవిక జీవిత సంబంధమైనది. మఱియొక విధముగాఁ జూచిన ప్రపంచవిముక్తికి హైందవుఁడు సదా యన్వేషించుచున్నట్లుండును. సూర్యుఁడు, జలము, వాయువు, భూమి, ఇతర పదార్థములన్నియు భౌతికవస్తు రహస్యములం దత్యుత్తమముగ నిమిడియున్న వనియు తెలిసికొనుట సులభము. కాని హైందవుఁ డీ పరిజ్ఞానముతో తనియఁడు. అతనిదృష్టి యాంతరంగికమైనది. తత్పరిజ్ఞాన సంపాదన మతని లక్ష్యము. అనంతము, అదృష్టము, తాత్త్వికమునగు జ్ఞాన సంపాదనమున కాతఁడు సదా తహతహలాడును. ఏతత్సంపాదనతోడనే యాతఁడు తృప్తిఁజెందక, యా యనంతమును పరిమిత మొనర్చుటకు; నదృష్టమును దృష్టమొనర్చుటకు; తత్త్వమునకు రూప మొసఁగుటకు సదా యత్నించుచుండును. హైందవుఁడు తన హృదయమును, మేధను, కడకు తన సర్వస్వమును ఏవంవిధ భావనా మార్గమున ధారవోసి, తన ఈ తపస్సునకు ఫలితముగా భగవంతుని దర్శించి, సృష్టిముఖతః వ్యాఖ్యానించును. ఇట్టి హైందవ ద్వంద్వ స్వభావమునందే హైందవ జీవిత, మత, వాఙ్మయ, నాగరికతా రహస్య మిమిడియున్నది. మహోన్నతాధ్యాత్మికత్వము, విపరీత భౌతికత్వముతో సామరస్యపూర్వకముగా కృషి సల్పవలయునని జయప్రదముగ యత్నించుచున్నది. ఒక వైపునుండి మనము సమస్త భౌతిక ప్రపంచమును నాధ్యాత్మిక దివ్యదృష్టితో తిలకింతుము. ఈ ప్రపంచము బుద్బుదప్రాయమని, మాయ యని భావింతుము. మఱియొక వైపునుండి యాధ్యాత్మిక దివ్యతత్త్వమును సత్యసౌందర్య సముద్దీపిత రూపములుగా నిర్మించుకొని యానందరతుల మగుదుము. ఇది మహోదాత్త వేదాంత రహస్యము.

— యోగి శ్రీ అరవింద.

# ★ హైందవ విజ్ఞాన వైశిష్ట్యం ★

> హైందవవిజ్ఞాన వైశిష్ట్యం ఆధునికులకు అపరిచితం. స్వీయవిజ్ఞానం విషయంలో మనం అజ్ఞానులంగా తయారయ్యేందుకు చరిత్రలో జరిగిన కుటిలయత్నాల పర్యవసానమది. ఫలితంగా హిందూత్వమంటే 'బూజు' అనేవారు, సనాతన ధర్మమంటే ఒళ్ళు మంట అనేవారు. భారతీయ సంస్కృతి అంటే ఆవుపేడ సంస్కృతి అని ఈసడించేవారు, హిందూరాష్ట్రమంటే మతోన్మాద రాజ్యమనేవారు - ఇత్యాది కుక్కమూతి పిందెల్లాంటివారు చాలా మంది తయారైనారు. అయితే కాలం మారింది. ఇటీవల హైందవ విజ్ఞానం విషయమై దేశం నలుమూలలా ఒక నవ చైతన్యం, జాగృతి ప్రారంభమైంది. 'నేను హిందువును' అని సగర్వంగా చెప్పుకునే వారు కోట్లకొలది అవతరిస్తున్నారు. హైందవ విజ్ఞానవైశిష్ట్యం వెల్లడిచేయ ప్రయత్నాలారంభమయినాయి.
>
> సమాజ జీవనంలో హిందూవిజ్ఞానం స్పృశించని, అంశంలేదు. అన్నం ఎలా తినాలి? అనే విషయం మొదలు అంతర్జాతీయ రాజదౌత్యం ఎలా జరగాలి? అనేవిషయం వరకు అన్నిటినిగూర్చి ఉత్తమోత్తమ విచార ధారను వెల్లడిస్తుంది మన విజ్ఞానం. ప్రతి అంశంలోను లౌకిక, ఆధ్యాత్మిక జీవన సమన్వయం ద్యోతకమవుతుంది. ప్రస్తుత శీర్షిక దానికి పరిచయ మాత్రం. కొన్ని విషయాలమీద-ముఖ్యంగా లౌకిక విషయాలమీద - మన విజ్ఞానస్వరూపాన్ని పరిచయంచేయడందీని లక్ష్యం. ఇలాంటివిషయాలపై రచయితలు ముందు ముందు చక్కచక్కని చిక్కనైన వ్యాసాలు పంపితే ప్రత్యేకంగా ఆదరింపబడుతాయి. - సం.

== ౧ ==

## శారీరక, మానసిక, ఆధ్యాత్మిక సౌభాగ్యాన్ని లక్షించే హిందూ వ్యాయామ పద్ధతి

### ✻ స్వామి శివానంద ✻

భారతీయ ఋషులు, యోగులు రూపొందించిన శరీర వ్యాయామ యోగములలోని విశిష్టలక్షణములు అనేకములు. యోగాసనముల పద్ధతి శాస్త్రీయ సిద్ధాంతములపై ఆధారితమైనది. అనిశ్చితములైన కల్పనలు దానిలో లేవు. జీవనలక్ష్యములైన ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములను సాధించుటకై సుశిక్షితము, కార్యదక్షము అయిన అత్యుత్తమ సాధనముగా మానవ శరీరమును రూపొందించు నిమిత్తము శరీరావయవ నిర్మితిని సమగ్రమొనరించునవి, కాల పరీక్షకు నిలచినవి అయిన విశిష్ట పద్ధతులు దానిలో ఉన్నవి.

సుఖజీవితాన్ని గడిపేందుకు అమూల్య సాధనం ఏది? ఆరోగ్యమే ఆ సాధనం. "శరీరమాద్యమ్ ఖలు ధర్మసాధనమ్"- మానవ జీవితం యొక్క లక్ష్యాన్ని సాధించటానికి శరీరము ప్రప్రథమమైన సాధనము. చరక మహర్షి తన సంహితలో ఇలా అన్నాడు:

"ధర్మార్థ కామ మోక్షాణామ్
ఆరోగ్యం మూల ముత్తమమ్।
రోగా స్తస్యాఽపహర్తార
శ్శ్రేయసో జీవితాయ చ॥"

ధర్మార్థ కామమోక్షములకు మూలాధారం ఉత్తమమైన ఆరోగ్యము. రోగములు దానిని నశింప జేస్తాయి. కనుకనే ప్రాచీన ఋషులు ఆంతరికమైన, బాహ్యమైన ఆరోగ్యమును కలిగించి, శారీరకములైన బాధలను రోగములను తొలగించు యోగాసనములను ఏర్పరచిరి.

మెదడును, కండరాలను, నరములను, లోపలి అవయవములను, శక్తివంతం చేసే యోగాసనాలు నేటి ప్రపంచంలో ప్రచారంలో ఉన్న వ్యాయామ పద్ధతులన్నిటిలో అద్వితీయము, విశిష్టము అయిన స్థానమును కలిగిఉంది. యోగాసనాల ద్వారా మనము శారీరక, మానసిక ఆరోగ్యాన్ని మాత్రమే కాక ఆధ్యాత్మికానుభవాలను కూడ పొందగలం. ప్రతిదినం 15 నిమిషాలపాటు ఆసనాలు వేయటంవల్ల వ్యక్తిలో ఉత్సాహం ఇనుమడించటమే కాక అతనికి చక్కని శరీర సౌష్టవం ఏర్పడి తద్వారా అతని అందం పెంపొంది, అతని ప్రతి కదలికలోనూ ఆకర్షణనూ, ఆహ్లాదాన్నీ కలిగించే సౌలభ్య ఏర్పడుతుంది.

యోగాసనాల సాధనవల్ల మానసిక కల్లోలం తగ్గి ప్రసన్న చిత్తం ఏర్పడుతుంది. ప్రాణశక్తి శరీరమంతటిలో, దాని వివిధ అవయవాలలో సరైన పాళ్ళలో సరఫరా అవుతుంది; ఆంతరికమైన అవయవాలు సక్రమంగా పనిచేస్తాయి; పొత్తికడుపులోని అంగాలకు మసాజ్ ఇవ్వబడుతుంది. పాశ్చాత్య వ్యాయామ పద్ధతులు ప్రాణశక్తిని బయటకు లాగుతాయి, ఆసనాలు ప్రాణశక్తిని లోనికి పంపుతాయి. ఆసనాలు చాల రోగాలను నయంచేయటమే కాక కుండలినీ శక్తిని జాగృతం చేస్తాయి. ప్రపంచంలోని మరొక వ్యాయామ పద్ధతివల్ల సాధ్యం కాదు.

శరీరాన్ని అదుపులో ఉంచటానికీ, క్షాళితం చేయటానికీ, దానిలోని వివిధాంగాలమధ్య సామరస్యాన్ని ఏర్పరచటానికీ ఆసనాల

ప్రయోజనం అసామాన్యమైనది. స్త్రీ పురుష విభేదం, ప్రాక్పశ్చిమాల విభేదం లేకుండా అందరికీ ఆచరణయోగ్యమైన విధంగా రూపొందించబడినవి ఈ ఆసనాలు. నివారణకు, చికిత్సకు కూడా ఇవి పనికివస్తాయి. కొన్ని ఆసనాలు శరీరాన్ని ముందుకూ, వెనుకకూ వంచుతాయి; కొన్ని వెన్నెముకను ప్రక్కలకు వంచుతాయి. ఈ విధంగా శరీరమంతటికీ స్వస్థత చేకూరుతుంది. ఈ ఆసనాలు తేలికైనవి. ఎక్కువ కాలాన్ని తీసుకోవు. వీటిని స్వయంగా మరొకరి ఆసరాలేకుండా చేయవచ్చు. ఇలా ఈ ఆసనాలలో అనేకమైన ప్రత్యేకతలున్నాయి.

శీర్షాసనం చేయటంవల్ల మెదడుకు రక్తం సమృద్ధిగా ప్రవహిస్తుంది. కనుక జ్ఞాపకశక్తి, మేధస్సు పెరుగుతాయి. వెన్నెముకకు, వెన్నుపూసలకు కావలసినంత రక్తం ప్రసరిస్తుంది. దృష్టి అభివృద్ధి చెందుతుంది. నెరసిన వెంట్రుకలు నల్లబడతాయి. చికిత్సకు లొంగని అనేక రోగములు ఈ ఆసనంవల్ల నయమవుతాయి. స్వప్న స్ఖలనములు పోతాయి. ఇది వీర్యశక్తిని ఓజశ్శక్తిగా పరివర్తనం చేస్తుంది. శరీరములోని నరములు శక్తివంతములు, పటిష్టములు అవుతాయి.

జీవప్రకృతిలో ఎండోక్రైన్ (Endocrine) గ్రంథులు ప్రముఖస్థానాన్ని వహిస్తాయి. సర్వాంగాసనం థైరాయిడ్ (thyroid) ను ఆరోగ్యస్థితిలో ఉంచుతుంది. థైరాయిడ్ సక్రమంగా పనిచేసినప్పుడు శరీరములోని అంగములన్నీ చక్కగా పనిచేస్తాయి. ఈ ఆసనం ద్వారా అడ్రినల్లు, పిట్యూటరీ, పినియల్ గ్రంథులు చక్కబడతాయి.

ధనురాసనం, మయూరాసనం, పశ్చిమోత్తానాసనం- వీటిద్వారా వృక్వకము (diaphram), పొత్తికడుపును, ఛాతీని వేరుచేయు కండరం- బలపడుతుంది. వృక్వకము యొక్క కదలికవల్ల పొత్తికడుపులోని అంగములకు మసాజ్ కలుగుతుంది. ప్రతిఉదయం మల విసర్జన సక్రమంగా జరుగుతుంది. మలబద్ధము, కడుపుకు, ప్రేవులకు సంబంధించిన ఇతర రుగ్మతలు నిర్మూలమవుతాయి. శ్వాసావయవాలను పటిష్టం చేసేవి, పొత్తికడుపుకు సంబంధించినవి, ఆంతరికములైన అంగోపాంగములనుశుభ్రపరచేవి ఇలా అనేకములైన ఆసనాలున్నాయి.

ప్రాణాయామంవల్ల ఊపిరితిత్తులలోని కేశనాళముకు ప్రాణవాయువు సమృద్ధిగా అందుతుంది. తద్వారా రక్తంయొక్క పరిమాణంలోనూ, గుణంలోనూ అభివృద్ధి కలుగుతుంది. జీవాణువులకు కావలసినంత స్వచ్ఛమైన రక్తం, రసం (Lymph) దొరుకుతాయి.

ఆసనాలు చేయటం వల్ల ధమనులలోను, శిరలలోనూ రక్తప్రసరణ సరైన విధంగా జరుగుతుంది. శరీరంలో ఏభాగంలోకూడ రక్తం నిలువ ఉండిపోదు. వెన్నెముక పటిష్టమవుతుంది. ఆసనాలు చేయటంవల్ల ధమనులు గట్టిపడటం (Arteriosclerosis) నివారింపబడుతుంది. సాధకుడు చాలాకాలం, ఉషారుగా ఉంటాడు. అతని వెన్నెముక సాగుతుంది. అతనికి మంచి ఆకలి ఉంటుంది.

కీళ్లు సక్రమంగా పనిచేస్తే వానిని ఆవరించి ఉన్న కండరాలు సరైన స్థితిలో ఉంటాయి. వెన్నెముక స్వేచ్ఛగా ఒంగటంవల్ల అది గట్టిపడటంకాని, కుదించుకుపోవటంకాని జరుగదు. వెన్నుపూసలు చెడిపోవు. ఆసనాలు చేయటంవల్ల కీళ్లు సరిగా పనిచేస్తాయి. కండరాలు సాగటం, విశ్రమించటం జరుగుతుంది. కండరాలకు సరైన పరిశ్రమ లేకపోతే అవి కుంచించుకు పోతాయి. తత్ఫలితంగా రక్తప్రసరణ, నరాల శక్తి తగ్గిపోతాయి. శరీరావయవాలు సక్రమంగా పనిచేయవు. ఆసనాలు వేయటంవల్ల కండరాలు, అంగాలు, నరాలు చక్కని స్థితిలో ఉంటాయి.

ఆరోగ్యకరమైన నరములపైననే శరీరావయవముల సక్రమ నిర్వహణ ఆధారపడి ఉంటుంది. మెదడు, గుండెకాయ, ఊపిరితిత్తులు - ఈ మూడూ జీవితాన్ని నడిపే మూడు ఆధారాలు. గుండెకాయ, ఊపిరితిత్తులు, మెదడుయొక్క అధీనంలో ఉంటాయి. గుండెకాయ, ఊపిరితిత్తులు, ఇతర అంగములు - ఇవన్నీ మెదడు

— ౨ —

# చిత్తశుద్ధికి, బుద్ధిబలానికి ఎలాంటి ఆహారం కావాలి?

★ శంకరాచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి ★

చిత్తశుద్ధి (Purity of mind) సనాతన ధర్మానికి ప్రాతిపదిక. మనలో ప్రతి ఒక్కరూ మన ధర్మంపట్ల అపేక్షను కలిగి ఉంటారు; అది మనకు గర్వకారణంకూడా. అయితే ఆ ధర్మంలో ప్రతిపాదించబడ్డ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టేవారి సంఖ్య అత్యల్పం. చిత్తశుద్ధికి అనేక విషయాలు తోడ్పడతాయి. వానిలో ఆహారంలో స్వచ్ఛతకు ప్రాధాన్యత ఉంది. ఆహారంలోని స్వచ్ఛత క్రమవికాసంలో అనేకమైన సుగుణాలను అలవరచుకోవటానికి దోహదం చేస్తుందని మన మహర్షులు ప్రవచించారు. ఆహారం తీసుకోవటమనేది శారీరకమైన క్రియ. చిత్తశుద్ధితో దానికి సంబంధం ఎలా ఉంటుందనే అనుమానం కలుగవచ్చు. ఒక ఉదాహరణద్వారా ఆహారంయొక్క స్వభావానికీ, మనస్సుయొక్క గుణానికీ గల సంబంధాన్ని స్పష్టపరచవచ్చు. మద్యం ఒక పానీయం. దానిని త్రాగటంవల్ల మనస్సు ప్రభావిత మవుతుందనేది, అది మనస్సును వక్రమొనర్చుతుందనేది స్పష్టం. ఈ విధంగా కొన్ని ఆహారపదార్థాలు మనస్సుపై సత్ప్రభావాన్ని కలిగిస్తాయి, కొన్ని దుష్ప్రభావాన్ని కలిగిస్తాయి. కనుకనే మన దేశంలో ఆహార విషయమై సమగ్రమైన నియమ నిబంధన లున్నాయి.

సరైన ఆహారంవల్ల చిత్తశుద్ధిని కలిగించటం తథ్యం. ఈ చిత్తశుద్ధివల్ల భక్తిజ్ఞానాలు కలుగుతాయి. ఆహారాన్ని శరీరాంతర్గతుడైన ఈశ్వరునికి అర్పించాలి. శ్రీకృష్ణభగవానుడు గీతలో తాను జఠరాగ్నినని ప్రకటించాడు. మనం తీసుకునే ఆహారం భగవంతునికి నైవేద్యమైనప్పుడు, ఆయనకు అర్పించేది మాలిన్యరహితంగా ఉండేటట్లు చూడటం మన విధి. అపరిశుభ్రమైన ఆహారాన్ని భగవంతునికి అర్పించటం అనుచితం. ప్రజలంతా ఈ విధంగా తమ ఆహారాన్ని భగవంతునికి నైవేద్యంగా భావించి ప్రవర్తించినప్పుడు, వారు సనాతన ధర్మంలోని ఒక ముఖ్య సిద్ధాంతాన్ని అనుష్ఠించినవారవుతారు. వేరుకు సక్రమంగా నీరుపోస్తే చెట్టు దానంతట అదే పెరిగి పుష్పఫల సంశోభితమైన మహావృక్ష మవుతుంది. ఆకులకు, కొమ్మలకు నీళ్లు పోయటంలో అర్థంలేదు. పరిశుద్ధాహారం ధార్మిక జీవనమనే భవ్యభవనానికి పునాది కావాలి. *

## 3

# బాహ్యప్రపంచ మింకా కన్ను తెరవని దశలో ఇక్కడ వికసించిన ఉత్తమ వైద్యవిధానం

### ఆయుర్వేద బృహస్పతి

డా॥ ప్రభాకర్ ఛటర్జీ, ఎమ్. ఏ., డి. ఎస్‌సి.

ఆయుర్వేదం సనాతనమైనది. గ్రహరాజైన సూర్యునివలె అది, విశ్వాకాశంలో నిరంతర దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది. బ్రహ్మ ఈ జగత్తును సృష్టించినప్పుడే ఆయుర్వేదాన్ని కూడా సృష్టించాడు. మన సాంప్రదాయం ప్రకారం ఆయుర్వేదాన్ని భరద్వాజమహర్షి, కాశీరాజైన దివోదాసు భారతభూమికి కొని తెచ్చారు. దాని వెనుక ఒక ప్రత్యేకమైన తత్వశాస్త్రం ఉన్నది. వైద్యశాస్త్రానికి సంబంధించి ఊహించదగిన విషయాలన్నిటితో కూడియున్న ఎనిమిది శాఖలు కలిగిన సమగ్రమైన శాస్త్ర మది.

మిగతా ప్రపంచమంతా అజ్ఞానాంధకారంలో మునిగిఉన్న సమయంలో ఆయుర్వేదం మానవ శరీర నిర్మితి, రోగనిర్ణయశాస్త్రము, త్రిదోష సిద్ధాంతిముల సంపూర్ణ పరిజ్ఞానంపై ఆధారితమైన వైద్యశాస్త్రాన్ని రూపొందించింది. ఈ త్రిదోష సిద్ధాంతం భారతీయ తత్వశాస్త్రంలోని సాంఖ్యపద్ధతిలోని త్రిగుణ సిద్ధాంతంపైన, వైశేషిక సూత్రములలోని పదార్థ నిర్మితి సిద్ధాంతంపైన ఆధారితమైనది.

భారత చరిత్రలోని వివిధ యుగాలలో వైద్య విద్వాంసులు అతిప్రాచీన కాలంనుండి కొనసాగించిన వైద్యప్రయోగముల ఫలితములపై నిర్మితమైన ఔషధ సంపద ఆయుర్వేదానికి అపారంగా ఉన్నది.

బౌద్ధయుగంలో ప్రభుత్వ శాసనంద్వారా సజీవమైన జంతువులపై శస్త్రప్రయోగం నిషేధింపబడింది. అప్పుడు ఆయుర్వేదం ధాతువర్గంనుండి ఔషధాలకు కావలసిన వివిధ వస్తుసామగ్రిని తీసుకొని మరింత బృహత్తరమైన రూపాన్ని పొందింది. పాదరసం, గంధకం, బంగారం- వీటిపై జరిపిన వివిధ పరిశోధనల ప్రయోగముల ఫలితంగా మహత్తరమైన శక్తి గలిగిన మకరధ్వజం కనుగొనబడింది.

వాత, పిత్త, కఫము లనబడే త్రిదోష సిద్ధాంతం మానవ శరీరానికి కలిగే ఎట్టి రుగ్మతనైనా నిదానం చేయగలదు.

రోగాలను నయంచేయుటంలో ఆయుర్వేదం మొదట వమన, విరేచన, అనువసన, స్నేహ, నశ్య, స్వేదనములను పంచకర్మలద్వారా శోధనను జరిపి, తదుపరి సంతృమనమును- అనగా రోగియొక్క వ్యక్తిగత లక్షణములనుబట్టి తదనుగుణమగు ఔషధాన్ని సేవింపజేయుటం- జరుపుతుంది.

ఒకే రోగానికి వివిధ లక్షణములు, ... స్థితులం కలిగిన వ్యక్తులకు ఒకేమందును వాడటాన్ని ఆయుర్వేదం ఆక్షేపిస్తుంది. రోగాన్ని పూర్తిగా నాశనం చేయక, దానిని తాత్కాలికంగా అణచి ఉంచేందుకు ప్రయత్నించి, తద్వారా ఆరోగాన్ని మరొకదిశకు త్రిప్పి, దాని స్థానే మరొక రోగాన్ని కలిగించే చికిత్సను ఆయుర్వేదం ఎన్నటికీ ఆమోదించదు. ఆయుర్వేద శాస్త్రం ప్రకారం రోగాన్ని, ఆ తర్వాత అది తిరిగి విజృంభించి రోగిప్రాణం తీసేవిధంగా సుప్తస్థితిలో ఉంచేది కాక దానిని సమూలంగా నాశనం చేసేదే ఔషధం. అంతకు మించిన ప్రచారంలో వచ్చిన క్రొత్త మందు రాగానే నిరుపయోగమని పారవేద్దామనే ఉద్దేశంతో ఒక మందుకు కొన్ని సంవత్సరాల తరబడి బహుళ ప్రచారాన్ని ఇచ్చే సంప్రదాయాన్ని ఆయుర్వేదశాస్త్రం ఆమోదించదు. ఈ శాస్త్రం త్రిదోష సిద్ధాంత మనే గీటురాయితో ఒక ఔషధంయొక్క గుణాన్ని పరీక్షిస్తుంది. ఆ పరీక్షలో నెగ్గిన ఏ ఔషధాన్నయినా తనలో ఇముడ్చుకోవటానికి ఈ శాస్త్రం ఎన్నటికీ వ్యతిరేకత చూపదు.

శస్త్రచికిత్స విషయంలో కూడ ఆయుర్వేదం వెనుకబడలేదు. వాస్తవానికి శస్త్రచికిత్సలో ప్రప్రథమంగా విజయం పొందింది ఈ శాస్త్రమే. పాశ్చాత్య శస్త్ర చికిత్స తరఫున జరిగిన శాస్త్రీయమైన ప్రచారంయొక్క ప్రభావంవల్ల తమ విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయిన నేటి శాస్త్రజ్ఞులకు ఈ విషయం జుగుప్సను, ఆశ్చర్యాన్ని కల్గించవచ్చు. నిర్మలాకాశంలో జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూన్న సూర్యునివలె సత్యము, స్పష్టము అయిన విషయ మిది. ప్రాచీన భారతీయ శస్త్ర చికిత్సకులు ఉపయోగించిన శస్త్రచికిత్సా సాధనాల పట్టికవైపు ఒకసారి దృష్టిని సారించే పక్షంలో, భారతీయ సామ్రాజ్య ప్రాభవపురోజులలో వారు సంపాదించిన అనుభవ సంచయం మనలను ఆశ్చర్య చకితులను చేస్తుంది. యుద్ధంలో ఎవరికైనా ఒక కాలు పోతే, వారు దానిని ఖండించి, దానిస్థానే ఒక ఇనుపకాలును అమర్చగలరు. ఏ కారణాన అయినా ఎవరికయినా ముక్కు పోతే, వారు అతని నుదుటినుంచి మాంసాన్ని

---

నుండి వెన్నెముకనుండి వెలువడు నాడుల, నరముద్వారా ఉత్తేజిత మవుతాయి. ప్రముఖమైన ఈ మూడు అంగములు, మెదడు, వెన్నెముక ఆసనాల సాధనవల్ల, చక్కని స్థితిలో ఉంటాయి. వీర్యశక్తి కూడ పెంపొందుతుంది.

కనుక యోగాసనాల పద్ధతి శరీరవ్యాయామ పద్ధతు లన్నిటికి తలమానికము. సమగ్రము, సంపూర్ణము, దోషరహితము అయిన పద్ధతి. కాని దీనిని వల్లెవేయటంవల్ల, దీని ఉత్కృష్టతను తెలుసుకోవటంవల్ల ప్రయోజనం లేదు. అందరూ దీనిని సాధన చేయాలి. దైనందినం, ఒక పద్ధతి ప్రకారం విడువకుండా ఈ ఆసనాలను సాధన చేసేవ్యక్తి అగణితమైన ప్రయోజనాన్ని పొందుతాడు. అడపా దడపా చేసి, మానేసినందువల్ల అంత ప్రయోజనం ఉండదు. క్రమపద్ధతిలో ఆసనాలు వేసేవ్యక్తి ముఖంలో, కళ్లలో ఒక విలక్షణమైన కాంతి, అతని చిరునవ్వులో ఒక ప్రత్యేకమైన మోహానత ద్యోతక మవుతాయి. అతను కిలకిలా నవ్వుతాడు. తాను వెళ్లిన చోటల్లా ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని, ఆనందాన్ని నింపుతాడు. అతను తాను తీసుకొన్న లక్ష్యాల నన్నిటినీ సాధించి తీరుతాడు; ప్రయత్నాలన్నిటిలో విజయలక్ష్మిని చేపట్టి తీరుతాడు; అరవై ఏళ్ల వయస్సులోకూడ అతనిలో యువత ప్రస్ఫుటమై తీరుతుంది. *

కోసి దానిని పునర్నిర్మించగలరు. విరిగిన ఎముకలను సరిచేయుటలో భారతీయ పద్ధతి నేటికీ విదేశీ నిపుణులకు దిగ్భ్రమ గొలుపుతోంది. తల్లిగర్భంనుండి చనిపోయిన శిశువును బయటికి తీసేందుకు భారతీయ పద్ధతికి ఆయుర్వేద గ్రంథమైన శుశ్రుత సంహితనుండి నేటి వైజ్ఞానిక ప్రపంచంలోని ఆధునాతన శస్త్ర చికిత్స గ్రంథాలలోనికి అక్షరశః అనువదింపబడింది. కాని దురదృష్టవశాత్తు భారతదేశంలో హైందవ సామ్రాజ్యం పతనం కావటంలో శస్త్రచికిత్సకు సంబంధించిన పరిశోధనలు, ప్రయోగములు స్థగితమయి పోయాయి. ఆయుర్వేద వైద్యులు నేటికీ శుశ్రుత సంహితను పఠిస్తారు. ఆయుర్వేద శాస్త్రవేత్త అయిన వైద్యునికి శస్త్రచికిత్సకు పూర్వ కర్మనుగూర్చి — అనగా రోగికి ప్రమాదం రాకుండా ఉండేందుకు శస్త్రచికిత్సకు పూర్వము, తర్వాత అనుసరింపదగు విధానములో పరిపూర్ణ పరిజ్ఞానం ఉంటుంది.

శస్త్రచికిత్సలోని వివిధాంగముల పరిజ్ఞానం లేనిదే ఏ వైద్యుడుకూడ వైద్యం చేయటానికి అర్హుడు కాడని ఆయుర్వేద తత్త్వం ఆదేశిస్తోంది. శస్త్రచికిత్సయొక్క పరిజ్ఞానం లేని వైద్యుడు ఒకే రెక్క కలిగిన పక్షివంటి వాడనీ, కనుక అతడు సరైన విధంగా వైద్యం చేయలేడనీ ఆయుర్వేద గ్రంథాలలో పేర్కొనబడి ఉంది. శస్త్రచికిత్సలో తగు పరిజ్ఞానం లేకుండా వైద్యం చేసే వ్యక్తికి మరణదండన విధించాలనేటంతవరకు ఆయుర్వేద శాస్త్రజ్ఞులు సంసిద్ధులయ్యారు.

ఆయుర్వేదం రోగ నిదానానికి నాడీ శాస్త్రంపై ఆధారపడి ఉంది. మానవశరీరం దోష, ధాతు, మలములతో నిర్మితమయింది. ఆ మూడింటి ఆంతరంగిక క్రియల సమ్యక్ నిర్దేశాన్ని గుర్తించటంకోసం నాడీ శాస్త్రం త్రిదోష సిద్ధాంతంపై ఆధారపడి ఉంది. నాడీ శాస్త్రం ఎంతో కచ్చితమైనది, నిర్దుష్టమైనది అంటే, దానిద్వారా వైద్యుడు తత్క్షణమే రోగనిదానం చేసి, ఔషధాన్ని పేర్కొనగలుగుతాడు.

పారిభాషా విజ్ఞానం- అనగా వివిధ ఋతువులలో ఓషధులను సంపాదించటం, వాటి క్షాళనం, వాటిని పుటం పెట్టటం; ఆసవ, అరిష్ట, అరకు, అవలేహము, మోదకం ఇత్యాది వివిధ ఆయుర్వేద ఔషధాల తయారీకి అవసరమైన వస్తువులను సమపాళంలో కలపటం వాటిని భారతదేశం వంటి ఉష్ణమండల దేశాలలో నిలువవుంచే విధానం ఇత్యాది విషయాలకు సంబంధించిన నియమ నిబంధనల-యొక్క సమ్యక్ పరిజ్ఞానంపై ఆయుర్వేద ఔషధ శాస్త్రం ఆధారితమై వుంది.

విస్తృతము, సుసంపన్నము అయిన ఆయుర్వేద ఔషధ భాండారము నేటికీ ఆధునిక వైద్యశాస్త్రవేత్తలను ఆశ్చర్యచకితులను చేస్తోంది. సృష్టిలోని పదార్థాలన్నీ ఔషధాలకు సామాగ్రిగా ఉపయోగిస్తామనే చరక సంహితలోని ఉద్ఘాటనలోని సత్యం నేటికీ నిరాబాధితంగా ఉంది. ఎల్లోపతిక్ మందులలో ఆయుర్వేద ఔషధాలనుకూడ చేర్చుకునే మోజు పాశ్చాత్యులకు నానాటికీ పెరగటం దానిని నిరూపిస్తోంది. మన ప్రాచీనులు ఆయుర్వేదఔషధాలకు రస, గుణ, వీర్య, విపాక, ప్రభావాలనే పరీక్షలకు గురిచేయటం నేటి ఆయుర్వేద వైద్యులకు మార్గదర్శకంగా ఉంటోంది.

నేటి ప్రపంచానికి అద్భుతంగా కనిపించే సర్పగంధాన్ని ఆయుర్వేదవైద్యులు యుగయుగాలనుండి పిచ్చిని, హిస్టీరియాను, డైస్మెనోరియాను, గుండె జబ్బులను, రక్తపుపోటును చికిత్స చేయటంలో ఉపయోగిస్తున్నారు. పై అమోఘౌషధాన్ని, దానిని మించిన ఔషధాలను, కీర్తి గౌరవాలను, ధనలాభాన్ని ఉపేక్షించి, మన ఆయుర్వేద వైద్యులు ఉపయోగించి అనేకమైన రోగాలను నయంచేశారు. ఋగ్వేదకాలంనుండీ 1835 నేటి కలకత్తా మెడికల్ కాలేజీ స్థాపన వరకు భారత ప్రజల ఆరోగ్య సమస్యలను మరో ఆసరా లేకుండా విజయవంతంగా పరిష్కరిస్తూ వచ్చిన ఆయుర్వేద శాస్త్రంలోని కొన్ని విశిష్ట లక్షణాలు పైన ఉదహరింపబడ్డాయి. సువిశాలమైన ఈ భారత భూభాగంలోని వివిధ ప్రాంతాల ప్రజల ఆరోగ్యాన్ని కాపాడటంలో భారతీయ వైద్యులు ఆనాటివరకు కేవలం ఆయుర్వేదంపైననే ఆధారపడి కృతి కృత్యులయారు.

(సశేషం)

“నాగార్జున” నుండి.

## 4

# ప్రాచీన భారత రాజనీతిలో దౌత్యవ్యవస్థ

### ఆచార్య శ్రీ మోహన్‌మిశ్రా

చారిత్రక పరిశోధనలవలనను, శిలాశేఖలవలనను, పురాతత్వ శాఖల పరిశోధన ఫలితములవలనను, భారతీయ రాజులు యూరోప్, ఆసియా ఖండాలలోని అనేక రాజులతో దౌత్య సంబంధాలను నెలకొల్పినట్లుగ తెలుస్తుంది. సామ్రాట్ చంద్రగుప్తుని రాజదర్బారులో మెగస్థనీసు వున్నట్లుగ సర్వవిదితమే. బిందుసారుని రాజదర్బార్‌లో డైమెక్స్ పేరుగల దూత వ్యవహరించినట్లుగ వర్ణన లభిస్తుంది. తక్షశిలలో తత్కాలంలోని యూనానీ చక్రవర్తి “ఏంటీ అలకౌయడెస్” శుంగ వంశీయుడైన భాగభద్రునివద్ద వున్నాడు. సముద్రగుప్తునివద్ద సింహళ రాజదూత, చాళుక్యరాజు పులకేశీరాజదర్బార్‌లోనికి (630 క్రీ॥శ॥) ఈరాన్ రాజదూతలు వచ్చిన వివరణ లభిస్తుంది. సామ్రాట్ అశోక్ తన సమకాలీనమయిన అన్యరాజులే కాక మకదూనియా, సీరియా, మిశ్ర, ఆఫ్రికాలలోనికి కూడా తమ రాజదూతలను పంపారు.

చైనా భారతదేశానికి పొరుగుదేశం. కనుక ఈ రెంటిసంబంధాలు అతిప్రాచీనమయినవి. చైనా చక్రవర్తి “హౌతీ”(89-105 క్రీ॥శ॥) నాటి రాజసభలో ప్రథమ భారతీయ దూతయైన జయమంగల్ వెళ్ళినట్లుగ తెలుస్తుంది. చైనా ప్రధాని “బూ” కోరికపైన మగధరాజు ఆచార్య పరమార్థని సాంస్కృతిక శిష్టమండలి పెద్దగా పంపించాడు. మలయా, యవద్వీప్, ప్రశాంతసాగరంలాంటి అనేక ద్వీపరాజ్యాల్లో కూడా భారతీయ రాజదూతలు వెళ్ళినట్లుగ విదితమౌతుంది. కాని ఇలాంటిదూతలపనికూడా నేటి రాయబార మండలులుగానే వుంటుండేవి. అంటే విదేశీరాజులకు భారతీయరాజుల కానుక లర్పించడం, వాణిజ్యానికి సంబంధించిన సౌకర్యాలను పొందటం చేసేవారు.

సంస్కృతంలో “దూత” అనే శబ్దానికి అర్థం సందేశవాహకుడనియు, వార్తాహారుడనియువుంది. ఆచార్య చాణక్యుడు తన అర్థశాస్త్రంలో దూతకి నిర్వచనం ఇలాఇచ్చాడు: “ఏదైతే ప్రయోజనాన్ని సాధించడానికి దూత

పరాయిదేశాలకు వెళ్ళాడో అది పూర్తయ్యే వరకు అతడు ఆ రాజ్యంలోనే ఉండాలి. కార్యసాధన జరిగాకనే తిరిగి రావాలి" (అర్థశాస్త్రం- భా॥ 1-6-19) ఆర్యచాణక్యుని సమయానికి వైదేశిక సంబంధాలు పూర్తయ్యాయి. పరదేశంలో కార్యాన్ని చేయాలనే ఆపేక్షతో ఉన్న వారికి తగినశిక్షణ, ఇత్యాది ఏర్పాటు చేసేవారు.

భారతీయ రాజనీతి విశారదులు కార్యాన్ని దృష్టియందుంచుకొని దూతలను మూడువిధాలుగావిభజించారు: (1)నిసృష్టార్థ శ్రేణి దూతస్థితి "ప్రతినిధికి"సమానంగావుంటుంది(2)పరిమితార్థ శ్రేణిదూత తన రాజుయొక్క నిశ్చితమయినఉద్దేశ్యాన్ని వెలిబుచ్చే హక్కును మాత్రమే కలిగిఉంటాడు. (3) ఆసనహర్ శ్రేణి దూత తన రాజిచ్చిన సందేశాన్ని తీసుకవెళ్ళి, దానికి జవాబును తీసుకవస్తాడు.

తనరాజ్యపు హితవును కాంక్షించడం, వాటిని రక్షించడం, తన ప్రభావం, శక్తిని అభివృద్ధి పొందించటం వైదేశిక విధానపు ముఖ్య లక్షణమై ఉండాలి. రాజదూతల కౌశలంపైనే అది ఆధారపడి వుంటుంది. ఒక్కొకపుడు సైనికబలంతో పనులు సాధింపబడవు; అటువంటి సమయంలో దూతయొక్క చాతుర్యం మీద ఆ కార్యసాధన ఆధారపడి ఉంటుంది.

ఆతని ప్రముఖమయిన పని రాజపురుషులతో స్నేహాన్నలవరచుకొని దేశంలోని వాస్తవికమయిన రాజనీతి పరిజ్ఞానం పొందడం. రాజ్యపు జనాభా, బలము, సాధనాలను గూర్చిన సరియైన అంచనా వేయడం, గూఢచారులద్వారా ఆరాజ్యపు దుర్గాలను, సైన్యబలం, విషయం తెలుసుకొని తన ప్రభువుకు సాంకేతిక లిపిద్వారా దాన్ని నివేదించడం.

విపరీత పరిస్థితి దాపురించిన, గతంలో చేసికొన్న ఒడంబడికలను శక్తివంచన లేకుండా అమలు పరచేటట్టు చేయడం ఆతని ముఖ్యమయిన పని. దానితోబాటు విదేశాలలో మిత్రులను సంపాదించటం అచటి ముఖ్యులైన వారితో కలవడం, శత్రువునుండి మిత్రులను దూరం చేయడం, గూఢచారులను, సేనలను ప్రారదోలడం, బంధువుల, రత్నాల అపహరణాదుల వంటి వాటిని శత్రుదేశాలలో వుంటూ వారివారి అరాచక కర్మకాండలను పసికట్టడం, గూఢచారుల రహస్యాలను తెలుసుకోవడం, అవసరాన్నిబట్టి శత్రువులతో కపటోపాయాలచే అరాచకాన్ని, విద్రోహాన్ని ఉత్పన్నం చేయడం, అంటే సంకట సమయంలో తన స్వరాష్ట్రహితమును సర్వస్వంగా భావించి - అనేక ఉపాయాలద్వారా శత్రువులను పరాభవించడమే రాజదూత ముఖ్యమయిన కర్తవ్యమై వుండాలి.

రాజదూత అనే పదవి చాలా బాధ్యతాయుతమైనదిగా వుంటుంది. కనుక ఈ పదవికి నియమింపబడే వానిని ఎంతో ఆలోచించిన మీదట కాని నిర్ణయించరు. భారతమాతపట్ల ప్రగాఢమయిన ఆత్మవిశ్వాసం, ప్రేమయు కలిగివున్నవాడే దీని కర్హుడు. ఆతని హృదయం దేశప్రేమతో సఫల్లితమై వుండాలి. అతను తన ప్రభువుకొరకు చిరునవ్వుతో తన ప్రాణాలను ఆహుతి యివ్వగలగాలి. అతను స్వాభిమానంతో ప్రతి పరిస్థితిలోను అనుశాసనబద్ధంగా వుండగలగాలి. తన వ్యవహారంద్వారా శత్రువులనుకూడా ఆకర్షించగలిగిన శక్తికలిగిన వాడై వుండాలి. విపరీత, విపత్కర సమయాల్లో కూడా ధైర్యాన్ని కోల్పోకూడదు. అతను చాలా దూరదర్శిగా వుండాలి విదేశీభాషతో పరిచయం కలిగివుండాలి.ఇతను మద్యపానలోలుడుగను, స్త్రీలోలుడుగను ఉండరాదు. వీటి వలన అప్పుడప్పుడు రహస్యాలను చెప్పవలసిన స్థితి పడ్తుంది. క్రోధాన్ని జయించగలిగిన వాడుగ వుండాలి. అతను స్వప్నంలో కలవరించే వ్యక్తిగ వుండకూడదు.

నేటి మాదిరిగనే ప్రాచీనంలోకూడా దూతను "అవధ్యుడు" గా పరిగణించేవారు. అతను కేవలం సందేశ వాహకుడగనే భావించబడుటయే దీనికి కారణం.

"బ్రువన్యరార్థం పరవా న్నా దూతో వధమర్హతి" దూతను చంపినవాడు తన ఆప్తులతో సహా నరకానికి వెళ్తారని మహాభారతంలో కూడా వుంది. "దూతస్య హంతాం నియమావశే త్సచివైసహా" ఒకవేళ దూత తన ప్రభువును ధిక్కరించి ఏదైనా పనిచేసినా, విపరీత వాతావరణాన్ని సృష్టించినా, అతన్ని అంగవైకల్యంగా చేస్తారు. లేదా కాల్చిన ఇనుంతో వాతలు వేయించేవారు. ఇలానే రావణుడు మారుతిని చేశాడు. ప్రాచీనకాలంలో విదేశాంగశాఖ విదేశీ ఆక్రమణదారుల కనిపెట్టి ఉండేది. దీనికి గూఢచారులు నియమించబడే వారు. అనుమానాస్పదంగా వున్న వ్యక్తిని ఓడరేవులోనే ఖైదుచేసేవారు.

అనువాదం :

శ్రీ రేవా కోటేశ్వరరావు.

# "హిందూరాష్ట్ర"మంటే చిందులెందుకు?

## సర్వజనుల సుఖము నాకాంక్షించే రాష్ట్రం ఎవరికైనా కీడు నెంచగలదా?

ఈరోజుల్లో 'హిందూరాష్ట్రం' అనగానే కొందరు కోపంతో గంగవెర్రులెత్తి చిందులు తొక్కడం చూస్తుంటాం. అదేదో మతోన్మాదమని, ప్రమాదకరమని, వారు ఒకవిధమైన భయంతో మాట్లాడుతుంటారు. హిందూరాష్ట్ర స్వరూప స్వభావాలు తెలియని అజ్ఞానంవల్లనే ఇలాంటివి జరుగుతున్నాయి. "సర్వే జనాః సుఖినో భవంతు" అని మనసా ప్రార్థించే హిందూత్వారాధకులతో నిండిఉన్న రాష్ట్రం ఏనాడైనా, ఎవరికైనా ప్రమాదకరంగా పరిణమించగలదా? అజ్ఞానుల క్రోధావేశాల కారణంగా ప్రజానీకం ఈ హిందూరాష్ట్రాశయాన్ని విడనాడగలదా?

గత వెయ్యి సంవత్సరాలుగా మన దేశంలో జాతీయులకు విజాతీయులకు, స్వధర్మీయులకు, అధర్మీయులకు సంగ్రామంజరిగింది. విదేశీయులు ధనాన్ని, పదవీ అధికారాలని, ఎరచూపించినా, లొంగకుండా స్వసుఖాన్ని వదులుకొని మన మహావీరులు గ్రీకు, హూణ, అరబ్, ఆఫ్ఘన్, తురుష్క, మొగలాయి, బ్రిటిష్‌వారితో ఎందుకు పోరాడారు? స్వరాజ్యం, స్వతంత్రం, స్వధర్మంకోసం పోరాడినట్లు చరిత్ర చెపుతున్నది. ఎవరిరాజ్యం, ఎవరి తంత్రం, ఎవరి ధర్మం అని ప్రశ్న వేసుకుంటే గ్రీకులనుంచి బ్రిటిష్‌వారి వరకు నిరంతర పోరాటం జరిపిన హిందువుల కోసమే స్వరాష్ట్రం, స్వతంత్రం, స్వధర్మం.

ఎన్నో శతాబ్దాలుగా అఖండమైన జాతీయ జీవనం జరుపుతున్న హిందువులు రాష్ట్రీయ భావాన్ని (National feeling) కోల్పోయారు. అదే వారి పతనానికి కారణం. వారు స్వరాజ్యం కోల్పోటానికి వారి వ్యక్తిగత స్వార్థచింతనే కారణం. ఈ దేశం వైభవం అనుభవించింది అంటే వీరి అవిరళ కృషే కారణం. అందువల్ల ఆత్మపరిశీలన చేసుకొని హిందూరాష్ట్రాన్ని (Hindu Nation) పునర్నిర్మాణం చెయ్యాలని కోరటంలో ఆశ్చర్యం ఏమిలేదు. మన పరాధీనతకు కారకులు విదేశీయులు కారు, పరధర్మీయులైన ముసల్మానులు, క్రైస్తవులు కారు.

హిందూరాష్ట్రీయత ఒక రాజకీయ సిద్ధాంతం కాదు. ఎన్నిరకాల ప్రభుత్వాలు మారినా చిరంతనంగా అఖండంగా వుండేది రాష్ట్రమే. (Nation). అందువల్ల రాష్ట్రానికి పునాది 'ధర్మం'. దీనినే 'మతం' (Religion) అని తర్జుమా చేశారు. అది తప్పు.

జాతీయుల నందరిని ఏకత్రితం చేసేది ధర్మం, విడదీసేది అధర్మం. ధర్మంలో రాజ

హిందూరాష్ట్రానికి సర్వతోముఖాభ్యుదయం కలిగింపజేయుటం రాష్ట్రీయ స్వయంసేవక సంఘంయొక్క లక్ష్యం.

★ ★ ★ ★ ★

హిందూదేశం హిందువుల భూమి అని మీ రనడానికి ఆస్కారం ఏమిటని అనేకులు నిస్సంకోచంగా ప్రశ్నిస్తారు. ఇక్కడ ఎందరు నివసిస్తున్నారో ఈ భూమి వారందరిదీ అని వారి వాదన. అలా ప్రశ్నించేవారికి- రాష్ట్రశబ్దానికి అర్థం ఏమిటో తెలియకపోవడం చాలా విచారకరమైన విషయం. ఏదో ఒక నేల చెరగును రాష్ట్రం అని పేర్కొనం. ఒకే సిద్ధాంతం; ఒకే సాంప్రదాయం; ఒకే సభ్యతను ఆధారంగా చేసుకొని అనాదికాలంనుంచి సమైక్యతతో జీవిస్తున్న జనుల కూడికే రాష్ట్రం. మనవల్లనే ఈ దేశానికి హిందూస్థాన్ అనే పేరు వచ్చింది. ఇతరులు సౌమ్యంగా ఈ దేశంలో నివసించవచ్చు. ఇదివరలో అలాంటివారిని మనం అడ్డగించలేదు. ఇకముందూ అల్లాంటిది జరగబోదు. పారశీక ప్రజలను ఉదాహరణగా గ్రహిస్తే హిందువుల ఉదారత స్పష్టమౌతుంది. అతిథులై వచ్చి "ఇంట దిని ఇంటి వాసాలను లెక్కపెట్టే" వారికిమాత్రం ఇక్కడ సూదిమొనమోపినంత స్థలమైనా లభించజాలదు. మన ఇంటిలో మనం సగౌరవంగా జీవించగలగడానికే ఈ సమైక్యత. ఇందులో అన్యాయం ఏమీ లేదు.

—పూజ్య డా. హెడ్గేవార్.



కీయాలు, సంస్కృతి, మతం, ఆర్థిక సూత్రాలు ఒక టేమిటి మానవపురోభివృద్ధికి అవసరమయ్యే అన్ని అంగాలు ఇమిడివున్నాయి. హిందువులకు మతం అంటూ ఏదీ లేదు. మతం అంటే ఒక అభిప్రాయం. దేవసాన్నిధ్యంకోసం చేసే ఒక పూజావిధానం. క్రైస్తవం, ఇస్లాం, జొరాష్ట్రియాలు మతాలు.

భారత మాతనే తల్లిగా భావించే, జాతీయులు సుఖశాంతులతో జీవింపజేసే ప్రణాళికే హిందూధర్మం. ఈధర్మానికీ ఈదేశానికీ విడదీయరాని సంబంధం వున్నది. వైష్ణవ, శైవ, శాక్తేయ, జైన, బౌద్ధ, శిఖ్, ఆర్యసమాజ్లాంటి మతాలెన్నో ఈ ధర్మంలో ఇమిడిపోయాయి. ఈ ధర్మీయులలో ఎన్నో క్షుద్ర జాతులు - గ్రీకు, పారశీక, శక, హూణ- కలిసిపోయ్యారు. ఈ హిందువులు ఎన్నో పరమతాలకు ఆశ్రయం ఇచ్చారు. రోమన్ సామ్రాజ్య నిరంకుశత్వానికి తట్టుకోలేక పారిపోయిన ఆది క్రైస్తవులకు మనం రక్షణ యిచ్చాం. అలాగే తమ మాతృదేశంనుంచి తరిమివేయబడిన జొరాష్టర్ మతస్థులకు ఆశ్రయం ఇచ్చాము. అందువల్ల హిందూధర్మానికి పరధర్మాలకు ఎటువంటి సంఘర్షణా లేదు.

'హిందూ' అనేశబ్దాన్ని ఒక మతస్థులకు వాడటం అవివేకం. 'హిందూ' ఒకదేశం పేరు. అందులో నివసించే ప్రజాసమూహం పేరు. ఆపేరు ఒక సంస్కృతికి, ఒక నాగరికతకు, ఒక ధర్మానికి వుపయోగింపబడవలసివుంటుంది. ఇటువంటి విశేషవ్యక్తిత్వం, విభిన్నత్వం కల్గిన సమాజం, తనకు తానే సాటి. ఏ ఇతర దేశీయులతోను సంబంధంలేని పూర్తిగా విశిష్టమైనధర్మం ఇది.

హిందూదేశం హిందువులకు మాతృభూమి, కర్మభూమి, పుణ్యభూమి. వీరిసర్వ ఆకాంక్షలు, ఈ దేశానికే పరిమితమయ్యాయి. ఆసేతు హిమాచల పర్యంతమైన ఈ విశాల భూస్థలిని ఎవరైతే ఒక ప్రభుత్వం క్రిందకు తీసుకొని రాగలుగుతారో అతడిని చక్రవర్తి, సామ్రాట్ అని పిలిచేవారు. ఆ ఆశయం ఈనాటికీ కొనసాగలేదు.

ఏనాటినుంచి ఈ హిందువులు ఈదేశాన్ని తమక్షేత్రం చేసుకున్నారో ఏ చరిత్రకారుడూ చెప్పలేదు. చరిత్రకు అందకమునుపే ఒక విశిష్టమైన సంపూర్ణ సర్వాంగీణ జాతీయజీవితాన్ని రూపొందించారు. ఆ తర్వాత మనదేశం మీదకు దండెత్తిన గ్రీసు, శక, హుణాదులు మనలో కలిసిపోయ్యారు. కాని ఇస్లాం, క్రీస్తు అనుచరులు మాత్రం మనలో లీనం కాలేదు. వారి ఆదర్శాలు, ఆశయాలు భేదించాయి. ఎవరి ఆశయాలు, ఆకాంక్షలు, అభిరుచులు, ఆరాష్ట్ర ప్రజలకు విభిన్నంగా వుంటాయో వారిని 'మైనారిటీలు' అంటారు. హిందూరాష్ట్రానికి ఒకప్పుడు సుందర స్వరూపంఇచ్చిన విజయనగర, మహారాష్ట్ర హైందవరాజ్యాలు ముసల్మానులు, క్రైస్తవులకు ఎటువంటి విశాలహృదయంతో సముచిత గౌరవ స్థానం ఇచ్చారో చరిత్ర చదువుకున్న వారికందరికి సుబోధితమే! హిందువులకు అసహనాన్ని అంటగట్టటం అజ్ఞానం కాక మరేమవుతుందో!

ఇక హిందురాష్ట్రానికి అచంచల పునాదులు వున్నాయి. మనమహర్షులు ఎన్నో వందల వేల సంవత్సరాలు సర్వసుఖాలు వదలుకొని మానవ జీవితపు లోతులను కనుక్కోటానికి ప్రయత్నించి కొన్ని చరమసత్యాలను కనుగొన్నారు. వారు జీవిత విలువలను స్థిరీకరించారు. ఈ హిందూజీవిత విలువలను 'దర్శనాలు' అనే గ్రంథాలు మనకు బోధిస్తున్నాయి. సాంఖ్య, యోగ, వైశేషిక, న్యాయ, పూర్వ ఉత్తర మీమాంసలు షడ్దర్శనాలు. ఇవే హిందూ సంస్కృతికి పునాదిరాళ్ళు.

మనం ఎవరం? ఎక్కడినుంచి వచ్చాం? చనిపోయిన తర్వాత ఎక్కడికిపోతాం? ఈ విశ్వాన్ని, ఈ ప్రపంచాన్ని, ఈ మానవుడిని ఎవరు సృష్టించారు? ఎవరు శాసిస్తున్నారు? ఈ విశ్వాన్నంతటిని బంధించే మూల సూత్రాలేమిటి? మానవ సమాజ ఆదర్శం ఏమయి వుండాలి? సమాజానికి విశ్వానికి, సమాజానికి వ్యక్తికి వుండవలసిన సంబంధమేమిటి? మానవుడు అంటే శరీరం, మనసు, బుద్ధులసమన్వయమేనా? మానవుడికి పశువుకు వున్న వ్యత్యాసమేమిటి? మానవుడు జన్మించింది తిండి, గుడ్డ, పిల్లలను కనటం, తదితర భౌతికసుఖసంపదల సంపాదనకేనా? ఒక మానవుడికి వేరొకనికి గుణస్వభావాలలో తేడాలు ఎందుకున్నాయి? ఒకే భగవంతుడు సృష్టించినా మానవులలో ఎగుడు దిగుడులు ఎందుకువుండాలి? తదితర విషయాలను మన మహర్షులు పరిశోధనచేశారు. ఈ ప్రశ్నలకన్నిటికి 'దర్శనాలు' చక్కని పరిష్కారమార్గాలు సూచించాయి.

మానవుడు అంటే శరీరం, మనస్సు, బుద్ధే కాదు. ఇవన్నీ శాశ్వతంగా, మార్పులేకుండా వుండేవి కావు. ఇవిపుట్టాయి, నశిస్తాయి. ఇక శాశ్వతపదార్థం ఏమిటి? ఆత్మ...ఇది ఎప్పుడు పుట్టిందో తెలియదు, ఎప్పుడునశిస్తుందో అంతకుముందే తెలియదు. దీని ఆద్యంతాలు మహర్షులు కనుక్కోలేకపోయ్యారు. అందువల్లనే అనాది, అనంతం అనివర్ణించారు. దీనిని ఎవరూ నశింపజెయ్యలేరు. ఇది సర్వవ్యాప్తమయింది. అన్ని చరాచర పదార్థాలకు చైతన్యంయిచ్చేది. శరీరం మనసు బుద్ధి నశించేవి. గాన మానవుని ధ్యేయం ఏమిటి? ఆత్మోన్నతి. ఆత్మసాక్షాత్కారం. తనలోవున్న జీవాత్మను విశ్వవ్యాప్త పరమాత్మలో లీనంచేసి విశ్వసత్యాలను తెలుసుకోవటం. ఈ శరీరం మనస్సు పొందేమార్పులకు అతీతంగా వుండటమే మోక్షం. గాన ఆత్మోన్నతికి ఏమార్గం అయితే సహాయ భూతంగావుంటుందో అది ప్రగతి (Progress). ఏదయితే మానవుడిని పశుతుల్యునిగా చేస్తుందో అది ప్రతిక్రియాత్మకం (Reactionary). కాబట్టి ప్రతిమానవుడు ఆత్మోన్నతి పొందటానికి అనుకూలమయిన వాతావరణం నిర్మాణం చెయ్యాలి. ఈ ఆదర్శ సాధనకు రాజకీయ, ఆర్థిక, సాంఘిక, నైతిక మత వ్యవస్థలు నిర్మితం అయ్యాయి.

మానవుడు సుఖశాంతులతో వర్థిల్లాలంటే మన ఋషులు వర్ణాశ్రమవ్యవస్థను నిర్మించారు. ఎవడెవడి ప్రకృతినిబట్టి, ప్రవృత్తినిబట్టి, స్వభావాన్నిబట్టి వానికి సమాజంలో స్థానం వుంటుంది. వాటినిబట్టి వాని వృత్తి నిర్ణయించబడుతుంది. 'రేపు నాగతేమిటి' అని నిరంతర దిగులు (అమెరికాలో, రష్యాలో వున్నట్లు) హిందువు పడకూడదు. ఏవృత్తి చేసినా, ఏ మత పంథాను అనుసరించినా మోక్షప్రాప్తి కలుగుతుంది. మోక్షార్హత ఒక్క బ్రాహ్మణులకే గాదు. ఎవరి ధర్మాన్ని వారు పాటిస్తే మోక్షప్రాప్తి కల్గుతుంది. 'స్వధర్మ' నిర్వహణే పరమ ధర్మం. పరుల ధర్మాన్ని భౌతిక సుఖాలకోసం స్వీకరించకూడదు. ఒకరికి ఒకరు పోటీపడి అందరూ భ్రష్టులు కారాదు. పోటీలేనిదే ప్రగతి లేదనటం అవ్యక్తం. పోటీ ప్రవృత్తిలేకుండానే మన సాహిత్యం, మన శిల్పం, కళలు పరిశీలిస్తే ఎంత ఉత్తమోత్తమస్థాయికి చేరుకున్నవో అర్థమవుతాయి. పోటీ సిద్ధాంతా (Competitive principle) న్ని ఆధారం చేసుకొని పెట్టుబడిదారి వ్యవస్థ, వర్గ ద్వేషా (Class hatred) న్ని ఆధారం చేసుకొని కమ్యూనిస్టు వ్యవస్థలు, మానవుడిని పశువుగా, యంత్రంగా, ఎలా తయారుచేశాయో పరిశీలిస్తే, ప్రపంచానికి వర్ణాశ్రమ వ్యవస్థే ఏకైక శరణ్యం కాకతప్పదు. పాశ్చాత్య నాగరికత తాను

(తరువాయి 83వ పుటలో)

# భారత్ హమారా!

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

కుహు కుహూ వాల్మీకి కోకిల యిట పాడె
నమృతమయమ్ము రామాయణమ్ము
శాంత తేజము పరాశరసూతి యిట నూదె
పంచమ వేదమ్ము భారతమ్ము
కవిలోకపూజ్యుండు కాళిదా సిట పల్కె
శాకుంతలమ్ము రసార్ణవమ్ము
పరముండు కరుణలో భవభూతి యనుభూతి
రమణీయ ఫణితిలో రామచరిత
భరతుడాదిగ సాహితీపరులు నిచట। దర్శనముచేసి కావ్యసౌందర్యమూర్తి
వెలువరించిన యట్టి పృథ్వీతలమ్ము। రస మహస్సుల పరిధి భారతము మాది. ౧

కృష్ణతాదాత్మ్య సంకీర్తనమ్ములె విన్చు
నవగళమ్మున యమునాస్రవంతి
శివ జటాజూటమ్ముఁ జింది చిందులు త్రొక్కె
కలిపాపహరము గంగాస్రవంతి
ఇఱుసంద్రముల నొత్తి ధరణి రక్షించును
నవకమ్మమీఱు కన్యాకుమారి
తెలిమంచుతో నచ్చ తెలివి భాసించును
అత్యున్నతమ్ము హిమాలయమ్ము
నీతి నియమంపు పండువెన్నెలలఁ గాచి। సత్ప్రభుండగు శ్రీరామచంద్రమూర్తి
గృహ గృహమ్మున తానె శబ్దించు నెచట। శ్రుతిహితమ్ముగ నట్టి భారతము మాది. ౨

ఢాకకుఁ నిల్చి సెల్యూకస్సు నోడించు
కౌమరుమీఱిన చంద్రగుప్త నృపతి
రాజనీతిని విశారదుఁడైన శౌర్య ప
రాక్రమమ్ముల కృష్ణరాయ నృపతి
అడవులంబట్టి తా నిడుములం జెందియు
తలవంచనట్టి ప్రతాప నృపతి
తెల్లవారల వట్టి విల్లమ్ములనె తాకు
వీరాధివీరు డల్లూరి నృపతి
ఛత్రపతియాచు దుష్టశాసనము నెదిరి। రాజధర్మమ్ము నిల్పు ధరాధినేత
అవతరించిన యట్టి పుణ్యంపు నేల। రమ్యతరమైన వీరభారతము మాది. 3

# వర్తమాన భారతంలో గోవంశ దుస్థితి

## గోరక్షణకై ఏం చేయాలి?

గోవు భారతదేశపు ఆర్థికవ్యవస్థకు కేంద్రం. గోపాలనం, గోసంవర్ధనం, గోసంరక్షణలు ఆధారంగా మన ఆర్థిక వ్యవస్థ రూపొందింది. అలాగే భారత ప్రజల సంస్కృతి, ధార్మిక భావన ఆవుతో ఎలా ముడిపెట్టబడి ఉందనటానికి ప్రభుత్వ గోసంరక్షణ, సంవర్ధన సమితి తన 1947-48 నివేదికలో వెల్లడించిన ఈ క్రింది భావాలే తార్కాణం :

"ఎంతవరకు పశుహత్యను పూర్తిగా నిషేధించరో, అలాగే పశువృద్ధికి సముచిత మార్గాలను అవలంబించరో, అంతవరకు భారతీయ ఆత్మ వ్యాకులంగానే ఉంటుంది."

### 1. పవిత్రత; ఉపయోగము

భారతీయుల ధార్మిక గ్రంథాలలో అనేక చోట్ల గోవును, 'అఘ్న్య' (వధింపబడరానిది) అని పేర్కొన్న ఉదాహరణ లెన్నో లభిస్తాయి. ఋషులు, శ్రీకృష్ణపరమాత్మ వంటి అవతార పురుషులు, గురు గోవింద సింహుని వంటి గురువులు, స్వామీ దయానంద, మహాత్మా గాంధీ, వినోబాభావే వంటివారు ఆవుయొక్క పవిత్రతను కొనియాడారు. భారతీయ సంస్కృతీ, సభ్యతలకు, సమృద్ధికి ఆవు తలమానికం వంటిదనికూడ అంగీకరించారు. అందుచేతనే మహాత్మాగాంధీ స్వరాజ్యంతోపాటు గోరక్షణకుగూడ ప్రాధాన్యత నిచ్చారు. వ్యవసాయ ప్రధానమైన మనదేశంలో గోవు మాత్రమే ఆర్థిక స్వాతంత్ర్యాన్ని లభింపజేస్తుందనేది ప్రజల పూర్తివిశ్వాసం. మనకు కావలసిన ఆహారధాన్యాలు, వ్యవసాయంవల్ల లభించే ఇతర పదార్థాలు, గోవుద్వారానే లభిస్తున్నవి. అది మనకు పరిపూర్ణ ఆహారతత్వంగల్గిన పాలనిస్తుంది. ఆ పాలలోనే శాకాహారులైన వారికి మాంసకృతులు లభిస్తాయి. మనదేశంలో వ్యవసాయం ముఖ్యంగా ఎద్దులద్వారానే నిర్వహింపబడుతున్నదనీ అవిలేకుండా పంటలు సమృద్ధిగాను, లాభదాయకంగాను పండవనే విషయాన్ని అంతా అంగీకరిస్తున్నారు. మన రవాణా సాధనాలలో- రైల్వే, జలయానాలతోపాటు- నేటికీ కోటికిపైగా ఉన్న ఎద్దులబండ్లే ప్రముఖ స్థానాన్ని పొందుతున్నాయి. ఇంతకుమించిన రవాణా సౌకర్యంమరొకటిలేదు. ఈ మధ్య మన


**శ్రీ ఠాకూర్‌దాస్ భార్గవ**

లోకసభ సభ్యులు


ప్రధానమంత్రి అణుశక్తినిగురించి మాట్లాడుతూ "అణుశక్తిలో అధిక భాగం-80 శాతం ఉత్పత్తి పూర్తిగా ఆవుపేడద్వారానే లభిస్తుంది" అని అంగీకరించారు. భూమిసారవంతంకావాలన్నా, పైరులకు పూర్తి రక్షణ జరగాలన్నా ఎరువులే ఆధారం. అలాంటి ఎరువులు పశువులద్వారానే లభిస్తున్నాయి. ఈ విధంగా పాలుఇవ్వడం, వ్యవసాయానికి తోడ్పడడంలాంటి లాభకరమగు పనులేగాకుండా సింద్రీ, చిత్తరంజన్ ఫ్యాక్టరీల రెండింటి శక్తుల్ని గోవు తనలో కేంద్రీకరించుకొనివుంది.

### 2. ముస్లిముల, ఆంగ్లేయుల పాలనలో

కాబట్టి భారతదేశంలోని ధర్మోపదేశకము, రాజులు, రైతులు, సామాన్యులు గూడా గోవును పవిత్రంగా భావించారనీ, చాలా సమయాలలో దేశంలో గోహత్యను త్యాజ్యమని ప్రకటించి శాసనాలుచేసి, దేశంలో ఇలాంటి అపరాధులకు ప్రాణదండన విధానం అమలు పరిచారన్నా ఆశ్చర్యపడనవసరంలేదు. మొగల్ చక్రవర్తులు - బాబరు, హుమాయూన్, అక్బర్, జహంగీర్, నవాబ్ హైదరాలీ - అందరి సమయాలలోను గోవును గౌరవించారు. వారు ఆవుయొక్క ఉపయోగాన్ని అంగీకరించడమే గాకుండా దాని హత్యను నిషేధించారు. కాని కొన్ని విశేషకారణాలవల్ల—వాటినిచ్చట ప్రకటింపనవసరంలేదు—ఆంగ్లేయుల శాసన కాలంలో మాత్రం గోహత్య చేయడానికి స్వేచ్ఛ ఉండేది. అయినా గత మహాయుద్ధ సమయంలో విదేశీ ప్రభుత్వానికిగూడ ఉపయోగకర పశువుల వధ నిషేధించక తప్పలేదు. ప్రభుత్వ పశు సంవర్ధన, సంరక్షణ కమిటీ తమ (1947 - 48) నివేదికలోని 21 వ పేజీలో ఇలా పేర్కొన్నది:

"యుద్ధకాలంలో పాడిపశువుల, కృషికి యోగ్యమయిన ఎద్దుల- భయంకరమైన కొఱతని గ్రహించబడింది. పాలవాడకంలో పెరిగిన 3% వృద్ధి, వ్యవసాయభూమిలో పెరిగిన 4% అధిక భూమివల్లనే ఈకొఱత ఉత్పన్నమయింది. దానికితోడు పశువుల సంఖ్యలోగూడ షుమారుగా 4% తగ్గిపోయింది. కనుక ఈ కొఱత ఇలాగే వృద్ధిపొందకుండా ఉండడానికి తగిన హామీ ఇవ్వగల శాసనాన్ని రూపొందించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఆ సమయంలో పశువుల వధ ఎక్కువ సంఖ్యలో సైనికాధికారుల ద్వారా జరుగుతుండేది. అందువల్ల వారితో సమాలోచనలు జరిపినమీదట ఈ క్రింది తరగతుల పశువులవధ నిషేధించాలని నిర్ణయించారు.

౧. మూడు సంవత్సరాలకంటె తక్కువ వయస్సు గల్గిన పశువులు.

౨. మూడునుండి పది సంవత్సరాల వరకు వయస్సుగల్గి, పనిచేస్తున్న, చేయగల్గిన పురుష జాతి పశువులు.

3. మూడునుండి పదిసంవత్సరాల వయస్సుగల్గి పాలు ఇవ్వగల్గిన ఆవులు. వీటిలో ఈనడానికి, అసమర్థమయిన ఆవులు కలవవు.

౪. అన్ని చూడిఆవులు, పాలు ఇస్తున్నటువంటి ఆవులు.

# స్వరాజ్యావతరణానంతరం జరిగిన

## కోట్ల సంతకాలతో విజ్ఞప్తులు, సభలు,

## 16-11-53 నుండి 30-11-53 వరకు దేశమంతా గోపాష్టమీ ఉత్సవాలు

### గోపాష్టమీ ప్రతిజ్ఞావశ్యకత


* శ్రీ లాలా హరదేవ్ సహాయ్ *


దేవభూమియైన భారతదేశానికి ఆధారము, శ్రద్ధాకేంద్రము అయిన గోమాత రక్షణ, సంవర్ధనములనేవి వివాదాస్పద విషయాలుగా కాకుండా సార్వకాలీన, సర్వమాన్య సత్యంగా చలామణి అవుతూవచ్చింది. గోవు మన సంస్కృతికి ప్రతీకము, ధర్మానికి ఆర్థిక జీవనానికి ఆధారశిల. ఇక్కడ ఎల్లప్పుడూ ధర్మసంస్కృతీ మార్గదర్శులు, సాంప్రదాయ నిర్నేతలునైన ఋషి, మహర్షులు దీని మహాత్మ్యాన్ని బోధిస్తూవచ్చారు; కవులు, సాహిత్యకారులు దీని కీర్తి గానంచేస్తూ వచ్చారు; వీరులు, యోధులు దీని మాన రక్షణకై ఆత్మార్పణచేస్తూ వచ్చారు. ఇందుకు సాక్ష్యం మన చరిత్రే.

సమాజ జీవన ప్రతీకమైన దీని ప్రాముఖ్యతను శుష్క వివాదాలతో కాకుండా సమాజవ్యాప్తమైన శ్రద్ధాభావనవల్లనే అంచనా చేయవలసి ఉంటుంది. కాని స్వతంత్రావతరణ తర్వాత సర్వమాన్యసత్యమును అసత్యమని, రాష్ట్రజీవన శిలకాదని సాధారణ ప్రజానీక భావనను అవహేళనం చేయడం జరుగుతోంది. ప్రజానీకపు సర్వవ్యాప్త శ్రద్ధను, రాజకీయ స్వార్థాలతో పోల్చి తూచడం జరుగుతోంది. ఇది మన దేశదౌర్భాగ్యం.

కాని దేశ ఆత్మ నశింపజాలదు. స్వార్థ, అజ్ఞాన తిమిరాన్ని ఛేదించి, ఎల్లప్పుడూ తన మార్గాన్ని ప్రశస్తం చేసుకుంటూ వుంటుంది. తరచు ముస్లిం శాసకులుసైతం గోహత్యను నిషేధించవలసివచ్చింది. అవసరమైనప్పుడు గోభక్తులచే బలిదానంకూడా చేయబడ్డది. ఆంగ్లేయుల కాలంలోకూడా గోరక్షా ఆందోళన ఒకప్పుడు మందంగాను, మరొకప్పుడు తీవ్రంగాను, వేరొక సమయంలో శాసన సంబంధంగాను, ఇంకొక సమయంలో సశాస్త్రీయ ఆందోళనారూపంలోనూ అనేకవిధాల సాగుతూ వచ్చింది. స్వామి దయానందునివంటి సాంస్కృతిక పురుషులు, గాంధీ, తిలక్, మాలవీయాలాంటి రాజనీతివేత్తలు ఈ ప్రశ్నను తెచ్చారు. 1897 నాటి సశాస్త్రీయ క్రాంతికారీ ఉద్యమం, కూకా ఆందోళనలలో కూడా గోమాత రక్షణ భావంతో వ్యాప్తిచెందాయి. అలాంటప్పుడు మన రాజ్యంలోనే భారతీయ మానసం ఆత్మహననానికి ఎలా అంగీకరించగల్గుతుంది?

కనుక, స్వాతంత్ర్య ప్రాప్తి అనంతరం గోరక్షా ఆందోళన మళ్ళీ ప్రారంభమైంది. స్వాతంత్ర్య ఘోషణను, భారతీయ విధాన మూలభూత సిద్ధాంతములలోని గోహత్యా నిషేధ అంశానికి టోకరా ఇవ్వబడడం చూచి, ప్రజానీకం మళ్లీ తన భావప్రకటన చేయ నారంభించింది. దేశం మూలమూలలనుండి ఆనాటి రాజ్యాంగసభాధ్యక్షులు శ్రీ రాజేంద్రబాబు, ప్రధానమంత్రి శ్రీ జవహర్లాల్ గార్లకు లక్షలాది ఉత్తరాలు, తంతులు పంపబడ్డాయి. తంతులు వేలసంఖ్యలో ఉన్నాయి. ఉత్తరాల సంఖ్య అంచనా కతీతమై పోయింది. ఫలితంగా 1947లో ప్రభుత్వముచే గోసంవర్ధన కమిటీ నియమించబడ్డది. గోహత్యను పూర్తిగా నిషేధించాలని ఆ కమిటీ సిద్ధాంతీకరించింది. ఆ నిర్దేశం రాజ్యాంగంలోని 48వ సూత్రంలో స్వీకరించ బడ్డది గాని అమలులోకి రాలేదు. ఈ సమస్యపై పూజ్యశ్రీ కరపాత్రస్వామి సత్యాగ్రహం చేశారు. వేలాది ప్రజలు గోమాత రక్షణకై జైళ్లకు వెళ్ళారు. కాని అవి చెవిటికి ఊదిన శంఖధ్వనులైనాయి. ప్రజాభిప్రాయాన్ని మరింత తీవ్రంగా ప్రకటించాలని అనుభవంవల్ల తెలిసివచ్చింది. పర్యవసానంగా దేశంలోని ప్రబలతర సంస్కృతీ సంస్థ అయిన రాష్ట్రీయ స్వయం సేవక సంఘం అగ్రేసరత్వం స్వీకరించి 1952 అక్టోబరు 27 నుండి నవంబరు 23 వరకు మహోద్యమం నిర్వహించింది. వేలాది సంఘ కార్యకర్తలు, గోభక్తులు గ్రామ గ్రామానికి వెళ్ళి జన జాగరణచేస్తూ, ప్రజాభీష్టాన్ని సంతకాలరూపంలో స్వీకరించారు. ఈ హస్తాక్షర ఉద్యమంలో గోరక్షను వ్యతిరేకించిన నాగరికులు కానరాలేదు. కేవలం నాల్గు వారాల అల్ప వ్యవధిలో 53,618 మంది కార్యకర్తలు 84,026 గ్రామాలు, పట్టణాలు తిరిగి 1,75,73,227 హస్తాక్షరాలను సేకరించారు. ప్రపంచ చరిత్రలో ఇంతవరకు ఎప్పుడూ అంత భారీఎత్తున హస్తాక్షరాల ద్వారా ప్రజాభిప్రాయ ప్రకటన జరిగిన ఉదాహరణలేదు. సంఘ సర్ సంఘ చాలక్ శ్రీ గురుజీ దేశ ప్రజల భావనా స్వరూపమైన ఈ హస్తాక్షర సమేత విజ్ఞప్తిని 1952 డిశంబరు 8 వతారీఖున రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌కు అందజేశారు.

గోభక్తికి సంబంధించిన ఈ రాష్ట్రభావనకు అడ్డువస్తోంది కేవలం ప్రధానమంత్రి శ్రీ జవహర్లాల్ జీ నెహ్రూగారేనని ప్రజలు గుర్తించారు. అందువల్ల ఆయనకూడా జనభావనను, సర్వవ్యాప్తమైనరాష్ట్రాత్మను ఎరుక చేసేందుకై ఆయన నియోజకవర్గంనుండే ప్రజానీకం గోహత్యానిషేధాన్ని కోరింది. 1951 నాటి ఎన్నికలలో (పండిత నెహ్రూకు ఎక్కడ 2,33,571 ఓట్లు లభించాయో అక్కడే 2,48,422 మంది ఓటర్లు ఆయనను (సంతకాలద్వారా) గోహత్యానిషేధం కోరారు.

జనజాగరణకు, అభిప్రాయ ప్రకటనకు సంబంధించిన ఇతర సాధనాలుకూడా వినియోగింపబడ్డాయి. 1954 లో ప్రయాగలో జరిగిన కుంభమేలాలో ప్రతిచోటా పెద్ద పెద్ద గోరక్షాసమ్మేళనాలు జరిగాయి. ఈ విధంగా ఆందోళన సర్వతోముఖమై విజృంభించింది. కార్యనిర్వహణకోసం 1954 ఫిబ్రవరి 4 న సంత్ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారి అధ్యక్షతన గోహత్యానిరోధ సమితి ప్రారంభింపబడ్డది. శ్రీ బ్రహ్మచారివంటి సంత్‌కూడా ఈశ్వరభక్తితోపాటు గోమాత రక్షణకోసంకూడా దేశా

# గోహత్యానిషేధోద్యమం

## సమావేశాలు, సత్యాగ్రహాలు

టన ప్రారంభించారు. సభలు, ఊరేగింపులు, ప్రదర్శనలు మొదలైన తతంగాలను స్వీకరించవలసివచ్చింది. కాని శాసనం వెలువడలేదు.

అనంతరం సత్యాగ్రహ శస్త్రంకూడా ప్రయోగింపబడ్డది. లక్షలాది గోభక్తులు, మాత రక్షణార్థమై కృష్ణ జన్మస్థానానికి వెళ్ల సిద్ధమైనారు. అయితే ఈ మహాయజ్ఞాన్ని ఎక్కడ ప్రారంభించాలనేది సమస్య. గోపాల భగవానుడైన శ్రీకృష్ణుని మధురయే సర్వోత్తమ స్థానం. ఆ ప్రకారం 1954 నాటి జన్మాష్టమి రోజున గోపాలుని పూజ జరిపి, మరుసటిరోజు ఉదయమే గోరక్షా సత్యాగ్రహ యజ్ఞంలో ప్రథమ ఆహుతుల నర్పించ నిర్ణయమైంది. మధుర కసాయిశాలకు సత్యాగ్రహ దళాలు పయనమై వెళ్ళవలసి ఉంది. అయితే దానికి ఎనిమిదిరోజులకు పూర్వమే కసాయిశాలలు స్వయంగా మూసివేయబడ్డాయి. ఇది ప్రథమ విజయం. గోపాలుని స్థానంలో గోహత్యాకళంకం తొలగింది.

ఇప్పుడు గోభక్తులు అనంత యాత్రను లక్నోవైపు మళ్ళించారు. ప్రభుత్వం లొంగింది. గోహత్యానిషేధ శాసనం చేయడం గత్యంతరమైంది. తర్వాత సత్యాగ్రహం బీహారులో ప్రారంభమైంది. అక్కడకూడా విజయం లభించింది. పంజాబ్, మధ్యప్రదేశ్‌లలో సత్యాగ్రహ ఆవశ్యకతే లేకపోయింది. ఆ ప్రాంత ప్రభుత్వాలు ముందుగానే గోహత్యను నిషేధిస్తూ చట్టాలు చేశాయి. అనంతరం ఉత్కళ, బొంబాయి, ఆంధ్ర, అస్సాం ప్రాంతాలలో గోహత్యా నిరోధ ఆందోళనకు సూత్రధారణ చేయబడ్డది. బీహార్, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్ కసాయీలు గోహత్యా నిషేధ శాసనాలకు సుప్రీంకోర్టులో సవాలుచేశారు. 1958 ఏప్రిల్ 23 నాటి సుప్రీంకోర్టు ఫుల్ బెంచి తన నిర్ణయంలో — వృద్ధ, అంగవికలాది ఏరకం గోవులుగాని, దూడలుగాని, ఉపయోగకరమైన ఎడ్లుగాని వీటన్నిటి వధను నిషేధించడం సమంజసమేనని ప్రకటించింది. గోహత్య అనేది ఇస్లాం మతాధికారం కాదనికూడా అది ప్రకటించింది.

కాని విచారకరమైన విషయమేమంటే కేంద్రప్రభుత్వం రాజ్యాంగంలోని 48 వ సూత్రానుసారంగాను, సుప్రీంకోర్టు నిర్ణయానుసారంగాను ఇంతవరకు తాను దేశాని కంతటికీ గోహత్యా నిషేధ శాసనాన్ని చేయలేదు. ప్రాంత ప్రభుత్వాలకు ఆజ్ఞా ఇవ్వలేదు. పీలున్నన్ని ఆటంకాలు కల్పించడమే కేంద్ర ప్రభుత్వ నీతిగా కనిపిస్తోంది. గోవధ జరుగుతూనే ఉంది. ప్రతిఏడూ కోట్లరూపాయీల విలువగల ఆవుల, దూడల చర్మాలు, గోమాంసము, ప్రేవులు వగైరాలు విదేశాల కెగుమతి అవుతూనే ఉన్నాయి. లక్షలాది ఆవులు, దూడలు వధింపబడానికై పాకిస్థాన్‌కు ఎగుమతి అవుతూనే ఉన్నాయి. గోగ్రాసాన్ని ఎగుమతి చేసియు, దురుపయోగంచేసియు, ముఖ్యంగా గోభూములను విచ్ఛిన్నం చేయనాజ్ఞలిచ్చియు, గోసంతతి ఆకలితో మరణించే దుర్దశకు ప్రభుత్వం కారణమవుతోంది. అయినా ప్రజలు గో రక్షణకై కటిబద్ధులై ఉన్నారు. ప్రభుత్వం లొంగక తప్పదు.

## ఆంధ్రప్రాంత గోపాష్టమీ ఉత్సవాలు

### నవంబరు 9 నుండి 23 వరకు

మన ప్రాంత అవసరాన్నిబట్టి గోపాష్టమీ పక్షాన్ని నవంబరు 9 నుండి 23 వరకు జరపవలెనని ఆంధ్రప్రదేశ్ గోహత్యా నిరోధసమితి నిశ్చయించింది. సభలు, ఊరేగింపులు, తీర్మానాల ద్వారానేకాకుండా ప్రభుత్వానికి, తమ తమ శాసనసభా ప్రతినిధులకు ఉత్తరాలు, తంతులు ప్రతినిధివర్గాలద్వారాకూడా ప్రజాభిప్రాయం స్పష్టంచేయవలసిఉంది. అడగకుండా న్యాయం లభించే అవకాశం లేనప్పుడు అడగడం ప్రతివారి విధి. బిల్లు సెలెక్టుకమిటీ ముందున్నదనే ఉద్దేశంతోనూ, ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులు అవసరమైనది చేయగలరనే ఉద్దేశంతోనూ జాగుచేయడం తగనిపని. 27-10-58 నాటి సెలెక్టుకమిటీ సమావేశంలోకూడా ఏ నిర్ణయమూ చేయకుండానే మళ్లీ నెలకు వాయిదా వేశారట! వారందరిని కర్తవ్య నిర్వహణలో ఉంచే బాధ్యత, నిషేధానికి అనుకూల వాతావరణం కల్పించే బాధ్యత ప్రజలమైన మనమీద ఉంది. ఉత్సవాలలో పాల్గొని విజయం చేకూర్చవలసిందిగా ప్రజానీకమంతటినీ ప్రార్థిస్తున్నాం.

జాగృతి పాఠకులకు మరొకప్రత్యేక విజ్ఞప్తికూడా. గోహత్యా నిరోధసమితులు లేనిచోట్ల జాగృతిపాఠకులే ముందుకువచ్చి పై ఉత్సవకార్యక్రమాలను జరిపించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

ఇట్లు

తూములూరి లక్ష్మీనారాయణ,

కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ గోహత్యా నిరోధ సమితి

## ప్రజానీకం కోరుతున్న వివి.

1. భారత రాజ్యాంగ మూలసూత్రాలను సంస్కరించి గోవంశపు హత్యను దండనీయంగాను, శిక్షార్హంగాను ప్రకటించాలి.

2. సుప్రీంకోర్టు నిర్ణయం ప్రకారం గోవంశహత్యను శాసనం ద్వారా నిషేధించాలి. అంటే ఏఏప్రాంతాల్లో గోహత్య నిషేధంలేదో అక్కడంతా అలాంటి శాసనాలు చేయాలి.

3. గోచరభూములను ధ్వంసంచేయడం, గ్రాసాన్ని ఎగుమతి చేయడం, దురుపయోగం చేయడం ఇలాంటివాటి నాపుజేసి గోరక్షణను, గో సంవర్ధనను నిర్వహించాలి.

ఈ లక్ష్యప్రాప్తికి ఆందోళనను మరింత తీవ్రతరం చేయవలసి ఉంటుంది. గోభక్తులు ప్రజలను పూర్తిగా జాగృతం చేసి సంఘటితపరచవలసి ఉంటుంది. స్థాన స్థానంలోను గోహత్యా నిరోధసమితులను స్థాపించి, సర్వతోముఖంగా కార్య సంచాలనం చేయవలసి ఉంటుంది. మీరుకూడా ఈ గోపాష్టమీ పావన పర్వసమయంలో దృఢప్రతిజ్ఞ స్వీకరింతురుగాక !

## భావి కార్యక్రమం

1. దేశమంతా 1958 నవంబరు 16 నుండి 30 వరకు గోపాష్టమి పక్షోత్సవాలు జరపాలి.

(తరువాయి 88 వ పుటలో)

### 3. స్వరాజ్యం వచ్చిన తర్వాత

స్వరాజ్యం వచ్చిన తర్వాత కేంద్ర వ్యవసాయశాఖ 1947 నవంబరు 19న ఈ క్రింది శాసనాన్ని (No. F. 2542/47 L) ఆమోదించింది. "ఈ దేశంలో ప్రతిసంవత్సరము మాంసంకొరకు భారీ సంఖ్యలో పశువుల వధ జరుగుతోందని భారతప్రభుత్వానికి తెలిసింది. విచక్షణా రహితమయిన ఈ హత్యకి అన్ని ప్రాయాలు, అన్నిగుణాలు గల్గిన పశువులు గూడ గురి అవుతున్నవి. ఈ పశువధ ఫలితంగా ఉత్పత్తి పడిపోయింది. కృషి యోగ్యమయిన పశువులకొఱత ఏర్పడింది. ఈవిధంగా దేశంలోని పశుసంపద నష్టపడిపోతుంది. శాసనంద్వారా పశువధని ఆపడానికి వెంటనే చర్యతీసుకోవడంకొరకుగాను వార్తాపత్రికలలోను, సభలద్వారానుపూర్తిఆందోళనజరిపారు. దీనినిసమాజంతోను, ధర్మంతోనుసంబంధంగల్గిన కఠిన సమస్యగా తెలుసుకుని భారత ప్రభుత్వం బాగా ఆలోచించిన మీదట, ప్రభుత్వ, ప్రభుత్వేతరమైన కొంతమంది ప్రవీణులతో ఒక సమితిని ఏర్పాటుచేసి, ఈ సమస్యను అన్ని దృక్కోణాలలోను ఆలోచించి పశుసంపద రక్షణార్థం, లాభదాయకమయిన వృద్ధికోసం, సమగ్రమైన ప్రణాళికను తయారు చేయాలని నిర్ణయించింది.

సమితి ఈక్రింది విషయాలమీద విశేషంగా ధ్యాన ముంచాలని ఆదేశించబడింది.

౧. ఏయే జాతి పశువుల సంఖ్యలో ఎప్పుడెప్పుడు ఎంతెంత తరుగుదల వచ్చింది? ఎందువల్ల? ఈ తరుగుదలవల్ల పాల ఉత్పత్తిపై, ఎడ్లవల్ల కలిగే ఉత్పాదనశక్తిపై ఎట్టి ప్రభావం కలిగింది?

౨. పశువధ విషయంలో సేకరింపడిన అంకెలనుబట్టి ఉపయోగపశువులు వధయొక్క అనుపాతం ఎంతఉన్నది? దానివల్ల ఆర్థికంగా ఎంత నష్టం కలిగింది?

3. ముసలివి, నిరుపయోగ పశువుల సంఖ్య పెరుగుతోందా, లేక తరుగుతోందా? పశుగ్రాసం కొరత, పశు వధకు విరుద్ధంగా ప్రబలమైనభావన- ఈ రెంటిదృష్ట్యా ఆర్థికంగా వాటి ఉపయోగం ఎంత? వాటి పోషణ సమస్యను ఎలా పరిష్కరించాలి.

౪. పశుధనాన్ని రక్షించటానికీ, అభివృద్ధి పరచటానికీ గోశాలలు, పశురక్షా సమితులు,

(తరువాయి 85 వ పుటలో)

## ఆంధ్ర శాసనసభ్యులకు విజ్ఞప్తి

### —: కల్నల్ డి. యస్. రాజు, శ్రీ ఎ. రామారావ్ :—

లోకసభ సభ్యులు కల్నల్ డి. యస్. రాజు (కాంగ్రెసు), శాసనమండలి సభ్యులు శ్రీ అవసరాల రామారావు (జనసంఘం) గార్లు గోపాష్టమి సందర్భంలో రాజమండ్రినుంచి ఒక ప్రకటన చేస్తూ ఇలా అన్నారు :

శాసనసభలో చర్చకు రాబోయే గోహత్యా నిరోధ బిల్లును బలపరచ వలసిందిగా ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యులందరికీ మేము విజ్ఞప్తి చేస్తున్నాము.

బీహారు, ఉత్తర ప్రదేశ్, మధ్య భారత్ ప్రాంతాలు ఇట్టి శాసనాలను ప్రవేశపెట్టాయి. సుప్రీంకోర్టు ఆశాసనాలన్నీ న్యాయసమ్మతాలనీ, రాజ్యాంగంలోని 48 వ సూత్రాన్ని అమలుపరుస్తున్నాయనీ తీర్పు నిచ్చింది.

'మన దేశంలో పాడిఆవులకు, ఎడ్లకు కొరత ఏర్పడింది. మన జాతి అందరికీ బలవర్ధకమైన ఆహారం సమృద్ధిగా దొరకి, ప్రజారోగ్యం పెంపొందాలంటే పశుగణాభివృద్ధి జరగాల'ని ప్రధాన న్యాయమూర్తి పేర్కొన్నారు. సామాజిక, ఆర్థిక పురోభివృద్ధి దృష్ట్యా ఆయనవాదన నూటికి నూరుపాళ్ళు సమంజసమే.

ధార్మికంగానూ, తాత్వికంగానూ పరిశీలిస్తే యుగయుగాలనుండి హిందువులు గోవును మాతగా పూజిస్తూ వచ్చారు. అది శాంతికీ, సుఖ సమృద్ధులకు చిహ్నం. వేదాలలో- పురాణాలలో- గోవుపట్ల భక్తిప్రపత్తులు వ్యక్తపరుపబడ్డాయి. ఈజిప్టుదేశస్థులు, స్కాండినేవియనులు, ఇరానియనులుకూడా గోవును ఆరాధిస్తారు.

కనుక రాబోయే బిల్లును సమర్థించి ఆవుల, దూడల, ఎడ్ల, ఇతర పశువుల ప్రాణాలను కాపాడటం మనందరి కర్తవ్యం. ఈ విషయంలో ఏకగ్రీవాభిప్రాయానికి రావాలని శాసనసభ్యు లందరికీ మా విజ్ఞప్తి.

# భారతీయత, ప్రజాస్వామ్యము లేని ప్రణాళిక

## రష్యాపై మోజు, వ్యవసాయంపై శీతకన్ను దీని లక్షణం!

## ఆర్థికంగా అసమానత్వం, అసంతృప్తిలో సమానత్వం దీని ఘన విజయాలు!

భారతీయ జనసంఘం ప్రప్రథమంనుండీ ద్వితీయ ప్రణాళికను విమర్శిస్తూనే ఉంది. పరస్పర సంఘర్షణతో కూడిన వివిధ వర్గాల కార్యకలాపాలకన్న; ప్రయోజన రహితమైన స్పర్థకన్న; నియమ నిబంధనలు లేక సమాజ వ్యతిరేకంగా పనిచేసే పరిశ్రమకన్న ప్రణాళికాబద్ధమైన కృషి అత్యావసరమని అది గుర్తిస్తోంది. అయితే ప్రజాస్వామ్యాన్ని, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని వమ్ముచేసే సోవియట్ పద్ధతి ప్రణాళికా రచన, నిర్వహణలను అది వ్యతిరేకిస్తుంది. ఒక ప్రణాళికయొక్క పరిమాణం, దాని నిర్వహణకు అనుసరింపదగు విధానం నాటి ఆర్థిక పరిస్థితులపై, ఆర్థిక లక్ష్యాలపై మాత్రమే కాక జాతియొక్క రాజకీయ, సామాజిక విలువలపై కూడ ఆధారితం కావాలి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక-అది ప్రజాస్వామ్యంపై విశ్వాసాన్ని ప్రకటించినప్పటికీ, దానిని పూర్తిగా కార్యాన్వితం చేయటానికి మన స్వాతంత్ర్యాలన్నీ హరింపబడాలి. ప్రణాళికా నిర్మాతలు ఊహించిన విధానాలను అవలంబించటానికి ప్రభుత్వం చూపే సంకోచమే ద్వితీయ ప్రణాళిక ఒడుదుడుకులలో పడటానికి చాలవరకు కారణం. ప్రజాస్వామ్యం, ద్వితీయ ప్రణాళికా పొసగని విషయాలు. మనం వాటిలో ఒకదానిని స్వీకరించాల్సి ఉంటుంది. జనసంఘం ప్రజాస్వామ్యాన్ని స్వీకరిస్తుంది.

### ద్వితీయ ప్రణాళిక అభారతీయం

ద్వితీయ ప్రణాళిక భారతీయ పరంపరను, సమాజ నిర్మాణాన్ని గుర్తించుటలో విఫలమయింది. విదేశంనుండి పూర్తి సహాయం పొందినప్పటికీ, మనం పారిశ్రామికాభివృద్ధిని ప్రపంచంలోని ఒక భాగంనుండి మరొక భాగానికి తరలించలేము. మనపథకాలన్నీ ఆత్మనిర్భరతపైన స్వయంకృషిపైన ఆధారితమై ఉండాలని జనసంఘం భావిస్తోంది. తద్వారా పరిశ్రమలపట్ల, వ్యవసాయంపట్ల మరొక విభిన్న దృక్పథం ఏర్పడిఉండేది. ద్వితీయ ప్రణాళిక మన ఆర్థిక వ్యవస్థనంతటినీ నిర్మించటానికి నేటి ఉత్పత్తి విధానాన్ని పునాదిగా తీసుకోనందువల్ల ఒక ప్రక్క నిపుణులైన కార్మికులకు, పెట్టుబడికి, యాజమాన్యానికీ కొరత ఏర్పడింది; మరొక ప్రక్క నిరుద్యోగంలో పెరుగుదల, డీకేపిటలైజేషన్ (Decapitalization) ఏర్పడింది. ప్రథమ ప్రణాళికా కాలంలో భారీ యంత్రాల సహాయంతో నడుపబడే పరిశ్రమల అభివృద్ధి; చిన్నతరహా పరిశ్రమల, గృహపరిశ్రమల తరుగుదల జరిగింది. ద్వితీయ ప్రణాళికా కాలంలో ఇదే పరిస్థితి కొనసాగుతోంది.

విదేశీ యంత్రసామాగ్రిని, నిపుణులను దిగుమతి చేసుకుని, వాటి కనుగుణంగా ఇతర ఉత్పత్తి స్థితిగతులను సర్దుకునే ప్రయత్నానికి బదులు, మనకు నేడున్న ఉత్పత్తి స్థితిగతులకు సరిపడే యంత్రసామాగ్రిని కనుగొనే సవాలును మనం ఎదుర్కొనాలి. అది జరిగిననాడు, అందరికీ లాభదాయకమైన పని కల్పించటం, ఆర్థిక అసమానతలను తగ్గించటం, ప్రజల జీవన స్థరాన్ని పెంచటం-అనే అంతిమ లక్ష్యానికి సంబంధించినంతవరకు ద్వితీయ ప్రణాళికకన్న అత్యాశాయుతమైన ప్రణాళికను మనం తయారు చేయవచ్చు. వికేంద్రీకృతమైన చిన్న తరహా యంత్ర పరిశ్రమ రంగంతో మనం ఆ లక్ష్యాలను సాధించగలం. పాశ్చాత్య దేశాలలోని ఇటీవలి పరిశోధనలు ఇదేదిశను నిర్దేశిస్తున్నాయి. ద్వితీయ ప్రణాళిక అమెరికా ఆర్థిక మాంద్యానికి పూర్వపు యంత్రవ్యవస్థపైన, ఆర్థిక సిద్ధాంతాలపైన ఆధారితమై ఉంది.

ఉత్పత్తిలో అభివృద్ధిపైన, న్యాయసమ్మతమైన వినిమయంపైన, వినియోగంలో సంయమనంపైన సమానమైన శ్రద్ధ చూపేపక్షంలో సువ్యవస్థితమైన ఆర్థిక జీవనం సాధ్యమని జనసంఘం భావిస్తోంది. ఉత్పత్తిలోని అభివృద్ధితో పాటు ప్రజల కొనుగోలుశక్తికూడ పెంచబడాలి. ప్రణాళిక అందరికీ పని చూపించేందుకు పూనుకున్నప్పుడే ఇది సాధ్యమవుతుంది. ద్వితీయ ప్రణాళిక ఉద్యోగాలకు అవకాశాలను పెంచే విషయం మాత్రమే ప్రస్తావించింది. లక్ష్యాన్ని నిర్ణయించినప్పుడుకూడ అది నిరుద్యోగులుగా ఉన్న సుమారు ఒక కోటి మందికి ఉద్యోగాలిచ్చే ఏర్పాటు చేయలేదు. ఆ తర్వాత ఆ లక్ష్యాలుకూడ తగ్గించబడ్డాయి. నేడు కొన్ని పరిశ్రమలలో ముఖ్యంగా వస్త్ర పరిశ్రమలో- ఏర్పడిన మాంద్యానికి ప్రముఖ కారణం ప్రజల కొనుగోలుశక్తి క్షీణించటమే. ప్రభుత్వ ధనంలో అధికభాగం పెట్టుబడి పథకాల (Capital projects) పై ఖర్చుకావడంవల్ల, లోటు బడ్జెటులు (deficit financing) ఎన్ని వేసినప్పటికీ, సామాన్య ప్రజల చేతులలో అదనపుసొమ్ము ఉండటం లేదు. ప్రభుత్వంయొక్క పన్నుల విధానం ధరల పెరుగుదలకు, దాని అనివార్య ఫలితమైన



శ్రీ దీనదయాళ్ ఉపాధ్యాయ

వేతనాల పెరుగుదలకు దారితీసింది. ప్రజల కొనుగోలుశక్తి పెంచనిదే ఈ దుష్పరిణామాల వలయాన్ని ఛేదించటం సాధ్యంకాదు. నిరుద్యోగులకు ఉద్యోగాలు చూపటంవల్ల, కుటుంబంయొక్క ఖర్చులో ప్రధానాంశములైన ఆహార వస్తువుల ధరలను స్థిరీకరించటం ద్వారా దానిని సాధించవచ్చు.

## వ్యవసాయంపై శీతకన్ను

మన ప్రథమ కర్తవ్యం వ్యావసాయికోత్పత్తిని పెంచటమని నేడు సర్వత్రా అంగీకరింపబడుతోంది. స్వాతంత్ర్యప్రాప్తి తర్వాత మనం రు 1200 కోట్లు ఖరీదుచేసే ఆహారధాన్యాలను దిగుమతి చేసుకున్నాం. ప్రణాళికాసంఘం వ్యవసాయానికి మారుగా ప్రాతిపదిక, భారీ పరిశ్రమలకు ప్రాధాన్యత నివ్వటం దాని దూరదృష్టి లేమిని సూచిస్తోంది. ప్రథమ ప్రణాళికాకాలంలో వ్యావసాయికోత్పత్తిలోని విశేషాభివృద్ధికి వర్షాలు, అదృష్టం ఎంతగా దోహదం చేశాయో వారు గ్రహించలేకపోయారు. వ్యావసాయికోత్పత్తిలో అమ్మ దగిన నిలువ (marketable surplus) పెరుగనిదే మనం పరిశ్రమలను, పట్టణాలలోని ప్రజలను పోషించటంకాని, పరిశ్రమలలో తయారైన వస్తువులకు అభివృద్ధిపొందే మార్కెట్టును సంపాదించటం కాని సాధ్యంకాదు. మన పరిశ్రమలను నడుపుకునేందుకు మనం విదేశీమార్కెట్లపై ఆధారపడి ఉండలేము, ఉండకూడదు. అపారమైన జనసంఖ్య, సహజ సంపద కలిగిన భారతదేశం స్వయంసమృద్ధమైన ఆర్థిక వ్యవస్థను తేలికగా రూపొందించవచ్చు.

ప్రధాన మంత్రిగారి దీర్ఘోపన్యాసాలవల్ల వ్యావసాయికోత్పత్తి పెరుగదు. ప్రణాళిక గ్రామీణ ప్రజల అవసరాలను, మనస్తత్వాన్ని గుర్తించ లేకపోయింది. నామమాత్రపు భూసంస్కరణలు సగం సగం అమలు జరుపబడటంవల్ల గ్రామీణ జీవనం అస్తవ్యస్తమై పోయింది. అవి ప్రజలకు ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని ఒసగలేక పోయాయి. ద్వితీయ ప్రణాళిక లక్షిస్తూన్న సమష్టి వ్యవసాయం ఉత్పత్తిని మరింత దెబ్బతీస్తుంది. మన లక్ష్యం ఎకరం ఒకటికి అత్యధికమైన ఉత్పత్తికాని ఒక్కొక్క కార్మికునికి అత్యధికమైనఉత్పత్తికాదుకనుక మనంభూమిపై రైతుకు హక్కు ఉండేటట్లు చూడాలి. దూరాన ఉండి పొలంపై యాజమాన్యం వహించేపద్ధతి, దళారీల పద్ధతి రద్దు చేయబడాలి. 1951 నాడే జనసంఘం చిన్న నీటివనరులపై ప్రత్యేక శ్రద్ధ అవసరమని సూచించింది. ప్రభుత్వం ఈ విషయాన్ని నేడు గుర్తిస్తోంది.

ప్రభుత్వ రంగం యొక్క విస్తృతిని జనసంఘం వ్యతిరేకిస్తోంది. 1956 నాటి పారిశ్రామిక విధానానికి వ్యతిరేకంగా ప్రభుత్వం నేడు న్యాయయుతంగా ప్రజలకు వదల వలసిన పనులను తన నెత్తిని వేసుకుంటోంది. జీవితభీమా, రోడ్డురవాణా, పాఠ్యగ్రంథాలు, రైల్వేలలో ఆహారపు సరఫరా-ఇవి దానికి కొన్ని ఉదాహరణలు. కొన్ని పల్లెల్లో కుంటలలో చేపలుపట్టుకునే హక్కు కూడ ప్రభుత్వపరం చేయబడింది. నేటివరకూ ఎలాగో బ్రతుకుతూ వచ్చిన బీద ప్రజలు క్రమంగా జీవనసాధనాలను కోల్పోతున్నారు. మనసోషలిజం ప్రభుత్వంఇలా ఉంది.

(తరువాయి 91 వ పేజీలో)

# భారతీయ మనస్తత్వం ప్రజాస్వామ్యయుతం

## అయితే ప్రజల అవిద్య, ప్రభుత్వ వైఖరి ప్రజాస్వామ్యానికే ముప్పుతెచ్చేవిగా ఉన్నాయి

భారతదేశం ప్రపంచంలోని ప్రజాస్వామిక దేశాలలో పెద్దది; ఆశియాలో నేటికీ నిలచి ఉన్న ఒకే ఒక స్థిరమైన ప్రజాస్వామ్య దేశం. దాదాపు 200 కోట్ల మంది వోటర్లు, 10,000 మైళ్ళ విస్తీర్ణమూ కలిగి పారిశ్రామికంగా వెనుకబడిన మనదేశం ప్రజాస్వామ్య పద్ధతికి ఒక ప్రయోగశాలగా ఏర్పడింది. ప్రజాస్వామ్యం యొక్క ఇక్కడి విజయంపై ఆశియాలో, యావత్ప్రపంచంలో దానిభవిష్యత్తు ఆధారితమై ఉంది.

ఇక్కడ ప్రజాస్వామ్యం విజయాన్ని పొందినట్లు కనపడుతోంది. గత రెండు సాధారణ ఎన్నికలు ప్రశాంతంగా జరగటం, వివిధస్థాయిలలో ప్రజాస్వామ్య వ్యవస్థలు చక్కగా నడుస్తూ ఉండటం దీనికి సూచకం. దీనికి కొన్ని కారణాలున్నాయి.

### వేదకాలంనాటి ప్రజాస్వామిక భావన

ఋగ్వేద కాలంనుండి ఏదో ఒక రూపంలో ప్రజాస్వామిక పరంపర దేశంలో కొనసాగుతూ ఉండటం వానిలో ప్రముఖమైనది. సభ, సమితి, ప్రగ, పంచాయత్‌ల వంటి ప్రజాస్వామిక వ్యవస్థలు వేలాది సంవత్సరాలుగా ఇక్కడ పనిచేస్తూ వచ్చాయి. వాటిలో స్వేచ్ఛగా చర్చలు జరగాలని వైదిక, బౌద్ధ, వాఙ్మయాలలో ఆదేశించబడింది. క్రీ. శ. 4 వ శతాబ్దం వరకు రాజరికాలతోపాటు గణరాజ్యాలు, ముస్లిముల పాలన కాలంలో గ్రామ పంచాయితీలు సమర్థవంతంగా నడుపబడుతూ ఉండేవి. సర్ ఛార్లెస్ మెట్కాఫ్ గత శతాబ్దపు మధ్యకాలంలో నేటి ఉత్తర ప్రదేశ ప్రాంతంలో ఉన్న గ్రామ పంచాయితీలు చిన్న చిన్న గణరాజ్యములని పేర్కొన్నాడు. ఒక గ్రామానికిగాని, పట్టణానికిగాని, వృత్తికిగాని ప్రతినిధులను ఎన్నుకోవటం, వారికి గౌరవాన్ని ఇవ్వటం మనకు సాంప్రదాయికంగా వస్తూన్న విషయమే.

### హిందూ ధర్మంలో సహనభావం

వ్యక్తికి గౌరవాన్ని ఇవ్వటం, వాక్స్వాతంత్ర్యం- వీటివల్ల ఏర్పడిన సహనభావానికి మన పరంపరలో ప్రముఖ స్థానం ఉండటం మరొక కారణం. భావస్వాతంత్ర్యం, విశ్వాసాలలో స్వేచ్ఛ భారతీయ సంస్కృతికి మౌలికమైనవి. ఇస్లాము క్రైస్తవ మతంవంటి సెమెటిక్

శ్రీ బాల్‌రాజ్ మధోక్

మతాలలో ఉన్న అసహనభావం, మతదురహంకారము వైదిక మతానికి అపరిచితాలు. ఋగ్వేదం "ఏకం సద్ విప్రాః బహుధా వదంతి" దైవ మొక్కడే; అతనిని వివిధ నామాలలో పిలుస్తారు. కనుక ఆయనను వివిధ మార్గాల ద్వారా పొందవచ్చు. వైదిక ధర్మంయొక్క ఈ విశాలత భారతీయ జీవనాన్ని అన్ని స్థాయిలలోనూ ప్రభావితం చేసింది. కనుక సాంస్కృతికంగా భారత ప్రజలు ప్రజాస్వామ్యానికి పూర్తిగా అర్హులు.

నాలుగు దశాబ్దాలపాటు బ్రిటిష్‌వారితో సంబంధం, ప్రజాస్వామిక పద్ధతుల అనుభవం దేశంలోని మేధావులను పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి అనుకూలురుగా చేసింది. కనుక నేవారు తిమకుతామే మనదేశంలో ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ఏర్పరచారు.

భారత రాజ్యాంగం పౌరులకు ప్రాథమిక హక్కులను, న్యాయశాఖను, ఎన్నికల కమీషన్‌ను ఇచ్చింది. న్యాయశాఖ మొత్తంమీద తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకొన్నదనే చెప్పాలి. ఎన్నికల కమీషన్ కూడ ఎన్నికల నిర్వహణలో ప్రజలకు విశ్వాసాన్ని కలిగించింది.

కాని ఈ వాతావరణంలో ఇటీవల కొంత మాలిన్యం ఏర్పడింది. ప్రజాస్వామ్యం పేరిట అధికారాన్ని చెలాయిస్తూన్న నాయకులవల్ల, దేశ పరిస్థితిలోని రాజకీయ, ఆర్థిక, సాంఘిక ఉద్రిక్తతలవల్ల ప్రజాస్వామ్య వ్యవస్థ దెబ్బ తింటోంది.

### ప్రభుత్వనాయకుల బాధ్యతారాహిత్యం

ఏ దేశంలోనైనా ప్రజాస్వామ్యంయొక్క విజయానికి ప్రజాస్వామిక భావాల పట్ల, పద్ధతుల పట్ల సరైన దృక్పథం, వాటి సక్రమ వికాసానికి అనుగుణమైన కట్టుబాట్లు అవసరం. ఇది ముఖ్యంగా ప్రభుత్వపక్షం చేయవలసిన పని. కాంగ్రెసుపక్షం తన ఈ కర్తవ్యాన్ని నెరవేర్చక పోవటం దురదృష్టకరం. ప్రజాస్వామికమైన ఒత్తిడికి లొంగని విదేశీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆందోళనచేసి అధికారంలోకి వచ్చిన కాంగ్రెసు నాయకులు ఆందోళనపట్ల బలహీన వైఖరిని ప్రదర్శించారు. గత 11 ఏండ్ల పాలనలో కాంగ్రెసు ప్రభుత్వం ప్రజాస్వామిక పద్ధతులను లెక్కచేయక, ప్రజాస్వామ్య వ్యతిరేకమైన ఆందోళనలకు లొంగిపోయింది. సుమారు 2 కోట్లమంది సంతకాలుగల గోవధ నిషేధ విజ్ఞప్తిని పెడచెవిని బెట్టిన ప్రభుత్వం, ఉత్తరప్రదేశ్‌లో కొన్ని వేలమంది చేసిన సత్యాగ్రహానికి లొంగి ఆ కోరికను అంగీకరించింది. స్వర్గీయ డా. శ్యామప్రసాద్ ముఖర్జీ, పండిత ప్రేమనాథ్ డోగ్రాలు షేక్ అబ్దుల్లా దుశ్చర్యలను అరికట్టాలని సతర్కంగా నచ్చచెప్పజూచిన యత్నాలన్నీ విఫలమై దేశవ్యాప్తమైన ఆందోళన జరిగి వేలాది మంది ఖైదుచేయబడి, పోలీసుల హత్యాకాండ జరిగిన తర్వాత సఫలమయింది. అదే విధంగా, ప్రతిపక్షాలన్నీ కలసి సత్యాగ్రహం చేసేవరకూ, ఆహార విధానాన్ని అన్ని పక్షాలతో కూడిన

సంఘాన్ని సంప్రదించి రూపొందించాలనే ఉత్తరప్రదేశ్ ప్రజల కోరిక అంగీకరింబడలేదు.

### ఆందోళనలకు లొంగుబాటు

పర్యవసానంగా దేశంలో రాజకీయ చైతన్యం కలిగిన వర్గాలు ప్రజాస్వామిక పద్ధతుల సామర్థ్యంలో విశ్వాసాన్ని కోల్పోతున్నాయి. ప్రజల దృష్టిలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అగౌరవం పాలు చేయదలచే ప్రజాస్వామ్య వ్యతిరేక శక్తులకు - ముఖ్యంగా కమ్యూనిష్టులకు - ఈ పరిస్థితిని స్వప్రయోజనాల కోసం వాడుకుంటున్నారు. వారు ప్రజాస్వామ్య వ్యతిరేకమైన ఒత్తిడులను తెస్తూండడం చూచి ఇతరపక్షాలు తాము వెనుక పడుతామనే భయంతో అదే పంథాను అనుసరిస్తున్నారు.

### ప్రజల అజ్ఞానం, దారిద్ర్యం.

ప్రజలలోని అజ్ఞానం, నిరక్షరాస్యతకూడ దేశంలో ప్రజాస్వామ్య భవిష్యత్తుకు ప్రమాదకరాలే. మనం వయోజన ఎన్నికలు కావాలని నిశ్చయించాం; అయితే వోటర్లకు విద్యను, విజ్ఞానాన్ని గరపటంలో తగినంత ఉత్సాహాన్ని, శ్రద్ధనూ ప్రదర్శించలేను. తత్ఫలితంగా వోటర్లలో అత్యధిక సంఖ్యాకులకు తమ వోటింగు హక్కును విజ్ఞతతో ఉపయోగించుకొనేందుకు తగిన పరిజ్ఞానం ఉండటంలేదు. సామాన్య ప్రజల దారిద్ర్యం, సామాజికంగా వారు వెనుకబడి ఉండటం పరిస్థితి మరింత విషమింప జేస్తున్నాయి.

విద్యావంతులు ఉపేక్ష వహించటం, పోలింగుకేంద్రాలకు వెళ్లే శ్రమ తీసుకోవటానికి ఏవగించటంకూడ కనపడుతోంది. చదువురానివారు తమ కులంయొక్క నాయకుల ఒత్తిడి వల్లనో, ధనంకోసమో గుంపులు గుంపులుగా పోలింగు కేంద్రానికి రావటం, విద్యావంతులను బలవంతాన, నచ్చజెప్పి తీసికొని రావలసి రావటం మనకు ఎన్నికలలో కనబడుతూన్న ఆశ్చర్యకరమైన విషయం. బాగా చదువుకున్న వోటర్లు ఎక్కువగా ఉన్న న్యూఢిల్లీ దీనికి ప్రత్యక్ష తార్కాణం.

### సంకుచిత తత్వాలు

వీటికి తోడైనట్లు, స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత రాజకీయ కారణాలవల్ల కుల, వర్గ, ప్రాంత సంకుచిత భావాలు, విద్వేషాలు పెచ్చు పెరగటం కనుబడుతోంది. సెక్యులరిజమ్ పేరుతో జాతీయతలోని సాంస్కృతికమైన, భావాత్మకమైన ప్రాతిపదిక బుద్ధిపూర్వకంగా నాశనం చేయబడటంవల్ల ప్రజాస్వామ్యంలో ఇమిడిఉన్న ప్రాంత సంబంధమైన, వర్గసంబంధమైన ఒత్తిడి మరింత పరిస్థితిని విషమింపజేస్తోంది. ముస్లిము, అకాలీ, క్రైస్తవ మత తత్వాల విచ్ఛిన్నకరమైన కోర్కెలకు- ఎన్నికలలో వారి ఓట్లను ఆశించి, దాసోహమనే ప్రభుత్వ విధానం మతతత్వశక్తులకు జవసత్వాలను ప్రసాదించింది.


కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతికింది
-అట్లు చేసినట్టిది దాని అధిక నురగ
చిన్ని చేతులకు పెద్ద కృషి: అంత పెద్ద బట్టల దొంతరను, దుప్పట్లు, తువ్వాళ్లు—రాధ, సుధ, వాటన్నిటినీ ఇస్త్రీ చేయుచూ అమ్మకు సాయపడు చున్నారు.
ఎన్నో బట్టలు-అయినా అమ్మ వాటిని ఎంతో కొద్ది సబ్బుతోనే ఉతికింది. సహజంగా సన్ లైట్ తో. అది బాదకుండానే మురికినంతయు తొలగించివేస్తుంది! మీ బట్టలుతుక్కొనుటకు సన్ లైట్ సబ్బును వాడండి!
SUNLIGHT SOAP
సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను కాంతిగాను ఉతుకును.
S. 263-X52 TL
హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి

# ఇచ్ఛావర్తన

గిరిధరరావ్

## ముఖ్యమంత్రి డైరీ - (ఊహాచిత్రం)

శ్రీ నర్మదాశరణ్ మైత్రాగారు గత ఎన్నికలలో జనతాపార్టీ తరఫున పోటీచేసి ఒక స్వతంత్ర అభ్యర్థిమీద ఏడుఓట్ల తేడాతో గెలుపొంది, విదేహ ప్రాంత ముఖ్యమంత్రిగా ఉంటున్న సంగతి ఎల్లరెరిగినదే. ఆత్మ పరిశీలన కోసమూ, లోకోపకారం కోసమూ మహాత్ములు దినచర్య వ్రాస్తారనేది జగద్విదితం. రాజకీయాలలో ప్రవేశించి ఉత్తమ పదవులు పొందాలనే కుతూహలంగల సజ్జనులకు ఉపకరించగలదనే అభిప్రాయంతో వారు లిఖించిన దినచర్యలోని కొన్ని భాగాలను ఈ దిగువ పొందుపరుస్తున్నాను.

జనవరి 15 : 13 మంది మంత్రులతోనూ, 12 మంది ఉపమంత్రులతోనూ మంత్రివర్గాన్ని ఏర్పాటుచేశాను. వీరుగాక 10 మంది పార్లమెంటరీ కార్యదర్శులను నియమించాను. జనతాపార్టీ శాసనసభ్యులు అంతాకలిసి 175 మంది మాత్రమే వుండగా వారిలో 35 మందికి ఉద్యోగాలా ? అని ఒక పత్రికా విలేఖరి ప్రశ్నించాడు. మంత్రివర్గం సుస్థిరంగా వుండాలంటే ఎంతమంది అవసరమో అంతమందినే తీసుకున్నాను గాని ఎక్కువగా ఒక్కరిని గూడా మంత్రివర్గంలోకి తీసుకోలేదని స్పష్టం చేశాను.

ఫిబ్రవరి 1 : చిన్నతరగతుల్లో బడిపిల్లలకు ఎలాంటి ఆటలు ఆడిస్తారో స్టడీ చేసిరావడం కోసం మా విద్యాశాఖమంత్రి ఖాన్ అబ్దుల్ రహమాన్ సాహెబు గారు టర్కీదేశం వెళ్లారు. వారు ఆయురారోగ్యాలతో తిరిగి రావడంకోసం మసీదుకు వెళ్లి ప్రార్థనలుచేసి వచ్చాను.

మార్చి 31 : ఆర్థికశాఖామంత్రి శ్రీ అనిల్ కుమార్ సిన్హాగారు విదేహవిధానసభలో నూతన సంవత్సరానికి బడ్జెట్ ప్రతిపాదించారు. రాబోవు ఏడాదికి విధింపబడే క్రొత్తపన్నులు ఇవి : తీర్థయాత్రలకోసం గంగానదికివచ్చే యాత్రికుల చేత పితృదేవతలకు తద్దినాలు పెట్టించడంకోసం ప్రభుత్వమే సర్కారీపండాలను జీతాలిచ్చి నియోగించాలనీ, యాత్రికులు చెల్లించే దక్షిణలు ప్రభుత్వానికి చేరాలనీ నిర్ణయించబడింది. గవర్నమెంటు ఆసుపత్రుల్లో సర్కారీ దిబ్బెన ఒకటి ప్రతిష్ఠించి మందుకోసం వచ్చే ప్రతివాడూ ఆ దిబ్బెనలో తలాఒక అణా వేస్తే తప్ప మందుపోయరాదని నిర్ణయం చేయబడింది. ఊరూరా స్మశానాలదగ్గర ఫైల్మాన్లాంటి బంట్రోతుల్ని నిఖాపెట్టించి శవం ఒక్కింటికి రూపాయిచొప్పున వసూలు చేయాలనీ, ఇదేమీ కొత్తపన్ను అని ఎవరూ జడుసుకోకూడదనీ, హరిశ్చంద్రుని కాలంనుంచీ వస్తున్న ఆనవాయితీయేననీ స్పష్టంచేయబడింది. ఈ క్రొత్త విధానాలవల్ల ప్రభుత్వపు రాబడి 12 కోట్ల దాకా పెరగవచ్చునని మేం ఆశించాం.

ఏప్రిల్ 20 : అబ్దుల్ రహమాన్ సాహెబు గారు టర్కీనుంచి బయలుదేరి అటు మక్కా మదీనాలను సందర్శించుకొని ప్రస్తుతం కరాచీలో విమానం దిగాడట. భారతదేశానికి ఎపుడు వస్తాడో తెలీదు.

మే 1 : నేడు విదేహప్రాంత చరిత్రలో దివ్యమైనరోజు. రాష్ట్రంలోని కాఫీహోటళ్లను జాతీయం చేశాము. ఇందుమూలాన ఏటా 16 కోట్లరూపాయల అదనపురాబడి లభించగలదని అంచనావేశాం. కాఫీహోటళ్ళలో మేనేజర్లుగా 30 ఏళ్లకు మించని యువతులను మాత్రమే నియమించాలనీ, సర్వర్సుగా కనీసం స్కూలు ఫైనల్ ప్యాసైన లేదా తప్పిన స్త్రీలను, దొరకకపోతే పురుషులను నియమించవచ్చుననీ, పిండి రుబ్బటానికీ, అట్లు వేయడానికీ పురుషులను మాత్రమే నియమించాలనీ నిర్ణయించాము. ఇందుచేత హోటళ్ళలో అమ్మకం అధమపక్షం రెట్టింపు కాగలదని అభిజ్ఞులుఅనుకుంటున్నారు.

జూన్ 13 : పిడుగుపడ్డంతపని అయింది. రహమాన్ సాహెబుగారు భారతదేశానికి రాడుట ! పశ్చిమపాకీస్తాన్‌లో లాహోర్ యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌గా నెలకు 3000 జీతంమీద నియమింపబడ్డాడని డాన్ పత్రిక ప్రకటించింది. నాకు ఏమీ పాలు పోవడం లేదు. ఏమిటి చేయడం ?

జులై 16 : తపతీ నదికి వరదలు వచ్చాయి. జిల్లాలకు జిల్లాలే జలమయం అయిపోయాయి. ఇప్పటి కందిన వార్తలప్రకారం 1000 ఇళ్ళు నేలకూరుచుకుపోయాయి. ఒక్క బిలాసపూర్ జిల్లాలోనే 250 పశువులు హతమైనాయి. నీటిలో మునిగిపోయిన గ్రామాలలో పర్యటించాలని ఇవ్వాళ ప్రోగ్రాం ఏర్పాటు చేశాను. నేను రెడీగానే వున్నాను. ఏం లాభం ? ఫొటోగ్రాఫర్లు రాందే ? అంచేత ప్రోగ్రాం ఎల్లుండికి మార్చాను. ఆ నాటికి ఖాయంగా వస్తామని చెప్పారు.

జులై 20 : రహమాన్ సాహెబు గారు అసెంబ్లీ సభ్యత్వానికిగాని, మంత్రిపదవికిగాని రాజీనామా చేయలేదు. అయినా ఆయన తిరిగి ఇక్కడకు రాడని నిర్ధారణ అయింది గనుక దివంగతుడైనట్లు పరిగణించి, ఆయన నియోజకవర్గంలో రెండు మాసాలలోగా ఉప ఎన్నిక జరపవలసిందిగా ఎన్నికల కమీషనరు హుకుం జారీచేశాడు.

ఆగస్టు 2 : నేడు నా 62 వ జన్మదినం. మిత్రులు, బంధువులు, సహచరులు వచ్చి అభినందించారు. జన్మదిన సందర్భంలో రాజధానిలో జరిగిన బహిరంగసభలో ఉపన్యసిస్తూ "ప్రజలు కుటుంబ నియంత్రణాన్ని అలవరచుకొని గంటగంటకూ పెరుగుతున్న జనాభాను అరికట్టలేకపోతే దేశం విపత్కరపరిస్థితి నెదుర్కొంటుంది. ఉచితంగా జన్మ నిరోధక పరికరాలను ఇచ్చే కేంద్రాలను జిల్లాకొకటి వంతున నెలకొల్పుతాం" అని చెప్పాను. జన్మదినోత్సవంనాడు ఇంతకంటె ఇవ్వతగ్గ మంచి సలహా ఏముంటుందిగనుక !

ఆగస్టు 15 : అబ్దుల్ రహమాన్ గారి స్థానంలో మంత్రిగా ఒక మైనారిటీ సభ్యుణ్ణే నియమించాలిగాని మరొకణ్ణి నియమించరాదని జనతా పార్టీ హైకమాండు వారు ఒక హుకుం జారీ చేశారు. ఏడీ? ఉన్న ఒక్క మైనారిటీ సభ్యుడూ అలా కృష్ణార్పణమై పోయినాడు. ఇహ ఎవరున్నారు?

ఆగస్టు 20 : రాష్ట్ర వ్యాప్తంగా పోలీసులు సమ్మెచేశారు. వాళ్ళకు ఇప్పుడిచ్చే 70 రూపాయలూ చాలవట. 90 రూపాయలు కావాలట. ఏవీ రూపాయలు ఇవ్వటానికి? చిల్లపెంకులు గూడా లేవు. ఏమిటి ఉపాయం? రాష్ట్రంలో శాంతి భద్రతలను ఎలా కాపాడాలి?

ఆగస్టు 26 : నిక్కర్లూ బనీన్లూ తొడిగించి ఆడపోలీసుల్ని నాలుగు రోడ్ల సెంటర్లలో కాపలా పెట్టాం. కొత్తవాళ్ళను రిక్రూట్ చేసుకుంటున్నాం. జనంలో హుషారు ఎక్కువయింది. తండాలు తండాలుగా వచ్చి రోడ్ల ప్రక్కన నుంచుంటున్నారు... కాని "కొన్ని చోట్లలో సమ్మె చేస్తున్న మగపోలీసులు వచ్చి ఆడపోలీసుల్ని ఎత్తుకెళుతున్న మాట నిజమేనా? వాళ్ల ప్రాణాలకు ప్రభుత్వం పూచీపడుతుందా" అని ప్రతిపక్ష సభ్యుడు శాసనసభలో ప్రశ్నించాడు.

"ఎత్తుకెళ్లినా తెల్లవారేసరికి వదిలేస్తారనే నమ్ముతున్నాను" అని జవాబిచ్చాను! అంతకంటె నాకుమటుకు ఏం తెలుసూ?

సెప్టెంబరు 1 : మంత్రిపదవిలోకిఎలాగైనా రావాలనే కుతూహలంగల శ్యామసుందరదూబే అనే శాసన సభ్యుడు ఇవ్వాళ మహమ్మదీయ మతం పుచ్చుకొని మస్తాన్‌షరీఫ్ అనే పేరు పెట్టుకున్నట్లు తెలుస్తోంది.

సెప్టెంబరు 5 : మీర్జాపూర్‌లో మినర్వా టాకీస్ నిర్మాణానికి ప్రభుత్వం వడ్డీ లేకుండా 20 ఏళ్ళలో తీర్చబడే షరతు మీద 10 లక్షల రూపాయల అప్పు మంజూరు చేసింది. పరిశ్రమలకు ఆమాత్రం చేయూతనివ్వకపోతే ఎలాగ?

సెప్టెంబరు 10 : జనతా పార్టీ హైకమాండు వారి తాఖీదు ప్రకారం మస్తాన్ షరీఫ్‌గారిని ఇవ్వాళనే విద్యాశాఖా మంత్రిగా నియమించాను!

సెప్టెంబరు 15 : "పరిశ్రమ అంటే నిర్వచనం ఏమిటి? సినిమా హాలుగూడా పరిశ్రమ కిందికి వస్తుందా? మీర్జాపూర్ మినర్వా టాకీస్ నిర్మాత ముఖ్యమంత్రిగారి మేనత్త మరిది కొడుకు అన్నమాట నిజమేనా?" అని "వివేక్" అనే దినపత్రిక సంపాదకీయం వ్రాసింది .. ఎంత పొగరు! ఎంతధైర్యం! ఆ పత్రికకు న్యూస్‌ప్రింటు కోటా రద్దుచేయమనీ, ప్రభుత్వ అడ్వర్టయిజ్‌మెంట్లు ఏవీ ఇవ్వరాదనీ ఇపుడే తాఖీదులు పంపాను.

అక్టోబరు 1 : లక్ష్మీదేవి వలెనే ఈ పదవులు గూడా చంచలమైనవిగా కనిపిస్తూవున్నాయి. ఏదీ శాశ్వతంగా కనిపించడంలేదు. కొందరు కుట్రకోరు శాసనసభ్యులు నామీద అవిశ్వాస తీర్మానం తీసుకొస్తారట! విశ్వాస హీనులు!! అ దేదో తేలేలోగా శ్రీమతీ సమేతంగా ఏదైనా ఒక్క విదేశానికి సాంస్కృతిక రాయబార వర్గాన్ని లేవదీద్దామని చూస్తున్నాను. ఎటుపోయి ఎటొస్తుందో! వెళితే అమెరికా అయితే శ్రేష్టం. తప్పితే ఆస్ట్రేలియా అయినా ఫరవాలేదు! *

# ★ జీవన ఖేలన ★

## "అమరేంద్ర"

హృదయాలని తరుశాఖ చిగురాకులుగా ఊగించే ఉదయసమీరం. మేలుకొన్న విహంగాల కలకలరావం. సంబరంతో అంబరందాకా పరిగెత్తే అంబోధి తరంగాల తురంగయానం. ప్రమోదంతో పూపొదలలో రేగిన కోదమ తుమ్మెదల రొదలు. దిగంచలందాకా అరుణ బింబాన్ని బంతిలాగా తరుముకుంటూ వచ్చి లోకం మీదికి తన్నివేసి గిరుక్కున వెనక్కి తిరిగి మటుమాయమైపోయాడు ఖేలనాసక్తుడైన కాలకిశోరుడు.

"అమ్మా! ఆడుకుంటానే. బంతి; నా బంతి!" అంటూ గంతులు వేస్తూ గదిలోంచి బైటికి వచ్చాడు కిశోర్.

"అస్తమానమూ ఆటలేనా?" అని మందలింపుగా తల్లికంఠం.

ఏడుగుఱ్ఱాల రథం వంగిన గగన పథంలో గబగబా సాగిపోతోంది.

"అమ్మా! నా లెక్కల పుస్తకం కనిపించలేదే. ఈసారి అందరినీ మించిపోవాలి." అంటూ పుస్తకాలన్నీ చిందరవందరగా వెతుకుతున్నాడు కిశోర్.

"రాత్రిపూట లెక్కలు చేస్తే కళ్లు బోర్లపడతయ్. పడుకో!" అంది బతిమాలుతూ అమ్మ కంఠం.

కోవెల తోటలో పచ్చగన్నేరు పూలతో రంగుల సింగారాల సీతాకోకచిలుకల సరాగాలు.

"నువ్వు వెయ్యి చెప్పు; లక్ష చెప్పు. నేను ఆ అమ్మాయిని తప్ప వేరొకరిని పెళ్లాడటానికి ఒప్పుకోను."

"ఇదేం పిచ్చిరా నీకు? వాళ్ళెక్కడా, మనమెక్కడా?" అంది అమ్మ.

"నీల సరోవరంలో కలువ నీలాకాశంలో జాబిల్లికోసం కలవరించటంలేదా? పంకంలో కన్నువిప్పిన పద్మిని దివ్యప్రభాకర పరిరంభంలో మురిసిపోవటం లేదా? ఆమె నా జీవన సుమవనంలో నిత్యవసంత విలాసం, నా హృదయాకాశంలో రెల్లుపూల వెన్నెలకురిసే శారద శుభకరహాసం!"

"నీకలలు నేలకూలక తప్పవురా. మనసు మరల్చుకో. నామాట విను." అంటూ అమ్మ.

"విరిగి కూలటమే ఫలమని తెలిసినా తీరం దిక్కుకే కదిలిపోయే తరంగాన్ని నేను. రెక్కలు కాలి భస్మమైపోక తప్పదని తెలిసినా ప్రజ్వల దీపశిఖపై దూకి నవ్వుతూ ప్రాణం విడిచే పతంగాన్ని నేను. భగ్నహృదయంతో రోదసీకుహరాలు మారుమ్రోగే రుద్రవీణని నిర్నిద్రంగా పలికిస్తాను!"

"నీయిష్టం; చెబితే వినవు." అంది అమ్మ నిస్పృహ.

యోగసమాధిలో వున్న సిద్ధుడి మనస్సులాగా ఆకాశపులోతుల్లో రెక్కలు కదలకుండా రిక్కలదాకా ఎగసిన ఖగరాజు.

"అమ్మా! ఈ దండ నీ పాదాల దగ్గర పూజాప్రసూనంగా నివేదిస్తాను. నీవల్లనే నేను ఇంతవాణ్ని అయాను." అంటూ కిశోర్ తల్లి పాదాలు తాకాడు.

"ఇవి జారుడు మెట్లురా బాబూ, జాగర్త! శిఖరంమీద వున్నంతవరకే అందరిచూపులూ నీమీద. అక్కడినుంచి పడిన మరుక్షణం నువ్వు ధూళిలో రాలిన పువ్వు; మబ్బులో కలిసిన మెరుపు."

"నన్నెవ్వరూ ఇక్కడనుంచి కదిలించలేరమ్మా! ఈ పూలదండ నా అనుచరుల అండ!"

ముసురుకునే సంజమబ్బులు. ఒరుసుకుంటూ ఎగిరే కొంగల బారులు. గోపురంమీద మిణుకుమనే ఒంటరి ప్రమిద. ఆకాశం కొత్త సృష్టికోసం రాజేసిన కమ్మరి కొలిమిలాగా వెలిగిపోతోంది.

గది గోడమీద క్రీనీడల్లో పురుగులని వేటాడుతున్న బల్లి.

"అమ్మా!" చివరి పిలుపులో నిశ్శబ్దం నిలువునా వణికింది. కొడుకు ఆడి విడిచిన బొమ్మలకేసి చూస్తోంది అమ్మ.

మూతవేసిన ఆటవస్తువుల పెట్టెలాగావుంది భూమ్యాకాశాల మధ్యనున్న లోకం.

"ఇన్నాళ్లూ ఆటలాడుకున్నావు. ఇప్పుడు నువ్వే ఒక ఆటబొమ్మవై పోయావా తండ్రీ?" అంటున్నయ్ అమ్మ కన్నీళ్ళు.

చీకట్లో కీచురాళ్ళు నృత్యంచేసే మృత్యువు పాదాల ఇనపగజ్జెల్లాగా ఘల్లుమన్నయ్. *



ప్రథమ బహుమతి పొందిన
శ్రీ మధురాంతకం రాజారాం

ప్రథమ బహుమానము పొందిన కథ

# ★ వ్యస్తాక్షరి ★

శ్రీ మధురాంతకం రాజారాం

దాదాపు నెలరోజులనుంచీ వాయిదా వేసుకుంటున్న ప్రయాణం. ఇక మరి, ఆలస్యం చేస్తే బాగుండదు. ఈ నిర్ణయానికి రాగానే బయల్దేరి వుంటే బస్సు తప్పి వుండేదిగాదు. ఉద్దేశానికి ముస్తాబు చేసి పీటపైన కూచోబెట్టడంలో ఆలశ్యం జరగనేగూడదు. జరిగితే యిదిగో, యిలాగే ముహూర్తం దాటిపోతుంది.

వెళ్తున్నది పల్లెటూరుగనుక టార్చిలైటు తీసుకెళ్ళమన్నారు నాన్నగారు. తీరా ఆ కరదీపికను చేతికి తీసుకునేసరికి అందులో 'అవి' లేవు. సెల్సుకోసం తమ్ముడు బజారుకు వెళ్లొచ్చాడు. చెప్పులు తొడుక్కుని నాలు గడుగులు ముందుకు వేశానో లేదో, అందాకా గాఢనిద్రలో వుండిపోయిన నా దూరదృష్టి తటాలున మేలుకున్నట్లయింది! ఒకవేళ ఏ కారణంచేతనైనా రేపు వుదయం ఆఫీసు వేళకు తిరిగి రాలేకపోతే? మళ్ళీ గదిలోకి వెళ్ళి అదరా బాదరా సెలవుచీటీ వ్రాసి ముగించాను. వెళ్ళొస్తానని అమ్మతో చెప్పి చరచరా మెట్లు దిగాను.

బహుశా పదిబారలదూరం నడిచివుంటాను.

"ఇదిగో రాజా! వెళ్లువుగానీ యిలా వచ్చిపో." ద్వారందగ్గర నిల్చుని నన్ను సాగనంపుతున్న అమ్మ వెనక్కు పిలిచింది.

ఆ పిలుపులోని అంతరార్థమేమిటో నాకు తెలుసు. అమ్మ కళ్ళకేదో అపశకునం కనిపించి వుంటుంది!

ఆ పదిబారల దూరంలో నా కెదురుగా వచ్చి నన్ను దాటుకుని ముందుకు వెళ్ళిపోతున్న వ్యక్తిని చూస్తూ యింట్లో ప్రవేశించాను.

"కూచోరా బాబూ, కూచో! ఆ మనిషి ఎదురుగా రావడమంటే ఏమిటనుకున్నావో! ఈ వేళ నువ్వు వెళ్ళకపోయినా బాగుండును." అంటూ అమ్మ మంచినీళ్ళగ్లాసును నా చేతి కందించింది.

"ఏమిటమ్మా నీ చాదస్తం! ఆవిడ నుదుట బొట్టుంది. కాలివ్రేళ్ళకు మెట్టెలున్నాయి. ఇవి రెండూ వున్నాయి గనుక మెడలో మంగళసూత్రంగూడా వుండనేవుంటుంది. మరి, ఆ ముత్తయిదువు ఎదురుగా వచ్చినా అపశకునమేనా?" అంటూ విస్తుపోయాను.

"ఆ లక్షణాలన్నీ సరిగ్గానేవున్నాయిరా బాబూ! కానీ ఆవిడ కాపురం చేస్తున్నది మాత్రం మొగుడితోగాదు. నాకూ మొన్న మొన్ననే తెలిసింది. స్వంతవూరు కొత్తపేట. మొగుడున్నాడు. ముత్యాల్లాంటి బిడ్డలున్నారు. ఇంట్లో తను, తనభర్త, బిడ్డలు తప్పితే మరెవ్వరూ లేరు. ఉంటే అత్తమామల పోరు, ఆడుపడుచుల ఆరడి అని చెప్పడానికైనా వీలుండేది. బంగారంలాంటి కాపురాన్ని వదిలిపెట్టి వచ్చేసిందంటే ఏమనాలి? ఇది ఆడదై వుండదు. ఆడదాని రూపంలో వున్న మరేదైనా అయి వుంటుంది.."

ప్రసంగం అప్పటికప్పుడే ఆఖరయ్యే సూచనలు లేవు. పైగా యిదేమంత విని తెలుసుకోవలసిన విషయం గాదు. మధ్యలోనే లేచి మళ్లీ వీధిలోకి వచ్చాను. శరవేగంతో బస్టాండు వైపు నడిచాను. కానీ ఏం లాభం? అప్పటికే బస్సు వెళ్ళిపోయింది.

సాయంత్రం అయిదుగంటల తర్వాత రామాపురానికి బస్సులు లేవు.

దిక్కులు దోచక బస్టాండు బూడిద దుమ్ములో చింతచెట్టుక్రింద నిల్చున్నాను. శేఖరం ప్రతిరోజూ నాకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తుంటాడు. ఈ ప్రాయంలో శేఖరానికిది రాదగిన కష్టంగాదు. "నాజ్యోతి ఆరిపోయింది రాజా! నా బ్రతుకే చీకటి గుయ్యారమై పోయింది." అని వాపోతూ "వీలైతే ఒకసారి యిక్కడికి వచ్చిపోవూ?" అంటూ జాబు వ్రాశాడు. ఈ పరిస్థితిలో శేఖరానికి స్నేహితులనుంచీ లభ్యంగావలసింది కాస్త వూరడింపుమాత్రమే! అతడి జీవితానికి తగిలిన ఆఘాతమెలాటిదో తెలిసి తెలిసీ, ఒకసారివచ్చి వెళ్ళమని జాబు వ్రాసిన తర్వాతగూడా జరగకూడనంత ఆలస్యం జరిగిపోయింది. ఇంక తామసించడానికి వీల్లేదు. బస్సు తప్పినాసరే, చీకటిపడినాసరే; ఈ రోజు నేను రామాపురం వెళ్లకతప్పదు.

ఆమాటకొస్తే ఈరోజుల్లో ప్రయాణ సౌకర్యాలు రైళ్లూ, బస్సులవరకే పరిమితంగావు. పట్టణం అవర్ సైకిళ్ళకు గొడ్డుపోలేదు.

అవసరాన్ని బట్టి ఓ పావలాడబ్బులు అదనంగా చెల్లించడానికి సమ్మతించగానే సైకిలు దొరికింది. వాతావరణం ప్రశాంతంగావుంది. ఆకాశాన మబ్బులు నడయాడుతున్నాయి. సంధ్యాదేవి ప్రపంచానికి పసిడిగొడుగు పట్టుతున్న ఈ చల్లటి వేళలో పాతికేళ్ల యువకుడికి పదిహేనుమైళ్ళ సైకిలు ప్రయాణం ఓ కష్టమైనపనిగా లెక్కగట్టవలసిందిగాదు.

సైకిల్ను తెచ్చి రోడ్డుపైన నిలబెట్టాను. చేతిసంచిని హాండిల్‌బారుకు తగిలించాను. జవనాశ్వానికి వీపుదట్టి హుషారిచ్చినట్టు సీటునొక్కసారి దులిపివేసి ఎక్కికూచున్నాను.

పురపాలకసంఘంవారి సరిహద్దుదాకానున్నగావున్న తారురోడ్డుపైన బండమీద జలధాగలా సైకిలు ఒళ్ళు తెలియకుండా జారిపోయింది.

ఆ తరువాత ఎగుడుదిగుళ్ళతో నిండివున్న గుల్లరోడ్డుతో సైకిలూ, సైకిలుతోబాటు నేనూ కాస్త ఘర్షణ పడవలసివచ్చింది. ఐనా పరవాలేదు. బయల్దేరి యింకా పదిహేనునిమిషాలు కాలేదు. అప్పుడే మూడుమైళ్ళదాటేశాను. అయిదో మైలురాతికి అల్లంతదూరంలోవున్న మట్టిబాటలోకి మలుపు తిరిగితే ఆపైన రామాపురానికి తొమ్మిదిమైళ్ళు మాత్రమే!

ఏడెనిమిది నిమిషాలు గడిచాయి. సైకిల్ని మట్టి బాటపైకి పట్టిస్తున్నాను. ముత్తెంలాంటి చినుకొక్కటి ముకుపుటాన వ్రాలింది. తల పైకెత్తాను. నుదుట నాలుగైదు చినుకులు రాలాయి.

ఆబాట తూర్పుదిక్కుగా వెళ్తోంది. బాటకు దక్షిణంగా వ్యాపించివున్న కొండపైన కారు మబ్బులు క్రమ్ముకున్నాయి. కొండ కొమ్ము పైన అప్పటికే వర్షం ప్రారంభమైపోయింది.

నాలుగైదు ఫర్లాంగులవరకూ అలా తుంపరలో తడుస్తూ నేనూ సైకిలూ ముందుకు సాగిపోయాము. రంగ సముద్రం చెరువుకట్టపైన వెడుతుండగా వర్షం విజృంభించింది. కొండపైన నిశ్చలంగా నిలిచివుండిన టేకూ, చందనం చెట్లు యిప్పుడు సుడిగాలిలో తలలు విరబోసుకున్న దయ్యాల్లా వూగిపోతున్నాయి.

ఒక్కనిమిషంలో తడిసి ముద్దయిపోయాను.

మరునిమిషాన ఆశ్రయంకోసం చుట్టూరా కలయ పరికించాను.

ఒకవైపున కొండలు, మరొకవైపున చిన్న చిన్న ముళ్ళపొదలతో పెనుబీడు. మధ్యగా దాపున చెట్లుగూడా లేక బోసిగా వెళ్ళిపోతున్న బాట!

ఐతే ఈ రోజు మింటికీ మంటికీ ఏకంగా వ్యాపించి వాయుదేవుడితో చేతులుకలిపి కుండపోతగా విరుచుకపడిపోతున్న జడివానంతా నాపాలే నన్నమాట!

నిస్సహాయతకు రూపకల్పనమల్లే ఆప్రకృతి బీభత్సం నడుమ, రంగసముద్రం చెరువు మరవకు నూరు గజాల దూరంలో సైకిలు ప్రక్కన నిల్చుండి పోయాను.

ఒకసారి నా వైపు చూసుకున్నాను. ఎఱ్ఱటి బురదలో చందన మలదుకుని పైకి లేచినట్టున్న సైకిలు వైపు చూచాను. వినీల మేఘాల్నీ, కుంభవర్షాన్నీ చూచాను. కడకు కింకర్తవ్యతా విమూఢుడినై అలాగే విగ్రహంలా నిల్చిపోయాను.

పాడుసైకిలు! దీనితో పెద్ద బెడదే వచ్చింది. ఇది లేకుంటే కాలు మళ్ళినట్లల్లా పరుగెత్తి ఏదైనా ఆశ్రయాన్ని చేరుకోగలనేమో!

నా ఆలోచనకు నేనే నవ్వుకున్నాను. సైకిలేగనుక దొరక్కపోయివుంటే అసలీ ప్రయాణమే జరిగివుండేదిగాదు. ఆలోచన మరి కొంత వెనక్కువెళ్ళింది. అమ్మమాటకు కాస్త విలువ యిచ్చివుంటే ?-

ఆ క్షణాన మేఘాల్లో ఓ మెరపు మెరిసింది. ఆ వెలుగులో వాన తెరలకు వెనుక దాగొన్న కొండలూ, కోనలూ, చెట్లూ, చేమలూ అన్నీ స్పష్టంగా కనిపించాయి. ముఖ్యంగా పది పదిహేను బారల దూరంలో బాటక్రిందలి తూముకుపైగా, బాటకు ఈవల, ఆవల కట్టివున్న రాతి దిన్నెలు దృగ్గోచరమయ్యాయి.

ప్రాణం లేచివచ్చినట్టయింది. గబగబా సైకిల్ని అక్కడికి తోసుకెళ్ళాను. అదృష్టవశాత్తు తూముపైకప్పు మరీ అంత తగ్గులో లేదు. హాయిగా కూచోవచ్చు. లేదా, వంగి నిల్చోవచ్చు. సైకిల్నిలోపలికి త్రోశాను. దానివెంబడే నేనూ లోపల ప్రవేశించాను.

ఇంతగా వాన కురుస్తున్నా ఆతూము యినప్పెట్టె లోపలిభాగంలా వెచ్చగా వుంది. కానీ ఒక్కటే చిక్కు. ఎటుగన్నా చిమ్మచీకటే! కొంపదీసి ఈ రాళ్ళసంగుల్లో ఎక్కడైనా ఏ తేలో, పామో- గుండె గుభేలుమంది! చరాలున చేతి సంచిలోనుంచీ టార్చిలైటు తీసి మీట నొక్కాను.

తూము తూమంతా కాంతిమంతమై పోయింది.

కానీ... కానీ... అది... అదేమిటి ?

అదొక మానవాకారం. మాసిన వసనాలు, గుబురుగా పెరిగిన గడ్డం, సంస్కారానికి నోచుకోని క్రాపింగు...

“ఎవరక్కడ ?” అంటూ ఓ గావుకేక పెట్టాను.

పడుకున్న మనిషిలో చలనం లేదు.

దగ్గరికి వెళ్ళాను. కదిలించి చూచాను. శరీరం మంచుగడ్డలా బిగుసుకుపోయివుంది. రొమ్ముపైన చేయివేశాను. గుండె ఆడడంలేదు.

ఎవడోగానీ, విగతజీవి.

అయ్యో పాపం! దిక్కులేని చావు.

ఆ సానుభూతి ఒక్కక్షణం మాత్రమే! మరుక్షణంలో నేను నఖశిఖ పర్యంతమూ వడకిపోయాను. మునిమాపు సమయాన, నిర్జన ప్రదేశంలో శవానికి చేరువగా నిల్చొని నిమిషాలు దొర్లించగల గుండె నిబ్బరం నాకు లేదు. ఇంతకంటే తెగించి, వానలో పరుగు లంకించుకోడమే మేలు! కానీ ఈ సైకిలు ?

హతాశుడనై పోయాను. ఆ పరిస్థితిలో జారిపోయిన గుండె దిటవును కూడదీసుకోడంకన్నా నాకు గత్యంతరం తోచలేదు.

మనుగడకూ మరణానికీ వున్న దూరమేపాటిది ? రెప్పపాటు కాలంలో మనుగడ మరణంగా పరిణమించే అవకాశాలున్నాయి. ఈ సహజపరిణామం మానవుడి కెందుకు భీతావహం కావాలి ? ఎండిన మోడును చూచి మనం భయపడ్డంలేదే! చచ్చిన కాకుల్నీ గద్దల్నీ చూచి మనం భీతిల్లడం లేదే! జీవంతోవున్న మనిషి ఆ జీవాన్ని గోల్పోయిన మనిషిని చూచి భయపడ్డంలో ఆంతర్యమేదయినప్పటికీ, అది పట్టి తెచ్చికోలు పిరికితనమే గాని మరొకటిగాదు. ఇక్కడ భయపడవలసిన అవసరం లేదు! అందుచేత నేను భయపడ్డంకూడా లేదు! వాన కురిసినంతసేపూ యిక్కడే నిల్చుంటాను. వెలసిపోగానే నాపాటుకు నేను వెళ్ళిపోతాను.

విసురుగా వీస్తున్న సుడిగాలి తాకిడికి వర్షం తూములోపలికి జల్లులు జల్లులుగా వచ్చి పడుతోంది. ఓ జల్లు మరీ విసురుగావచ్చి ముఖాన్ని ముంచి లేవనెత్తింది. కాస్త ప్రక్కకు తొలగితే జల్లులనుంచీ తప్పుకోవచ్చు. కానీ అప్పుడు నేను శవానికి మరింత చేరువైపోతాను. ఐతే నేమని నన్ను నేనే ప్రశించుకున్నాను... పైగా ఎంతగా నిగ్రహించుకోబోయినా చూపులు మాటిమాటికీ అటువైపు ప్రసరించడానికే ప్రయత్నిస్తున్నాయి. ఇదంతా భయంగాకపోతే మరేమిటి ? పెద్దగా తాత్విక చర్చలోకి దిగి భయమంటే తెచ్చికోలు పిరికితనమనుకున్నాను. కాదు కాదు; ఇది మానవుడికి సహజాతమైన గుణంలావుంది!

ఇలా కాదు! ‘పులి’ అన్న భ్రమ ‘గిలి’లో నుంచీ ఉద్భవిస్తున్నది. గిలిని సమూలంగా తుంచిపెట్టగలిగినట్టయితే పులి కేవలం మిథ్య. మట్టిలో కలసి మట్టైపోనున్న ఈ కట్టెను గురించిన ఊహాపోహాలతో భయపడుతూ కూచోడంకన్నా దీన్నొకసారి ఆపాదమస్తకమూ పరిశీలించి చూడ్డం మేలు! నిండా మునిగిన తర్వాత చలి వుండబోదు!

అలా చూస్తున్నప్పుడే ఆ దురదృష్టవంతుడి ఆత్మకథ నా కళ్ళ పడటం జరిగింది.

సమయాని కతనిదగ్గర కాగితాలూ, కలమూ లేకపోయాయేమో! ఎవరో బిచ్చగాళ్ళు వంట చేసుకుని వెళ్ళిపోగా పోయిలోనుంచీ చెల్లాచెదరై ఎక్కడబడితే అక్కడ కాళ్ళకు తగులు

తున్న బొగ్గులు అతనికి రచనోపకరణాలుగా పనికివచ్చాయి. వాటితో అతడు తూము గోడలపైన తన ఆత్మకథను ఉల్లేఖించేశాడు.

ఆ వ్రాతలో నిలకడలేదు. ఒకే వాక్యంలో తాటికాయలంతేసి అక్షరాలతోబాటు పరిమాణంలో జోరీగల్లాంటి అక్షరాలుగూడా వున్నాయి. అది యితరుల కర్థం కావాలన్న వుద్దేశంతో వ్రాసిన గాథ కాదు. మనసువిడిచి పరులకు చెప్పుకోడానికి వీల్లేక, అలాగని నూరుదులతో పొడుస్తూ సుళ్లు తిరుగుతున్న ఉద్విగ్నతనూ, ఆరాటాన్నీ ఎదలో 'దాచుకోడమూ సాధ్యంకాక అగ్నిపర్వతాన్ని చీల్చుకుని వెలువడిన లావాద్రవంలా ఆ గాథ వెలికుబికి వుంటుంది. లేకుంటే ప్రత్యక్షరమూ వికృతమై, ప్రతి గీతా వకర్లు తిరిగి ఆ రచన రచనంతా పరిస్థితుల ప్రాతికూల్యంవల్ల చివికిపోయి, మర్మాఘాతాలవల్ల ముగ్గిపోయిన ఒకానొక నిర్భాగ్యుడి దుర్భర జీవితంలా ఎందుకు కనిపిస్తుంది!

చూపులు గీతలవెంట పరుగులీశాయి.

"ఆత్మహత్య మహాపాపమంటారు. నిజమేగావచ్చు. కానీ నమ్మి నిల్చున్న భూమి కాళ్ళక్రింద కరిగిపోగా, బోర్లగిల పడకుండా నిలద్రొక్కుకోడం ఎవరితరం?

అగ్నిసాక్షిగా పెళ్ళాడాను. ప్రాణాధికంగా ప్రేమించాను. గృహరాజ్యంలో ఆవిడ పెత్తనం నిరాటంకంగా కొనసాగడానికని తల్లిదండ్రులను గూడా విడనాడాను. బంధువుల్ని తృణీకరించాను. కానీ యింత చేసీ ఫలితమేమిటి? నా బ్రతుకును తిలవంపులకూ, నగుబాట్లకు, అవహేళలకు అర్పంచేసి ఆవిడ వెళ్ళిపోయింది. కన్నబిడ్డలను గూడా నా పాలిట దోసి కొత్తపేటలో లేని సౌఖ్యాల కోసం, కొత్తపేటలో లేని విలాస వినోదాల కోసం లేచి వెళ్ళిపోయింది.

ఎలా తలఎత్తుక తిరగమంటారు నన్ను?

ఎలా బ్రతికమంటారు నన్ను?

బడబాగ్నిని భరించడానికి నేను సముద్రుణ్ణిగాను.

హాలాహలాన్ని భరించడానికి శివుణ్ణిగాను.

బ్రతికినంతకాలమూ ఈ దుస్సహమైన వేదనతో కృంగి కృశించి కుళ్ళిపొమ్మంటారా నన్ను?

వద్దు బాబూ వద్దు.

నేనీ నిర్ణయానికి వచ్చి ఆరుమాసాలైంది.

ఈ ఆరు మాసాలుగా నేను జీవచ్ఛవంలా బ్రతికాను. ఎందుకు బ్రతికాను? నా బిడ్డల కోసం.

వాళ్ళని గాలికీ, ధూళికీ, విడచిపెట్టలేను. వాళ్లకొక దిక్కు చూపించకుండా కళ్ళుమూసుకోలేను.

నా తల్లిదండ్రులు చనిపోయారు. బంధువులు దరి జేరనీయరు. ఆఖరుకు నా చెల్లెల్ని బ్రతిమాలుకున్నాను. ఆమె కల్యాణి. సమష్టి కాపురంలో సాటివారిలో గౌరవంగా బ్రతుకుతోంది.

వారగా పిలిచి "చెల్లీ! నేను పిచ్చివాడనైపోతున్నాను, నా బిడ్డలకు నువ్వే దిక్కు." అన్నాను.

కల్యాణి కంటనీరు పెట్టుకుంది. "వద్దన్నయ్యా! నీ బిడ్డలను తీసుకొస్తే పేచీలొస్తాయి. నేను అత్తమామలక్రింద, బావగార్ల క్రింద, తోడికోడళ్ళక్రింద బ్రతుకుతున్నాను. వాళ్ళు బిడ్డల్ని హీనంగా చూస్తారు. నా గుండె

## కథానికల పోటీని గూర్చి రెండు మాటలు

ప్రతిఏడూ జరుగుతున్న జాగృతి కథానికల పోటీలు శిల్పమూ, ప్రయోజనం ఉన్న ఉత్తమ కథా సాహిత్యసృష్టికి దోహదం చేయగలవనే విశ్వాసాన్ని బలపరుస్తున్నాయి. క్రిందటి పోటీలలోకన్న ఈ పోటీలో కథాప్రయోజనానికికూడా తగిన ప్రాముఖ్యతనిచ్చే అవకాశం లభించింది. అయితే ప్రయోజన ప్రాముఖ్యతకూడా ఉన్న కథా సాహిత్యసృష్టికి ఇంకా ఎక్కువ కృషి జరుగవలసిఉందనే అభిప్రాయం, అలా జరుగగలదనే ఆశకూడా ఈ సమయంలో కలుగుతోంది. ముందుముందు కథలోని ప్రయోజనాంశం లేదా ఆశయానికి ఇంకా ఎక్కువ ప్రాముఖ్యత నివ్వాలని సంకల్పం. కథాశిల్పనిపుణులైన రచయితలందరూ సహకరిస్తే ఆ సంకల్పం సిద్ధించడం ఒక కష్టమైన విషయంకాదు. రచయితలందరూ రానున్న సంవత్సరంలో జాగృతిద్వారాను, ఇతరత్రా కూడా ఇలాంటి కృషిజరిపి, రానున్న పోటీలను మరింత సార్థకం చేయవలసిందిగా కోరుతున్నాం.

పోటీలో శ్రీ మధురాంతకం రాజారాం, శ్రీ క. శోభ, శ్రీ అవసరాల రామకృష్ణరావు, శ్రీ సిద్ధాంతి మల్లిఖార్జునం గారలు క్రమంగా ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ బహుమానాల నందారు. వీరందరికీ అభినందనలు. మిగిలిన కథలలోకూడా చక్కని కథలనేకం ఉన్నాయి. ఈఏడు వచ్చిన కథలలో చక్కని వైవిధ్యం ఉందని న్యాయనిర్ణేతల ఏకగ్రీవాభిప్రాయం. వాటిని క్రమంగా జాగృతిలో ప్రచురించే అవకాశం ఉన్నది. ఆ ప్రకారం ప్రచురించదలిచాం. అలా ప్రచురింపబడే కథలకు యథాశక్తి పారితోషికమీయ సంకల్పించాంకూడా. సాధారణసంచికలలోకూడా ప్రచురించుటకు సాధ్యంకాని కథలలో తపాలా బిళ్ళలతో వచ్చినవాటిని రచయితలకు క్రమంగా త్రిప్పిపంపుతాం. (ఈ సందర్భంలో వేరే ఉత్తరప్రత్యుత్తరాల అవసరం ఉండదు.) ఆ కథకులందరూ ముందు ముందు మరింత ఎక్కువ ప్రయత్నంచేసి రానున్న పోటీలలో బహుమతులందగలరని ఆశిస్తున్నాం.

పోటీ నిర్వహణలో అనేకులనేకవిధాల సహకరించారు. శ్రీ అమరేంద్ర, శ్రీ వి. వి. నరసింహమూర్తి, శ్రీ మన్నవ గిరిధరరావు గారలు న్యాయనిర్ణయంలో సహకరించారు. ఆంధ్రదినపత్రిక, ఆంధ్రజనత, గోల్కొండ పత్రిక, శారద, సాధన, నవజ్యోతి- ఇత్యాది పత్రికల సంపాదకులు ఈపోటీని గూర్చి తమ పాఠకులదృష్టికి తేవడంలో ఎంతో సహకరించారు. వారందరి సహకారం లేని పక్షంలో బహుశా ఇన్ని కథలు రావడం కూడా కష్టమేమో! వీరు కాక ఇంకా ఎందరో అభిమానులు, పాఠకులు, కథకులు కూడా సహకరించారు. వారందరికీ ధన్యవాదాలు. రానున్న పోటీలలో కూడా అందరు ఇలాగే ఇంతకన్న కూడా ఎక్కువగా తోడ్పడి ఉత్తమ కథాసాహిత్యంకోసం మేము సంకల్పించిన ఈ చిన్న కృషిలో సహకరించ ప్రార్థన— సం.

తరుక్కుపోతుంది. ఏంచేయునన్నయ్యా! నే నాడ దాన్ని! నావల్ల నేమౌతుంది?" అంటూ వాపోయింది.

నే నేంచేయను? నా బిడ్డలకెవరౌతారు?

ఈ ప్రశ్నకు సమాధానం లేకనే నేను ఆరు మాసాలు బ్రతికాను.

ఆ సమాధానం తనంత టదే నన్ను వెదుక్కుంటూ వచ్చింది.

మంచివాళ్ళు ఈ ప్రపంచంలో ఎంతో కాలం బ్రతకరంటారు.

ఆమాట కల్యాణిపట్ల సార్థకమైంది.

కల్యాణి నూరేళ్ళజీవితం పాతికేళ్లతో నే ముగిసింది.

చనిపోతూ చనిపోతూ ఆమె భర్తను కోరింది ఒక్కటే కోరిక.

"ఏమండీ! అన్నయ్య మనసు చెడిపోయింది. ఆ పాడుబడిన కొంపలో బిడ్డలు దిగులుపడి పోతున్నారు. నాకెలాగూ బిడ్డలు లేక పోయారు. బాబునూ, భారతినీ తెచ్చి పెంచుకోరూ?"

బ్రతుకుతున్న వాళ్ళు నాబ్రతుకుపైన చంద్ర నిప్పులు వర్షించగా, పోతూ పోతూ కల్యాణి నాకీ మేలు చేసిపోయింది.

ఆమె నా తలపైని భారాన్ని దించింది. నాకు స్వేచ్ఛలభించింది.

చెల్లీ కల్యాణీ! నువ్వువయసులో నా కంటే చిన్నదానివి. కానీ మానవుడిగొప్పను నిర్ణయించేది వయసుగాదు- ఆత్మౌన్నత్యం. పదిహేనేళ్ళప్పుడు నువ్వు కాపురానికి వెళ్ళావు. కొత్త మనుషుల్లో, కొత్త పరిసరాల్లో యిమిడిపోయావు. భర్త కనుసన్నల్లో మెలిగావు. అత్తమామల ఆదరాన్ని చూరగొన్నావు. పుట్టినింటికీ, మెట్టినింటికీ కీర్తిదెచ్చావు. ఏడాదికొకసారి పిలుచుకొచ్చి, నీకు పసుపూ కుంకుమా పెట్టి పంపుకునేపాటి కనీసపు కర్తవ్యాన్ని గూడా విస్మరించిన ఈ కఠినుడిపట్లగూడా నీకు కినుక లేకపోయింది. ఒకరక్తం పంచుకుని పుట్టిన నేరానికి చనిపోతున్న క్షణంలోగూడా నువ్వు నాశ్రేయస్సును కాంక్షించావు.

కల్యాణీ! నువ్వు చనిపోయావంటున్నది లోకం. కాని ఆమాట అబద్ధం. ఈ మంటిపైన నావంశం నిలిచివున్నంతకాలం నీకు చావులేదు. నా బిడ్డలు నిన్ను యిలవేల్పుగా భావిస్తారు. నిండు హృదయంతో పూజిస్తారు.

ఇంతకన్నా నేనేం చెప్పగలను?

ఇదీ నా కథ.

వ్యథలతోనిండిన నా కథకు ఫలశ్రుతిగా నేను మిమ్మల్ని అర్థించేది ఒక్కటే ఒక్కటి. నన్ను మీరు అర్థంచేసుకోండి.

మానమే భూషణమన్నారు.

మానం పోయిందంటే అర్థమేమిటి? ప్రాణం పోయినట్టే నన్నారు.

నా మాన మెప్పుడో పోయింది. ప్రాణమూ అప్పుడే పోయివుంటుంది.

లేదంటే నా పంచప్రాణాల్లో ఏదో ఒక ప్రాణంమాత్రం యిన్నాళ్ళుగా ఈ బొందెను పట్టుక వ్రేలాడివుంటుంది. ఇప్పుడదీ యిల్లు ఖాళీచేసి వెళ్ళిపోతోంది.

అందుచేత యిది ఆత్మహత్యగాదు.

స్వచ్ఛంద మరణం.

చదివి ముగించేసరికి కాళ్ళకేదో చల్లగా తగిలింది. త్రుళ్ళిపడి టార్చిలైటును క్రిందికి త్రిప్పాను.

కొండపైనబడి పాయలుపాయలుగా క్రిందికి దిగజారిన వాననీటిలో ప్రభవమంది, త్రోవ పొడుగునా త్రుళ్ళింతలాడుతూ పరతెంచివచ్చిన సెలయేళ్ళను తనలో లీనంచేసుకుని రభసంతో ముందుకు సాగుతున్న కొండవాగు తూముక్రిందికి వచ్చేసింది.

చెప్పకుండా పెట్టకుండా, ఉరుములతో మెరపులతో మున్ముందుగా హెచ్చరికలు సలుపకుండా ఈ రోజు వున్నట్టుండి వరుణదేవుడి కరుణాకటాక్ష వీక్షణాలు లోకంపైన ప్రసరించడానికి కారణమేమిటో నాకప్పుడవగతమైంది.

సందేహంలేదు,—చల్లగా ఈ గాలి వీచిందీ, జల్లు జల్లున ఈ వర్షం పడిందీ, ఘల్లు ఘల్లున ఈ కొండవాగు కదిలి వచ్చిందీ, ఈ మందభాగ్యుడి ఎదలో చెలరేగిన వేదవాజ్వాలల్ని చల్లార్చడంకోసం.

గంగాభవాని ఆ కళేబరాన్ని స్పృశించింది. కన్నీటితో అభిషేకించింది. తనివితీరా చుంబించింది.

బయటికి చూచాను. బాగా చీకటి పడిపోయింది. ఆలస్యంచేస్తే నాకీ రాత్రి శవజాగరణం తప్పదు. వాన జోరూ, గాలిహోరూ కొంత తగ్గినట్టుంది. సైకిల్ను వెలికీడ్చి రోడ్డుపై కెక్కించాను. వర్షం అంత ఉధృతంగానూ గాక, అంత నెమ్మదిగానూ గాక ఒక నిశ్చలమైన స్థాయిలో కురుస్తోంది. ఎక్కికూచున్నాను, సైకిలు కదిలింది. గుంతల్లో నిలచిన బురదనీరు చివ్వుచివ్వున పైకెగురుతోంది. ఎగరనీ, ఎగిరి ఎగిరి ఈ బురదనీరు ఏం చేయగలుగుతుంది? దుస్తులు ఖరాబౌతాయేమో, ఐనా పరవాలేదు. అంతెందుకు? దారి సరిగ్గా కనబడక సైకిలు మీదనుంచీ పట్టు దప్పి క్రిందికి పల్టీకొట్టి ఒకటి రెండు పళ్ళురాలినా పరవాలేదు. వీలైనంత త్వరగా రామాపురం చేరుకోగలిగితే చాలు!

చీకటిని దూసుకుని సైకిలు ముందుకు వెళ్ళనూ, వెళ్ళనూ వర్షం వెనుకబడి పోయింది. ఓ అరగంటసేపు నా పాదాలు సైకిలు పెడళ్లపైన నిర్విరామంగా పనిచేశాయి. చూరుల సందుల్లోనుంచి వెలికి వచ్చీ రాక స్పష్టాస్పష్టంగా చీకటిలో తారాడుతున్న దీపకాంతులతో రామాపురం ఎదురైంది.

వీధిలో సైకిలు తోసుకెళ్తుండగా శేఖరం పెద్దన్నయ్య నీలకంఠం ఎదురయ్యాడు.

"ఇదేమిటి బాబూ! వానలో పడుతూ లేస్తూ వచ్చావెందుకు? బస్సులో రాలేక పోయావా?" అంటూ నాదగ్గరనుంచీ సైకిలు తీసుకున్నాడు నీలకంఠం.

"బస్సు తప్పిపోయింది. సైకిల్తో సునాయాసంగా రావచ్చుననుకున్నాను. మధ్యలో వానపట్టుకుంది. ఎలాగైతే నేంలెండి, వచ్చి పడిపోయానుగదా!" అన్నాను.

నీలకంఠం సైకిలు పాక లోపలికి త్రోసి ఈవలికి వచ్చాడు.

"ఎలా వున్నాడండీ శేఖరం?" అని ప్రశ్నించాను.

"ఆ మాటెందుకులే బాబూ! వాడు బొత్తుగా మన మనిషి గాకుండా పోతున్నాడు. భోజనంపై ధ్యాసలేదు. పిలిస్తే పలకడు. రాత్రుల్లోగూడా నిద్రపోతున్నట్టు లేదు. వాడి వెర్రివాలకొన్ని చూస్తుంటే మాకు భయంవేస్తోంది. ఎలాగు నువ్వు వచ్చావు. వాడికి కొంత ధైర్యం చెప్పి వెళ్లాలి. వెళ్ళు బాబూ! వెళ్ళు. మొదట దుస్తులు మార్చుకో. అదిగో ఆ పెంకుటిట్లో వున్నాడు శేఖరం." అన్నాడు నీలకంఠం.

పెంకుటింటివైపు దారితీశాను ఓరవాకిలిగా వేసివున్న తలుపును మెల్లగా త్రోశాను.

నట్టింట మట్టి ప్రమిదలో దీపం వెలుగుతోంది. ఆ వెలుగు గోడకానించివున్న ఛాయాచిత్రంపైకి ప్రసరిస్తోంది. ఆ చిత్రానికి పాద పీఠికపైన వుంచిన గుప్పెడు మల్లె పువ్వులు గదంతటా దివ్య సౌరభాన్ని వెదజల్లుతున్నాయి.

మట్టి నేలపైన గోడకు చేరగిలపడి శేఖరం పైకప్పుకేసి శూన్యంగా చూస్తున్నాడు.

"శేఖరం!" పిలిచాను.

శేఖరం నావైపు చూచాడు. ఆతడి ముఖంలో సంభ్రమం వ్యక్తమైంది.

"రాజా! ఇంత చీకటిలో! ... ఎలా వచ్చావు?" అంటూ అతడు ద్వారం దగ్గరికి వచ్చాడు.

"సైకిల్లో వచ్చాను శేఖరం!" అన్నాను.

"మంచిపనిచేశావులే! బాగా తడిసిపోయావన్నమాట! ఉండు, వస్తాను" అంటూ శేఖరం పెరట్లోకి వెళ్ళి బకెట్లో నీళ్ళు తెచ్చాడు.

కాళ్ళూ చేతులు కడుక్కొని, శేఖరం ట్రంకు తెరిచి తీసుకొచ్చిన పంచను కట్టుకొని తడిబట్టల్ని పిండి దండెంపైన ఆరవేశాను.

నీలకంఠం ఓ గ్లాసునిండుగా పాలు తీసుకొచ్చి కాసేపు సేదదీరమని చెప్పి వెళ్ళిపోయాడు.

వేడి వేడిగా పాలు కడుపులో పడేసరికి ప్రాణం కుదుటపడింది.

నిమిషాలు దొర్లిపోతున్నాయి. ఒకరితో ఒకరం మాట్లాడుకోకుండా మేమిద్దరమూ చాలసేపటివరకూ ఆ గదిలో పోతబోసిన విగ్రహాల్లా కూర్చుండిపోయాము.

ఉన్నట్టుండి శేఖరం తల పైకెత్తాడు. నావైపుచూస్తూ గద్గదస్వరంతో "నన్నిలా దిగవిడిచి ఆమె వెళ్ళిపోయింది రాజా! అన్నాడు.

అతణ్ణి ఓదార్చవలసిన నా బాధ్యతను గుర్తుకు తెచ్చుకుని "వెళ్తేనేం శేఖరం! ఆమె ధన్యురాలు. బ్రతికినంతకాలం నీకు తోడు నీడగా బ్రతికింది. చనిపోయి నీచేత ఆరాధింపబడుతోంది. ఆమెకు ఊర్ధ్వలోకాల్లో శాశ్వతమైన స్థానం లభిస్తుంది." అన్నాను.

"కానీ యిదంతా నమ్మడానికి శక్యంగాని యింద్రజాలంలా కనిపిస్తోంది రాజా! ఆమె లేని జీవితాన్ని నే నెన్నడూ భావించలేదు. అసలు అలాటి పరిస్థితి ఏర్పడవచ్చునన్న అనుమానానికే ఆస్కారంలేదు. కానీ అనుకోనిదేదో అదేజరిగింది. ఈలోగిల్లో ఎక్కడతిరిగినా, ఎక్కడ కూచున్నా ఆమె నాప్రక్కనే నిలుచున్నట్టుంటుంది. పలకరించినట్టుంటుంది. 'భోజనానికి లేవరూ' అని పిలిచినట్టుంటుంది. ఒకప్పుడు మనిషంతా అదృశ్యంగా వుండిపోయి ఆమె చిరునవ్వు మాత్రమే కనిపించినట్టుంటుంది. మరోకప్పుడు చేయి జాపి పట్టుకోబోతే చీరచెరగు రెపరెపలాడుతుండగా దూరంగా దూరంగా వెళ్ళి అంతర్ధానమై పోయినట్టుంటుంది. నన్ను ఓదార్చాలన్న తపన నొక్కటే కానీ, యిక్కడివాళ్ళు నాసొదను తీరా మారా వినిపించుకోరు. పదేళ్ళ కాపురంలోని పదివేల మధుర స్మృతుల్ని ఒక్కసారిగా మనోఫలకంమీదినుంచీ తుడిచివేయమంటే, ఆపని సాధ్యమయ్యేదేనా రాజా?"

మళ్ళీ కొంతసేపు గదిలో మౌనం నెలకొన్నది.

ఈసారి మౌనాన్ని ఛేదించింది శేఖరమూ గాదు, నేనూ గాదు. ప్రక్కగదిలోనుంచీ వినిపించిన పసిపాప ఏడుపు.

ఏడుపు వినిపించగానే తటాలునలేచి శేఖరం గదిలోపలికి వెళ్ళాడు. నేనూ వెంబడించాను.

ఆ గదికి మధ్యగా ఓచాప, చాపపైన పరుపు, పరుపుమీద యిద్దరు పిల్లలు పడుకున్నారు. కుర్రాడికి అయిదేళ్ళుంటాయి. పసిదాని వయసు మూడేళ్లకు మించదు.

"చలివేస్తోంది మామయ్యా! దుప్పటి నాకు లేకుండా అన్నయ్య లాక్కున్నాడు"-ఫిర్యాదు చేసింది పాప.

"పోనీలేతల్లీ! నీకు నేను కప్పుతున్నానుగా! నిద్రపో." అంటూ శేఖరం పైగుడ్డను దీసి ఆ కుర్రదానికి కప్పాడు.

"వీళ్ళెవరు శేఖరం?" విస్మయంతో ప్రశ్నించాను.

"వాడు బాబు. ఇది భారతి. లోకమంటే ఏమిటో తెలియని పసివాళ్ళని గురించి యింతకంటే చెప్పవలసిం దేముంటుంది రాజా! లేదంటే ఒక్క విషయం మాత్రం చెప్పాలి. కల్యాణి వీళ్ళని నా కప్పగించి పోయింది."

"ఏమిటీ! ఏమన్నావు శేఖరం? వీళ్ళనా! నీకప్పగించి పోయిందా?" — ఆశ్చర్యాతిరేకంతో నేను కొయ్యబారిపోయాను.

శేఖరం కిటికీ తలుపులను మూసేశాడు. గదిలో వెలుగుతున్న దీపాన్ని తగ్గించాడు. "వెళ్దాం రా రాజా!" అంటూ ద్వారాన్ని సమీపించాడు.

నా మనసును నాలుగు చెరుగులనుంచీ ఆవరించుకున్న నివ్వెరపాటులోనుంచీ అప్పుడో ప్రశ్న ఉద్భవించింది.

"అదికాదు శేఖరం! వీళ్ళ తల్లి దండ్రు లేమయ్యారు?"

"ఆ తల్లిదండ్రుల సంగతా రాజా! తల్లి చనిపోయింది. తండ్రిమాత్రం వున్నాడు. కానీ ఎక్కడున్నాడో తెలియదు." అన్నాడు శేఖరం.

ఆ గ్రుడ్డి వెలుగులో నేను శేఖరాన్ని ఎగాదిగా చూచాను. ఆ క్షణాన నాకు అతడికి చిత్తవైకల్యం కలిగిన మాట నిజమే కావచ్చునని పించింది. కానీ బారెడు పొడుగు నిజం యివ్వలేని మహదర్థాన్ని ఒక చిన్న అబద్ధం యివ్వగలిగినట్టయితే, అలాంటి పరిస్థితిలో అబద్ధాన్ని నిస్సంశయంగా వాడుకోవచ్చునన్న నిర్ణయానికి రావడానికి నే నా రాత్రంతా ఆలోచింపవలసి వచ్చింది! ★

ద్వితీయ బహుమానము పొందిన కథ

# ★ పడవ ప్రయాణం ముగిసింది ★

శ్రీ క. శోభ

## చీకటి రాత్రి

భారతి పవిత్రాస్థికలని గంగా, కృష్ణా, గోదావరీ పుణ్యనదులలో కలిపిన తరువాత ఒక నాటి మధ్యాహ్న సమయాన గౌతమీనదిమీద పడవ ప్రయాణం చేస్తున్నాను. పడవలో ఒంటరితనం అనుభవిస్తున్నందువలన నా ఆలోచనలు గత జీవితంలోనికి వెళ్తున్నాయి.

అది నాలోని కళాకారుడి జీవితానికి అంధయుగం. యౌవనోపవనంలో విహరిస్తూ వుండగానే చీకటి పడినందువలన నా కక్కడ ఉండడమే భారంగా వున్న రోజు లవి. ఒక ముల్లు గుచ్చుకున్నా, ఒక తీగచుట్టుకున్నా సానుభూతి చూపే దిక్కులేని దినా లవి. ఆ రోజులలో ఒక శ్రావణ మాసపు రాత్రి నా జీవితాన్నే తారుమారు చేసింది.

ఆరాత్రి వినీలాకాశం కుండపోతగా వర్షిస్తోంది—కౌటుకకళ్ళు స్రవించే అశ్రుధారల లాగ.

ఆరాత్రి పది గంటలు కొడుతూంటే నా గదిలో కూర్చున్న నాకు నా యింటి ముందు వసారాలో దగ్గు వినిపించింది. కిటికీగుండా ఒక ముష్టిపడుచు ఒడిలో బిడ్డతో బాధపడుతూ కనిపించింది. అప్పటికి సహజంగా బీదవాళ్లంటే నాకుండే అసహ్యంవలన ఆమెతో పైడితల్లి గాడి చేత పొమ్మని చెప్పిద్దాం అనుకున్నాను గాని 'ఆ దయామయుడు' నాకు తెలియకుండానే నా చేత ఆ ప్రయత్నాన్ని విరమింపజేశాడు.

అన్నపూర్ణ మొదటి తద్దినం, బీదలకి అన్నదానం మున్నగువాటి కౌనాడయిన ఖర్చు ఎంతో లెక్కచూసుకుని గుండెలు బాదుకుని విద్యుద్దీపం ఆరిపోగా పడకగదిదీపం వెలిగించి సోఫాలో వాలాను. తద్దినం భోజనంవలన ఆయాసంగావుండి నిద్రపట్టడం లేదు.

అన్నపూర్ణ మాయింటిలో కాలుపెడుతూనే మా నాన్నగారిని మింగేసిందన్నారు నలుగురూ. ఆస్తిచేజిక్కినందుకు సంతోషించినా 'ప్రేమా, కళాసక్తుల్లేని' (ఆమెగురించి అప్పటి నా భావన అదే) అన్నపూర్ణని నేను లోకంతోపాటు తిట్టడం మానలేదు. కాళాకారుడు కాదలచిన వాడు ఆమెలాటి భార్యతో జీవించడం, కుక్కతోకపట్టుకు గోదావరి ఈదినట్టేనని అప్పటి నా దృఢాభిప్రాయం. కళ్లూ కాళ్లూలేని దరిద్రనారాయణులందరికీ దగ్గర బంధువైన అన్నపూర్ణ వొళ్లంతా గుండె; ఆ గుండె వెన్న. ఒకసారి దిక్కులేని గుంటడెవడో కారుకింద పడ్డాడని చెప్పగానే కళ్ళనీళ్లేగాని అన్నందగ్గర కూర్చున్నా నోటముద్ద పెట్టుకుంటే ఒట్టు. ఛస్; డబ్బున్నవాడి పెళ్లానికి ఉండవలసినలక్షణం



ఒక్కటీలేదు; అని తిట్టి సంగీతకళాశాలకి వెళ్ళిపోయాను- నా వీణాచార్య పీఠాన్ని అలంకరించడానికి.

చిత్రమేమిటంటే ఎన్నితిట్టినా అన్నపూర్ణ గంగిగోవులాగ చూస్తూ, దంతధావనానికి గోరువెచ్చని నీళ్లందించడంనుంచి, పువ్వున్నా నా వొళ్లు ఎక్కడ కందిపోతుందో అనే ఆతృతతో, శ్రద్ధా భక్తులతో పక్క వెయ్యడంవరకూ, ఎంతో తేలికగా హాయిని అనుభవిస్తున్నట్టు చేసేసేది. రకరకాలయిన వంటకాలని తన అధరం కదపకుండానే నాచేత తెగతినిపించేది- అయినా ఈ మౌనం ఆమెపట్ల నా అసహ్యాన్ని ద్విగుణీకృతం చెయ్యడానికే తోడ్పడింది.

నాలుగేళ్లు నా యింట్లో మూగదానిగా, తల్లిగా బ్రతికి, మరణశయ్యమీద ఇలాగన్నది అన్నపూర్ణ నాతో: 'చదువూ సంధ్యా ఎరగని దాన్ని; మిమ్మల్ని సుఖపెట్ట నోచుకోలేదు. ఒక్కసారి నా తప్పు లన్నిటినీ క్షమించాననరూ?'

నేను కన్నెత్తి చూడని, చూడ్డానికి నాకు అర్హత లేని మణిని ఇచ్చిన భగవంతుడే లాగుకున్నాడు...

అలా అన్నపూర్ణని తలుచుకుంటున్న నాకు ఎప్పుడు మాగన్ను పడిందో తెలియదు. వాన దబదబ మొత్తుతోంది. గడియారం పన్నెండు గంటలు కొడుతోంది. సన్నగా మధురగానం వినవస్తోంది. దేవకన్య పాటకి రాజకుమారుడు మేలుకున్నట్టు లేచి కిటికీగుండా వసారాలో చీకటి ముద్దలాగ వున్న ఆ యువతిని కనుగొన్నాను. పాట స్పష్టంగా తెలియకపోయినా దానిలోని మాధుర్యం నన్ను ఆనందాశ్చర్యాలలో ముంచేసింది.

లోపలనుంచి పైడితల్లి చర చర వచ్చి దభీమని తలుపు తెరచి 'ఏటమ్మాయి పాట లంకించుకున్నావు. ముష్టోళ్లంటే గిట్టని మా అయ్యగారిన్నారంటే మర్యాదక్కదు. ఇందుకేని న్నసలు మొదట గుమ్మం తొక్కొద్దన్నది.' అన్నాడు. 'మెడబట్టి గెంటేస్తా' నన్నంత భీకరంగా.

ఆమె హీనస్వరంతో 'నేను పాడాలని పాడలేదు బాబూ. కుర్రాడు నోరువిడచి - ఆకలే, అమ్మా - అనడిగితే చెప్పడానికి నోరు రాకపోయినా రాతిగుండెదాన్ని గాబట్టి ఏం లేదన్నాను. పసివాడు నోరెత్త లేదు మరి. పాడమని పట్టుబట్టాడు. చేతిలో ఉన్నదానిని కాదనలేక ఇంటివారెక్కడ మేలుకుంటారో అని సంశయిస్తూనే మెల్లని గొంతుకతో పాడేనునాయనా.

జల్లు ఎక్కువైంది. పిల్లడికి జ్వరం...' అని చెప్పుకుంటోంది.

పైడితల్లి 'ఇప్పటికి లక్షసార్లు చెప్పేవమ్మా పిల్లడికి జ్వరమని' అని విసుక్కున్నాడు.

'అదికాదు బాబూ. తడిసిపోతున్న కుర్ర నాగమ్మకి కాస్త చోటు చూద్దూ లోపల.'

'బాగుందమ్మాయి. కూకోడానికి సోటిస్తే ఏదో సావేత చెప్పినట్టూ—'

'పూష్టంతో వున్న పిల్లడిమొగం చూసైనా కనికరించు బాబూ.' అని ప్రాధేయపడింది ఆ మాతృహృదయం.

పైడితల్లి గుండె అన్నపూర్ణదే. అన్నపూర్ణకున్న అధికారమే అతనికుంటే ఈపాటి కా యువతిని పుట్టింటికి వచ్చిన కన్న కూతురిలాగ చూసుకునేవాడే.

'సరే రావమ్మా' అంటూ ఆమెని తీసుకుని వచ్చి మధ్య హాలులో చోటు చూపించాడు పైడితల్లి. ఆమె కొడుకుని ఒడిలో పెట్టుకు కూర్చోడం ద్వారంగుండా గుడ్డ వెలుతురులోనే కనిపించింది నాకు. 'ఇదుగో అమ్మాయి! కొబ్బరికాయ ముక్కలాటి గోడ కరాబవుతాది, చేరబడకేం?' అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

ఆమె నేలమీద చతికిలబడింది. ఒకసారి ఇటూ అటూ చూసింది. తన పైట తీసింది. ఎంతో నొచ్చుకుంటూ కొడుకు వొళ్లు ఒత్తింది. నిద్ర ఆపలేక కొంతసేపటికి ఎడంచెయ్యి గుండెల మీదుగా కుడిభుజంమీద వేసుకుని కుడిచేతితో కొడుకుని పొదివి పట్టుకుని తలుపుకి చేరబడి నిద్రపోయింది.

నేను ఇంకోవైపు తిరిగి బలవంతాన కళ్లు మూసుకున్నాను. తిన్నదరిగి ఆయాసం తగ్గినా, ఆయువతి ఆకృతి నా కళ్ళముందు పహారా యిస్తూ నిద్రని వాటిమీద వాలనివ్వడంలేదు. ఆమె ఉత్తుంగ వక్షం మోహాన్నీ, వెన్ను అంటుకుపోయిన కడుపు ఆమెని సులభంగా పొందవచ్చుననే ఆశనీ గొలిపాయి. బోలెడు గారెలూ, నువ్వుల పప్పుండలూ వంటమనిషి మూతబెట్టి పోయింది. ఉడికిపోతున్న నా రక్తాన్ని చల్లార్చడానికో అన్నట్టు లేచి గడగడ మంచినీళ్లు తాగాను. ఎదురుగా నిలువెత్తునఉన్న అన్నపూర్ణ ఛాయాచిత్రం నన్ను కలవరపరచింది. ఆమె ఆత్మశాంతికని అంత డబ్బు ఖర్చుపెట్టి ఆనాటిరాత్రి ఇంత నైచ్యానికి ఒడిగట్టడం ఆత్మవంచన కాదా? నా కన్నపూర్ణ మీద ప్రేమే వుంటే... కాని అదే లేదు. ఆమె నాలోని కళాకారుడిని జోకొట్టిన అవివేకురాలు. ఇలాటి కోరికలు తీరుతూంటేగాని నేను కళాకారుడిని కాలేను... కాని స్త్రీ వాంఛని చాలా వరకూ అణుచుకోవడంవల్లనేగాని తీర్చుకోవడం వలన కళాసృష్టి జరగదంటారే...... అబ్బే, కోరికలని అతిగా అణగదొక్కితే గుండె విషపూరిత మవుతుంది. విషభాండం కళామృతాన్ని అందివ్వడం...అబ్బెబ్బే! ఇలా ఏమేమో అనుకుంటూ ఆ అనాథని సమీపించగానే—

టక్కున వెలిగింది విద్యుద్దీపం దానంతటదే.

ఒక్క క్షణం మాత్రమే పరిశీలించిన ఆమె మొగంలో భారతి పోలికలు కొన్ని కనబడి, గాభరాపడి, ఏంచేస్తున్నదీ నాకు తెలియకుండానే పరుగెత్తాను పెరటివాకిటిలోనికి.

భారతి గుర్తువచ్చి గాభరాపడవలసిన అవసరమేమిటో, నాకూ ఆమెకూ గల సంబంధం తెలియని పాఠకులు ఊహించలేకపోవచ్చు.

నోటిలో వెండి ఉగ్గుగిన్నెతో పుట్టిన నాకు చిన్నప్పటినుంచీ కళాభిరుచి ఎక్కువ. అందులోనూ సంగీతమంటే ప్రాణమే. అ ఆలకంటె సప్తస్వరాలు వేగిరం పట్టుబడ్డాయన్నా అతిశయోక్తి కాదు. కాని మాకున్న ఐశ్వర్యానికి తోడు నాకు కాస్త ఇంగ్లీషుచదు వబ్బి, తద్వారా ఏ కలక్టరుగిరీయో లభిస్తే బంగారానికి తావి అబ్బినట్టే అనే ఆశచేత మా నాన్నగారు నా కళాహృదయాన్ని కన ప్రయత్నించక హైదరాబాద్‌లోని మా మేనమామ దగ్గరకు పంపించారు నన్ను. నిజాం కళాశాలలో చేరాను లోలోపల ఏడుస్తూ. ఎప్పుడూ సంగీతం నేర్చుకోవాలనే తహతహలాడుతూ వుండేది నాహృదయం. కళాశాలలో ఉన్న ప్రతి నిముషమూ నాలో కళాకారుడి ఆయువు ఎవరో దొంగిలిస్తున్నట్టు అనిపించేది. ఒకసారి హైడ్రో స్టాటిక్స్ గురించి పాఠం జరుగుతూ వుంటే 'హిమగిరి తనయే హైమవతీ...' అని పాడుకుంటున్న నాకు ఆ మైమరపు రెండురూపాయల జుల్మానా పడేదాకా వదలలేదంటే నమ్మండి. నామీద ఫిర్యాదు చేసినదెవరో తర్వాత తెలిసిందనుకోండి. నా పక్క బెంచీలో వున్న ఆ తెల్లహాటి (బాగా తెల్లటి) పిల్ల హైమవతనీ, హైమవతి కోపం వస్తే దాక్షాయిణి అనీ. ఇలాటి అనేక అనుభవాలవలన నేను సంగీతం అభ్యసించడం ఆరంభించకపోతే ఈ చదువు కూడా వంటబట్టక రెండింటికీ చెడిన రేవడ నౌతానని తెలుసుకోగలిగాను.

తెలుసుకున్న వెంటనే ఒక ప్రతిభా సంపన్నుడైన సంగీతాచార్యుని ఆశ్రయించాను. దేవుడాయనలో ఉన్నాడు. నా వేడికోలు సఫలమైంది. కాని నేను ఆ తొలిపాఠం రోజున దర్శించిన ఆయన ప్రియశిష్యురాలూ, సహజ సౌందర్యరాశీ అయిన భారతి నన్ను ప్రేమించకపోతే నేను ఈనాడు కార్మికుడు —ఆమాటయొక్క విస్తృతార్థంలోసుమండీ— గానే గాని కళాస్రష్టగా రూపొందేవాడిని కానేమో.

దిక్కులేని బీదపడుచు భారతి తెలుగూ, లెక్కలూ, కుట్లూ, అల్లికా నేర్పి బతుకుతూ కచ్చితమైన జీవనోపాధికోసం సంగీతం నేర్చుకుంటోంది. నావైపు చూసి నవ్వినప్పుడల్లా ఆమె అందానికి పిచ్చివాడ నయిపోయేవాడిని. కాని కళకి జీవితాన్నీ, తను ప్రేమించిన అదృష్టవంతుడికి హృదయాన్నీ అంకితం చెయ్యగల శక్తి ధైర్యాలతో గూడిన ఆమె నివురుగప్పిన నిప్పులాగ వున్న మహత్వపూర్ణ వ్యక్తిత్వాన్ని నేను అప్పటికి ఇంకా గుర్తించలేదు.

ఒక సంజవేళ హుస్సేన్‌సాగర్ ఒడ్డున ఆమెని పట్టుకున్నాను. గాలికి రెప రెపలాడుతున్న ఆమె నీలిపైట చాటున ఎర్ర జాకెట్టులో బింకంగా వున్న వక్షోజాలమీద నకిలీ రాళ్ళ కంఠాభరణం, అలలు వేస్తున్న కొలనులోని రెండు కలువల మీదుగా జారుతున్న మంచు బిందువులమాదిరి, విద్యుద్దీపాల వెలుగులో మెరిసిపోతూ నా కళ్లని జిగేల్ మనిపించింది. ఆరాత్రి ఆమెని 'ప్యారడైజ్' కి లాగుకుని పోయాను.

తరువాత ఒక నెల్లాళ్ళపాటు తియ్యని కలలో వున్నానో, దేవకన్యతో స్వర్గంలో వున్నానో! కాని ఆమె గర్భవతి అయిందని తెలియగానే భూలోకానికి దిగివచ్చి భారతితో—తన దేహ హృదయాత్మలనే నాకు సమర్పించిన ప్రియభారతితో—చెప్పనయినా చెప్పకుండా, చీటి అయినా వ్రాయకుండా విజయనగరం పారిపోయి వచ్చాను. రైలు హైదరాబాదుకి దూరమవుతున్నకొద్దీ విచారంతో దాని పొగలాగే వున్న నా హృదయం భారతివైపు పరుగిడుతోంది. ఏడ్చి ఏడ్చి ఎడారి గుండెవాడినయి పూరుకున్నాను.

మరి రెండేళ్ళకి పెళ్ళిపేరు కిట్టని నాకు అన్నపూర్ణతో వివాహమైంది. అప్పుడప్పుడు భారతిమీద ప్రేమ ఉప్పొంగినప్పుడు అన్నపూర్ణమీదా, కళ్లలో వొత్తులెట్టుకొని నిత్యం నాకు సంరక్షణచేసే అన్నపూర్ణమీద దాక్షిణ్యం కలిగినప్పుడు భారతిమీదా నాకు వొళ్లు మండిపోతూండేది...

అలా వాకిటిలో నిలబడగానే ఎంత అఘాయిత్యానికి పూనుకున్నాను! అని చింతించాను. ఆమె భారతి అయుంటుందా? అసంభవం. ఎక్కడి హైదరాబాద్! ఎక్కడి విజయనగరం! నాలాటి దుర్మార్గుడెవరో వంచించగా సంఘం దృష్టిలో పతితయై దేశాల పాలైన మానవతి అయుండొచ్చు. నిజంగా పతితకూ, లోకందృష్టిలో పతివ్రతకూ తిండికి మొగంవాచ నక్కరలేదేమో. నా భారతికూడా బిడ్డతో ఇలాగే అవస్థలు పడుతోందా? రామరామ! ఓ కరుణామయా! ఒక్క పిడుగు నా పాపపు శిరస్సుమీద పడెయ్యవా తండ్రీ?

అప్పటికిగాని నేను పూర్తిగా తడసిపోయినట్టు తెలియలేదు. విద్యుద్దీపం మళ్లీ ఆరిపోగానే వేరే త్రోవన నా గదిలోనికి పోయి వెచ్చని ఇస్త్రీ బట్టలు కట్టుకుంటూవుంటే హాలులో గోల వినిపించింది.

'అబ్బబ్బ. నీకు సెప్పలేక నాదుంప తెగుతోందమ్మా. మా బాబుగారికి డబ్బు ఖర్చులేనంత వరకే మన్ది జాలిగుండె. నీ కొడుక్కు వూష్టంగా వుంటే మేం డాటర్‌గార్ని పిలిపించాలా? ఎళ్లుతల్లీ వాగించ కెళ్లు. తెల్లారగానే గవొర్నమెంటు దరమాసుపత్రి కంపొండరు సేతిలో కాఫీడబ్బులెట్టు...' అని అరుస్తున్నాడు పైడితల్లి.

హాలులో నేలమీద ఆ పడుచు కొడుకు ఏవో పలవరింతల చాకులతో తల్లి హృదయాన్ని కోస్తూ, బాధపడుతున్నాడు. ఆ యువతి నన్ను కనుగొని కొస్త వికసించిన ముఖంతో, బాబూ! పసివాడు మరణబాధతో- మీరైనా కాపాడండి బాబూ- ఎలా చుట్టుకుపోతున్నాడో చూడండయ్యా-' అని ఏమో వేడుకోబోయింది.

పైడితల్లి అడ్డుతగిలి 'ఇదుగో అమ్మాయి! డాటర్‌గార్ని పిలవడం అంటే కబుర్లు కాదు. ఆరు సూద్దానికొచ్చినందుకు ఖర్చు, డ్రయివేరు బీడీకట్ట ఖర్చు... మరి దేవుడు శానా మేలుసేస్తే...' అని బుర్ర గోకుకున్నాడు.

పిల్లవాడు కాళ్ళు నేలమీద రాస్తూ తల అడ్డంగా వూపుతూ కేకలువేస్తూంటేనూ, ఆ తల్లి నేలమీదబడి గుమ్మాన్ని పట్టుగుని 'రక్షించండి బాబూ, ఉన్నవారికి పదిరూపాయులో లెక్కా? సగం చచ్చి వాడికోసవేఁ బతుకుతున్నాను.' అని నెత్తి మొత్తుకుంటూ వుంటేనూ జాలివేసి 'వెధవడబ్బు పోతేపోయిందిలే డాక్టర్ని-' అనుకునేంతలో పైడితల్లి గొంతు వినిపించింది.

'ఓ ముష్టిదాని కుర్రాడికోసం డాటర్‌గార్ని పిలిస్తే, మన దర్జాకీ, హోదాకీ తగదుబాబూ. అదీగాక ఈవిడ ఎలాటి రకవోఁ-'

సిగ్గుతో, తెగి కిందపడిపోయిందన్నంతగా ఆ అభిమానిని తలవాలిపోవడంతోబాటు నాకూ నొప్పికలిగింది. వెంటనే పైడితల్లిగూడ ఆమెమీద జాలిపడ్డాడు. పైడితల్లి కొంతసేపు మాట్లాడిన తర్వాత ఆమె నాతో 'బాబూ!' అన్నది కళ్లనీళ్లతో. ఆ నీళ్లు నా హృదయాన్ని కొంత కరగించినప్పటికి డాక్టరెందుకొచ్చాడో తెలిస్తే నలుగురూ నవ్వుతారనే భయం ఫోన్ చేయించలేదు. 'లాభంలేదమ్మా వెళ్లు.' అని నొక్కి చెప్పగలిగాను.

దుఃఖం ఎరమింగి కదలలేక పడివున్న ఆ తల్లి పాము ఈ నా దెబ్బతో బుస్సున లేచింది తాళప్రమాణంగా.

'లాభంలేదా బాబూ? కీర్తి కొనుక్కోడానికి అన్నదానాదుల పేరిట చిల్లపెంకులలాగ డబ్బు వెదజల్లుతేనేనా లాభం? భూవీఁ ఆకాశవూఁ నా కన్నతండ్రిమీద పగబట్టినరోజున ఈ దిక్కులేని దానిమీద కనికరం చూపిస్తే లాభంలేదా?—' అంటూ హద్దులు దాటుతున్న ఆమె బాట కడ్డుగా నా చూపులలోని అగ్నిజ్వాలలు నిలిచాయి. వెంటనే దిగజారిపోయి 'క్షమించండి బాబూ నన్ను. వెర్రిలో వొళ్లు తెలియలేదు. వాడే మీ కొడుకైతే ఇలా గొదిలేస్తారా బాబూ? వొదిలేస్తారా బాబూ వాడే మీ కొడుకైతే ఇలా? వాడే మీ కొ... ఖొ.ఖ్...' ఆమె గోలని దగ్గు ఆపగలిగింది.

ఆ ఝంఝూమారుతంతో నాలో మిగిలిన కఠినత్వం గడ్డిపరక ఎగిరిపోక ఇంకెక్కడుంటుంది? 'ఒరే పైడితల్లీ, డాక్టర్‌గార్ని పిలూ.' అని కేకవేసి వాడేదో అనబోతూ వుంటే 'నోర్ముయ్! ఫోన్ చెయ్!' అని కసిరికొట్టాను.

ఆ లతాంగి దగ్గుతో గుండెలు పట్టుకుని చుట్టుకుపోతోంది. ఒక నిముషం మంటలమధ్య ఉన్నట్టు గడిపి, ఫోను గదిలోనికి పరుగెత్తి 'ఎవర్నీ, ఏవిఁటి?' అని జాగుచేస్తున్న పైడితల్లి చెంప నా జీవితంలో తొలి, ఆఖరిసారిగా ఛెళ్లుమనిపించి, రిసీవరందుకుని, తన కారు చెడిపోయిందని డాక్టరుగారే వచ్చి చెప్పగా విని, డ్రయివర్ రానందువలన స్వయంగా నా కారుని తీసుకుని శరవేగంతో పోనిచ్చాను రోడ్డుమీద.

మినర్వా హాలుదగ్గర జనం రద్దీవలన కారు సాగడానికి సందులేకపోగా నాకు వొళ్లుమండిపోయింది. ఎవడో ఎంత హారన్ కొట్టినా కదలక పోయేసరికి 'తప్పుకోవేరా గాడిదా!' అని తిట్టాను. నేస్తం ఎవడో వాడి చెయ్యిపట్టుకు లాగుతూవుంటే వాడు నామీద కళ్లెర్రజేసి 'ఓఆరే...మాడల్దిన్నగా-' అన బోయాడు. నేస్తం వాణ్ణి ఇంకా వెనక్కు లాగుతూ 'శాంతించు బ్రదర్. తొందరపడకు. ఆయనకూడా నీలాగే సానీధిలో జస్ట్ ఇప్పుడే రెండుబుడ్లు పట్టించి వొస్తున్నాడు. ఆయన్ని పట్టుగున్న పోలీసాడికేబుదిరా అదృష్టవంఁతే. ఆయన-' అంటూండగానే, నాకారు ఫర్లాంగు ముందుకు పోయింది.

డాక్టరుగారిని తీసుకువచ్చేటప్పటికి నాయింట్లో విద్యుద్దీపం వెలుగుతున్నందువలన ఆ బీదపడుచు తలుపుచాటున నిలబడింది. డాక్టరుగారు పిల్లవాడిని శ్రద్ధగా పరీక్షించి ఇంజక్షనిచ్చి, 'రెండుగంటలముందు మేలుకోవలసిందండీ. అయినా కుర్రవాడి ప్రాణానికి నాది పూచీ. బిల్లువిషయం ఇప్పుడెందుకు, ఆనక పంపిస్తాను. మందుకి మీ బంట్రోతుని రమ్మనండి.' అన్నారు.

ఆయనని సాగనంపి నేను తిరిగి వచ్చేసరికి ఆమెకొడుకుని ఒడిలో పెట్టుకుని బుజ్జగిస్తోంది. విభ్రాంతులంకాగా మానోళ్ళనుంచి 'నువ్వా?' 'మీరేనా?!! నిజవేఁ!!?' అన్నమాటలు వెలువడ్డాయి. నేను గిరుక్కున వెనుదిరిగి గదిలోనికి పోయాను.

ఆమె ద్వారం దగ్గర నిలబడి 'నేను చచ్చిపోయేలోపల మరొక్కసారి మీరు కనిపిస్తారేమోనని మీ పసివాణ్ణీ, నా మానాన్నీ కాపాడుకుంటూ ఊరూరా తిరిగాను. ఆఖరికి ఇక్కడ కనిపించారు. ఇక నా కేమైనా చింత లేదు...' అంటూ వుంటే నేను ప్రక్కమీద వాలి రోదించాను. కొంతసేపటికి తన అమృతహస్తాన్ని నా నుదుటిమీద ఉంచుతూ 'విచారిస్తారేం? ఎక్కడున్నా, ఎలావున్నా, మీ

రెవరి సాత్తో నాకు తెలియదూ?' అన్నది ఆత్మ విశ్వాసంగల భారతి.

## ప్రశాంత ప్రభాతము

నాకూ, భారతికీ పెండ్లయినప్పుడు ఇంచుమించు ఎవ్వరూ రాలేదనే చెప్పవచ్చు. 'అస్తమానం ప్రపంచం మనని ఆమోదించాలనుకుంటే చిత్తశుద్ధితో కొన్ని మంచిపనులు చెయ్యాలేవండీ' అంటుంది సౌశీల్యవతి భారతి.

ఒకనాటి ప్రశాంత ప్రభాతాన పుట్టి మునిగిపోయినట్టు నన్ను లేపేస్తోంది. నేను గునుస్తూ,

'లేపకే నా యెంకి లేపకే నిదర

ఈపాటిసుకము నేనింతవరకెరగనే...'

అన్నాను.

భారతి నవ్వుతూ 'బాగుందండీ వెర్రి. రాత్రి టెలిగ్రాం అప్పుడే మర్చిపోయేరు గాబోలు. ఆ కాకినాడ కార్యక్రమానికి వెళ్లొద్దూ? లెండి వేగిరం.' అన్నది.

నేను ఉలికిపడ్డాను. 'దానికి రానని టెలిగ్రా విద్దామనుకుంటున్నాను భారతీ! ఇవేళ కన్నబాబు పుట్టినరోజు కదూ?'

'ప్రోగ్రాం మానుకోడం కుదరదు. లేవండి.' అని శాసించింది.

నేను ప్రసంగం మార్చ ప్రయత్నిస్తూ 'అన్నట్టు నిన్న హైదరాబాద్ పతిత స్త్రీ జనోద్ధరణ సంఘంవాళ్ళు మనం ఇచ్చిన విరాళానికిగాను నన్ను సన్మానిద్దామని ఆహ్వానం పంపేరు తెలుసా?' అన్నాను.

'ఆఁ. దీన్నికూడా ఎందుకు తోసిపుచ్చేరండీ స్వామీ?'

'కీర్తివేట వదలనంతకాలం ఉత్తమ కళాకారుడు కాలేడని...నీవు నేర్పిన విద్యయే నీరజాక్షి.'

'నేర్చేరు లెండి. డబ్బూ, కీర్తులని వేటాడొద్దన్నాను గాని అవే మీవెంట బడుతూంటే దూరంగా పారిపోమన్నానా? కళా ప్రస్థంటే జనకుడిలాగ పైకి భోగి, లోపల యోగి. కొండొకచో త్యాగికూడ. లెండిమరీ!' అన్నది. నేను వొళ్ళు విరుస్తూంటే ఇంకోపావు గంటకైనా లేచి తీరవలసిందే సోమరి చక్రవర్తి గారూ, కళాసేవంటే కబుర్లుకాదు. కన్న పుట్టిన రోజు పూటా మీ రింట్లో లేకపోతే నాకూ ఏమిటో ఇదిగానే వుంటుందనుకోండి, అయినా ఆడగుండె పైకి రావలసిన మగవాడి దారిలో బండరాయి. అంచేత వేగిరం లేచి మొద్దబ్బాయితనం వొదిలీండి'. అని కలకల నగవుతో వెళ్లిపోయింది.

సుఖం మరిగి, ప్రతి కార్యక్రమమూ ఏవో సాకులు చెప్పి తప్పించుకోజూచే నా ఆటలు సాగనివ్వని భారతి కళాసేవలో తక్కువది కాదు. విజయనగరం త్యాగరాజ ఉత్సవాల నుంచి, వివిధ కేంద్రాల రేడియో కార్యక్రమాలవరకూ ఆమె గాత్రం లేనిదే జరగవు. ఆ వేళలలో ఆమె నాతో సహా అన్నీ మరచిపోయేది. భారతి లతామంగేష్కర్ కంఠ మాధుర్యమూ; సుందరాంబాళ్, పట్టమ్మాళాదుల గానకళాకౌశలమూ పుణికి పుచ్చుకుందంటే ఆమాట వారికి గౌరవాన్ని ఇస్తుంది.

తిరిగి వచ్చిననాడు నన్ను రకరకాలైన పిండివంటలతోనూ, అంతకంటె తియ్యనైన తన కబుర్లతోనూ ఉక్కిరిబిక్కిరి చేసేస్తోంది భారతి. 'ఏమిటీ భారతీ యీ అన్యాయం? కళాకారుడు పనిచెయ్యాలని ఓ వంక చెప్తూనే తెగమేపితే, వాడి మొహం, వాడేంచేస్తాడు?' అనడిగాను.

భారతి నవ్వుతూ బదులు పలికింది. 'కళాకారుడి కామాత్రం సోమరితనం మంచిదే లెండి. మబ్బులస్తమానం వర్షిస్తాయా? అప్పుడప్పుడు తెల్లగా ముస్తాబయి షికారుచెయ్యవూ?

ఇలా భారతితో నా జీవితం ప్రశాంత ప్రభాతం రీతిని, కొత్తగా మిలిటరీలో చేరిన కుర్రాడి జీవితం మాదిరి, అప్పుడప్పుడు కొంచెం ఆసదుపాయం వున్నా, మొత్తంమీద ఎంతో హాయిగా ఉత్సాహవంతంగా వెళ్లిపోతోంది.

అయితే అప్పటికి నాకు తెలియదు—ప్రభాతం శాశ్వతం కాదనీ, సైనికుడి గుండెలో ఎప్పుడైనా గుండుదూసుకు పోవచ్చుననీ.

## మిత్రాస్తమయం

నేను విశాఖపట్నం మకాం మార్చి,రోజూ కె. జి. ఆసుపత్రి టి. బి. వార్డువైపు నా కారుమీద దానికంటె బరువైన హృదయంతో వెళ్లేవాడని ఆ రోజులలో. భారతికి- యౌవనం చీకటి తోటలో తిరుగుతుండే నా పాలిటి భానూదయంలాగ దర్శనమిచ్చిన నా అర్ధాంగి భారతికి- క్షయ జబ్బు. నా పాటకచ్చేరీ, పతితోద్ధరణ కార్యకలాపాలన్నీ స్థంభించిపోయేవేగాని భారతి అందుకు ససేమిరా ఒప్పుకోలేదు. ఒకసారి వెయ్యినూటపదహారులు వచ్చే ఒక కార్యక్రమాన్ని వొదులుకుని ఆసుపత్రికి పరుగెత్తినందుకే మండిపడింది. "మంచి పనే చేశారు. రేపొ పతితజనోద్ధరణసంఘానికి ఐదువేలు విరాళ మివ్వాలిగదా? ఎక్కణ్ణుంచి తెద్దామనీ? నా పాడు మొహంలో ఏవుందండీ?" అని అరుస్తూంటే ఆమెకి దగ్గు తెర వచ్చి నాకు శిక్ష విధించింది.

ఆదుర్దాగా నే నామె గుండెలు నిమురుతూ "హైరాన పడకు భారతీ. వెధవ్వెయ్యిరూపాయిలకోసం నిన్నివాళ చూడకుండా ఉండబట్టలేకపోయాను. కోప్పడకు. రాక నేపోగునా. గాని... రాత్రేల్లా పాడుకలలు." అంటూంటే నా బరువుగుండె గొంతు కడ్డుపడింది.

భారతి నా వెనువెంట ఎండలాగ పకపక నవ్వేస్తూ "మీరు బొత్తిగా ఆడాళ్లయిపోతున్నారేమండీ? అయితే నా బొందిలో ప్రాణం కాస్తా పోగానే మీరు నవలల్లో ని భగ్న ప్రేమికుల మోస్తరుగా—?" అని వూరుకుంది. నాచిరునవ్వు మొగం వెనక ఏడుస్తున్న మనస్సుని కనుగొనియే కాబోలు.

మరొకనాడు వెళ్లగానే నా మొగంచూసి నవ్వుతెచ్చుకుని ప్రారంభించింది: "ఏమండీ? ఆ రాత్రి మీరు పైడితల్లిని కొట్టారే- అప్పుడు ఫోనులో జరిగిన గోల ఏమిటో తెలుసా? డాక్టరుగారికొడుకు శివరావు పలికి "మాట్లాడుతున్నది ఏ. వి. ఎస్. రాయి" అన్నాట్ట. పైడితల్లేమో 'ఏ వీసెరాయో ఏటో నాకదంతా తెల్దండీ. డాటర్ గార్ని బేగి పిలవండి" అని గాభరా పడుతున్నాడు. ఈ మొద్దబ్బాయి చెప్పేట్టండీ:- "Daughter! whose daughter do you mean?- ఓ, డాక్టరుగారనా? ఆఁ... డాక్టరుగారూ ఎవరో కాల్ చేస్తే వెళ్లారు." మన బుద్ధావతారం మరి ఏడాకులెక్కువే చదివేడుగదా? "కాల్చేశారా? ఎవర్ని, ఎమిటీ?" అంటూండగానే వాడి గూబ గుయ్యిమనిపించేరు మీరు.

నేను నవ్వాను. ఆమెకి కావలసిందదే. కొంతసేపు కన్నబాబుకి బుద్ధులుగరపి దించింది. నర్సుతో అవీ ఇవీ మాట్లాడి కారెక్కాను. ఎప్పుడు వెళ్లినా భారతి నవ్వుతూఉండడం నన్ను మరింత దుఃఖితుణ్ణి చేసేది. మరణమాసన్నం అవుతున్నకొద్దీ భారతి నన్ను నవ్వించడానికి చేసే ప్రయత్నం అధికతరమవుతూ వచ్చింది.

కాని ఒకనాడుమాత్రం విచారవదనంతో ఉన్న భారతి 'ఏమండీ, ఇవాళ కన్నబాబు

రానన్నాడా నాదగ్గరకి?' అ నడిగింది ఒంటరిగా వచ్చిన నన్ను చూసి.

నేను సంకోచిస్తూ 'వొస్తాననే అంటాడు భారతీ కాని నేనే-' అని నీళ్ళునమిలాను.

'వొద్దన్నారా? ఎంతపనిచేసేరండీ! ఈ ఒక్కనాటికి బరువైపోయాడావాడు మీకు?' అన్నది భారతి నేను ఎన్నడూ విననంత వేదనాభరితకంఠంతో.

ఆపాదమస్తకం కంపించిపోతూ నోటమాట లేక తలవంచుకుని కూర్చున్నాను- కోర్టులలో హాజరయిన హంతకుడివలె.

భారతి నా అవస్థకి నవ్వుతూ 'అదేమిటండీ పాజహానుగారూ, ఊరికే వాణ్ణి చూడాలనే భ్రమకొద్దీ అలాగన్నాను. అవునుగానండి, నన్నొక్కసారి ఇంటికి తీసుకెళ్ళరూ? ఇంకా ఎందుకు నాకీ ఆసుపత్రిచెర?'-అన్నది.

భారతి నీ పరిస్థితిలో ఇంటికి తీసుకెళ్ళడమే! అని వొణికిపోయాను. పైకిమాత్రం 'ఎందుకు తీసుకువెళ్ళను భారతీ, తప్పకుండా తీసుకువెళ్తాను.' అంటూంటే ఆమె నవ్వింది. మాట మారుద్దామని 'అన్నట్టు భారతీ, రాజమండ్రిలోని మహిళాసముద్ధరణాలయంవారు బాగా విరాళంయిచ్చి తోడ్పడవలసిందిగా నన్ను కోరేరు. కాని నీ వొంట్లో ఇలావుండగా ఇహమీదట నేను పాడలేను భారతీ' అన్నాను.

భారతి ముఖం విషాదంతో నిండిపోయింది. 'తాటిచెట్టు ఎక్కవలసిన మిమ్మల్ని కడదాకా గెంటుదామన్నా, ఆదేవుడు నాకు అర్ధాయుష్షు చేశాడు. ఏవండీ, మీరిప్పుడే ఇలాగ దిగజారిపోతూంటే నా శవం గుమ్మందాటేక—'

'భారతీ!' అని అరిచాను ఆసుపత్రి అన్న సంగతి మరచి.

'—ఒకరాత్రి, మీ కళ్ళారా చూసేరు-సంఘందృష్టిలో పతితయైన అనాథ పడే బాధ అన్నీ. అలాటి నిర్భాగ్యురాళ్ళని ఉద్ధరించడానికి కంకణం కట్టుకున్నారు. ఆ ఉత్తమ లక్ష్యం మీ ముందుంటే మరింత పట్టుదలతో కళాసేవ చేసి పేరు ప్రతిష్ఠలు గడించొచ్చు. అదీగాక యీ కళా, ప్రజాసేవలలో క్రమంగా యీ దౌర్భాగ్యురాలిని మరిచిపోగలరు... అలా ఉలికిపడతారేవండీ? వియోగదుఃఖం కావ్యాలలో బాగానే వుంటుంది. కాని జీవితంలో అది అకర్మణ్యతకి దారితీస్తుంది... ఈ కొంచెం అనుభవంతోనే పతితస్త్రీల నుద్ధరించడం అంత తేలికగాదని తెలుసుకున్నాం. కాని ఏ మహత్కార్యమూ తేలికగాదు. ఒక మహత్కార్యం నెరవేర్చిన వారికి కలిగే ఆనందమూ తక్కువగాదు...అలా కన్నీళ్ళు కారుస్తారేవండీ? నేను మీ మనస్సు కష్టపెడుతున్నానా? ఏవండీ?...'

నేను దిగ్గునలేచి ఆమె చేతులని హృదయానికి హత్తుకుంటూ 'లేదు భారతీ లేదు. నీలాటి యోగ్యురాలికి భర్తగా వుండడానికి నా కర్హత లేదుగదా అని ఏడుస్తున్నాను. ఏది ఏమయినా నా నిశ్చయం విను భారతీ! నువ్వు నా కాదేశించిన కర్తవ్యాన్ని విస్మరించను. కళాసేవే నా పని. పతితలంతా నా అక్కచెల్లెళ్ళు... విన్నావా భారతీ?...' అంటూంటే చిరునవ్వుతో కళ్ళుమూసుకున్న ఆమె సంపెంగ రేకు రెప్పలపై మంచు బిందువుల్లాగ నిలిచాయి కన్నీటి చుక్కలు.

మద్రాసులో వేలాది శ్రోతలని ఉర్రూతలూగించి హర్షధ్వానాల మధ్య కారెక్కిన నా మనస్సుకిమాత్రం ఎంచేతో హాయి అనిపించలేదు. విశాఖపట్నం రాగానే కబురు తెలిసింది. బతికినన్నాళ్లు సుఖమెరుగని ఒక ఆత్మ విశ్రమించిందనుకుంటూ ఆసుపత్రికి వెళ్లగానే డాక్టరు సానుభూతి వాక్యాలు పలికి 'ఆవిడ దేహాన్ని ఇంటికి తీసుకెళ్తారా?' అ నడిగాడు. 'నన్నొక్కసారి ఇంటికి తీసుకెళ్ళరూ' అని నా హృదయంలో వినిపించగా 'తప్పకుండా' అన్నాను పైకి.

పువ్వులూ, పసుపుకుంకుమలతో అలంకరింపబడిన భారతి భౌతిక దేహం 'అన్నపూర్ణా భారతీ భవనం' నుంచి వెలువడి స్మశానానికి వస్తూంటే అంతా ఆ దృశ్యాన్ని కారుణ్యాశ్చర్యానందాలతో తిలకించేవారే. అగ్నిపట్టుకు ముందు నడుస్తున్న నేనుకూడా రెండు మూడుసార్లు తల వెనకకి తిప్పకుండా ఉండలేకపోయాను.

'అక్కడికి వెళ్లేవరకూ వెనుదిరగకూడదు బాబూ' అని గుర్తుచేశాడొక బ్రాహ్మణుడు.

అవును. కార్యదీక్షాపరురాలు భారతి ఆజ్ఞా అదే.

* * *

ఆనాడు మిత్రాస్తమయసమయాన మంచిగంధపుచెక్కల జ్వాలపైకెగసి, మధురగాయని భారతి కంఠం బూడిదైంది. లేదు లేదు. అది నా వీణాతంత్రులలో సజీవమై లోకానికి మరింత శ్రావ్యంగా వినిపించనున్నది. నా సోదరీమణుల కృతజ్ఞతాసూచక వాక్యాలలో వినిపించనున్నది.

★ ★ ★

'పడవొడ్డెక్కింది బాబూ' అన్న పడవవాడి హెచ్చరికతో నా ఆలోచనలకి స్వస్తి చెప్పి దిగాను. పొద్దుచూస్తే ఇంకా చాలా వుంది. నా ముందుదారి ముళ్లూ పొదలతో కూడినదీ, సుదీర్ఘమైనది. చీకటిపడే లోపున నేను నా గమ్యస్థానాన్ని చేరుకోవచ్చు, చేరుకోలేకపోనూవచ్చు కూడ. ధైర్యంతో ముందు అడుగువెయ్యడమే నా వంతు. ★

తృతీయ బహుమానం పొందిన కథ

# మనిషి త్రో మహిషి

శ్రీ అవసరాల రామకృష్ణరావు

'ఆదేమిటే సుందరం అలాకూచుంటావు, రేపట్నుంచేగా మీ 'హాఫియర్లీ' పరీక్షలు. లే, లేచి చదువుకో' అని శాంతమ్మ కిటికీలో వీధి వైపు చూస్తూ కూచున్న కూతుర్ని చూసి ఒక్క కేకేసింది వంటింట్లోంచి. సుందరం కదల్లేదు-లేనలేదు- అలాగని నిద్రపోడంలేదు. అలా ఆలోచిస్తూకూచుంది. వంటపని పూర్తిచేసుకుని తలుపుజారేసి తల్లి వచ్చి వెనక నిలబడ్డం ఆమె ఎరగదు. 'ఆడపిల్లై పుట్టేకంటె అడవిలో మానైపుట్టడంమంచిది. అందులో లేనివాళ్లింటో పుట్టేకంటె లేకుండాపోవడం మంచిది.' అంది తనలో తను అనుకున్నట్టు. శాంతమ్మ ఈ మాటలువింది. చిన్నపిల్ల పెద్దసంగతులు మాట్టాడ్డం విచారంకన్న ఆమెకి ఆశ్చర్యమే ఎక్కువ అనిపించింది.

'సుందరం - ఇటుతిరుగు - ఎందుకదీ, ఏమొచ్చిందీ?' అంది లాలనగా.

'ఇంకా ఏమిటమ్మా? నావయసు పిల్లలందరూ పట్టువోణీలువేసుకుంటున్నారు. జార్జెటు పరికిణీలు తొడుక్కుంటున్నారు. నైలాను రిబ్బన్లు పెట్టుకుంటున్నారు. నేనూ ఉన్నాను, ఎందుకూ? ముతకవాయిలు పరికిణీ, ముదరరంగు కండువా, ముష్టిరకం ఊలుముక్క జడా-మూడు రోజులైనా అవే. నాన్నతో రెండు శాటిన్ గుడ్డలు తెచ్చిపడెయ్యమని చెప్పి ఎన్నాళ్ళయింది నువ్వేచెప్పు! ఇవాళ 'లీజర్లో' గాజులవాడొస్తే స్కూలుకి పిలిచాం. మంచిరకం ఎఱ్ఱ రబ్బరుగాజులు అందరూ సరదాగా వేయించుకున్నారు. పోనీ నా ముష్టి మొహానికి బంగారుగాజులు లేకపోతేపాయె - రెండు జతల రబ్బరుగాజులకేనా దిక్కుందా? చెప్పుకుంటే సిగ్గుచేటు; చేతిలో కాణీ లేదు. పాపం జానకి తనదగ్గర డబ్బుంటే రెండు జతలు నాకు వేయించింది. 'నలుగురూ చందా వేసుకుని మరో రెండు జతలు వేయించండర్రా పాపం' అంది కోమటిది. నా ఒళ్లు చచ్చిపోయింది. గాజులు తీసి దాని మొహాన్ని కొట్టేను. ఎందుకొచ్చినబతుకమ్మా - రేపట్నుంచీ నే బడికి వెళ్ళనమ్మా.' సుందరం తల్లిని కౌగలించుకుని వెక్కివెక్కి ఏడ్చింది.

'ఊరుకో తల్లీ - పరీక్షలముందు ఇవన్నీ ఎందుకు? నేను నాన్నతో చెప్పి అన్నీ కొనిపిస్తాగా... అందరూ ఉన్నవాళ్లే ఉంటారా? మనకంటె లేనివాళ్ళు ఎందరులేరు?'

సుందరంకి ఈ ఓదార్పు ఏమీ నచ్చలేదు. తోకతొక్కిన త్రాచులా లేచింది. 'మనకంటె కూడా లేనివాళ్ళుంటారా? ఎవరున్నారు? ఎవ్వరూలేరు...... ఇంత అర్థాన్నం ఎక్కడా ఉండదు... ఇలారా... ఇలాచూడు' శాంతమ్మ కిటికీ దగ్గరకి వచ్చి చూసింది. ఆ వస్తున్నది తాసీల్దారుగారమ్మాయి వసంత.

'ఏముందే చూడ్డానికి?'

'అవును, ఏముందీ? నీకేం కనిపిస్తుంది గనక? చూడు ఆపిల్ల తొడుక్కున్న జాకట్టు. ఫారెన్ వెల్వెట్; తెలుసా? ఆ పరికిణీ మైసూరు జార్జెట్ది. ఆ ఎఱ్ఱరాళ్ళ నెక్లెస్ చూడు. ఇంతకీ పెట్టిపుట్టాలి.'

'అయితే ఏమంటావే?'

'అబ్బే ఏమీ అనను - ఆపిల్లా నాతోటి ఫోర్తుఫారం చదువుతోందనీ - నా వయస్సుదే అనీ - మా కోరికలు యించుమించు ఒకలాగే ఉంటాయనీ గుర్తుంచుకో.'

శాంతమ్మ వెలవెలబోయింది!

* * *

'దీని ఆలోచన లేమిటండీ మరీ యింత అంత రిక్షాన్ని పరిగెడుతున్నాయ్? ఎలాగండీ?' అంది శాంతమ్మ ఆఖరి పిల్లాణ్ణి జోకొడుతూ. రంగనాథం ఫైలుమూసి తలెత్తి ఇలాఅన్నాడు.

'నేనేం చెయ్యను? ఎన్నిసార్లు బుద్ధిచెప్పినా అది అంతే. ఆరేళ్ళప్పుడు దాని పుట్టిన దినానికని అప్పుజేసి కట్టుగుడ్డం తెచ్చియిస్తే ఆదేం చేసిందో జ్ఞాపకముందా? పక్కింటి 'బాబిగాడి' లాంటి కారు తేలేదని గుడ్డాన్ని ఆరుగుమీంచి తోసెయ్యలేదూ? అప్పుడైతే చిన్నపిల్ల కనక లెంపకాయ కొట్టేను. పదిహేనేళ్ళు వచ్చాయి; యిప్పుడేం చెయ్యను?

శాంతమ్మ ఇవన్నీ విందో లేదో తెలీదు. కావిడిపెట్టిలోనుంచి వెండిచెంబు తీసింది.

'చూడండి—మా అమ్మ నాకిది యిచ్చింది. ఇదెలాగా దానికి యిచ్చేదే. కుర్రప్రాణం దుఃఖపడ్డాక ఎప్పుడో ఎందుకు? ఆడపిల్ల అన్న తరువాత ఆశలు లేకుండా ఉంటాయా? ఇది అమ్మెయ్యండి; ఎనభైతులాల చెంబు; ఓ యాభై



అయినా వస్తాయి. రెండు ఖరీదయిన సిల్కు గుడ్డలు తీసుకురండి.'

రంగనాథం మాటాడలేదు. శాంతమ్మ కోంగుతో కళ్లద్దుకుంది. 'మనం ఎలాగా లేనివాళ్లమే అయాం. పిల్లలకేనా తృప్తి లేకపోతే ఎలాగు?'

'నీకేమైనా మతిపోయిందా శాంతా, నెలకు నేను తెచ్చేది నూరు రూపాయిలైనా—ఒక్క వస్తువయినా లేక పోయిందని నువ్వు—ఒక్కనాడైనా అనుకున్నావా? రోగాలతో, పురుళ్ళతో, బంధువులతో గుట్టుగా కాలక్షేపం చెయ్యడం నేర్వాలిగాని మన మధ్యతరగతి కుటుంబీకులు కావాలన్నవన్నీ రమ్మంటేఎలా?'

'చాల్లెండి; మనం పెద్దవాళ్ళం కాబట్టి సరి పెట్టుకుంటాం. పదిమందితో తిరిగే పిల్లలు-వాళ్ళ కేం తెలుసు? చెంబు అమ్మెయ్యండి'. ఈమారు రంగనాథం 'చ్చ్రు' మన్నాడు.

'ముందా వెండి చెంబు దాచేస్తావా లేదా? నిజం చెప్పవలిసొస్తే సుందరాన్ని చదివించే స్తోమత మనకుందా? ఎంతసేపూ బట్టలమీదే గాని దానికి చదువుమీద దృష్టుందా? ఈనాడు రెండు సిల్కు గుడ్డలు తెస్తే తృప్తి పడిపోతుందా? ఇంకేం లేదనుకోదా? మంచి నీళ్ళు తాగడానికి ఆ వేళకి అక్కడికొచ్చిన సుందరానికి ఆ తరువాతి మాటలు చెవులో పడ్డాయి.

'ఇంతకీ దీని కిప్పట్లో బుద్ధొచ్చే దారి నాకేం కనిపించడంలేదు లే, ఎవడుకట్టుకుంటాడో వాడే బుద్ధి చెప్పాలి.'

సుందరంకి ఒళ్లు మండింది.

'సంపాదించడం చాతకాని మొగాళ్లు యింతకంటె ఏమనుకుంటారు? అవును - నిజమే. ఆడదాన్ని, పుట్టింట్లో నా పెత్తన మేముంది? నా సుఖమంతా అక్కడే! అక్కడే!!'

ఆమె మనసులో తొలిసారి మెఱుపులు మెఱిశాయి.

'కట్టుకున్నవాడు నా బంగారుతల్లిని కాలదన్నుకుంటాడా? కళ్ళకద్దుకుంటాడు. కావలసింది కొనిపెడతాడు.' అంది తల్లి.

'అలాగే...అలాగే...' అన్నాడు తండ్రి వెటకారంగా.

'కాక? నీలాగే అనుకున్నావా?' అనుకుంది సుందరం. ఆరాత్రి ఆమెకి ఓపట్టాన నిద్రపట్టలేదు. పట్టేక తియ్యని కల వచ్చింది. ఎన్ని నగలు! ఎన్ని చీరలు!! ఇవన్నీ నాకేనా? అనుకున్నది. నాలుగు పెట్టెల్లో కుక్కి సర్దినా ఇంకా నగలు మిగులే అయ్యాయి! మూడు బీరువాల్లో నొక్కి పెట్టినా ఇంకా చీరలు మిగిలేపొయ్యాయి!! ఆమె లేతమనస్సు ఒక్కసారి అంత ఆనందాన్ని భరించలేకపోయింది. ఆమెకి తెలివి వచ్చేసింది. ఆమె ముఖం అంత ఆనందంగా ఉండడం తల్లి ఈమధ్య ఎప్పుడూ చూళ్ళేదు.

'ఎంత చక్కగా ఉన్నావు తల్లీ! ఈ చక్కని ముఖానికి తగిన నగా, బట్టా పెట్టి అలంకరిస్తే ఇంకెంత బాగుంటావో! ఆడపిల్లమోజు మొగమహారాజు కేంతెలుస్తుంది! అయినా అదేం పెద్ద కోరింగిగనక! మంచి బట్టా, నగాను!' అంది శాంతమ్మ.

'అవును. నేను పెద్ద కోరిందేమిటి గనుక! అందరూ ఆశించేదే' అనుకుంది సుందరం. ఆమె భావం స్థిరపడిపోయింది.

'లేచి చదువుకో తల్లీ' అంది శాంతమ్మ. సుందరం లేచింది. కాని చదువుకోలేదు. కోరిన నగ, కావలసిన చీర - అంతకుమించి ఆమెకు ఏదీ అవసరమనిపించలేదు.

"ఇంతకన్న ఆడది నేర్చుకోవలసిన చదువేముందిగనుక?" అనుకుంది సుందరం.

## 2

"సిగ్గు లేకపోతేసరీ - అయినా కోడవలికి లేకపోయినా గోంగూరకయినా ఉండొద్దా? వాళ్ళు పెడితే పెట్టేరు. నువ్వెలా పుచ్చుకున్నావే అమ్మా?" అని అడిగింది సుందరం.

"ఊరుకోవే బాబూ - పెళ్ళికూతురివి. నువ్వసలు మాటాడకూడదు" అని నోరు నొక్కింది శాంతమ్మ.

"ఏమిటే చెల్లీ ఏమిటదీ?" అని ఆరా తీసింది సుందరం పెత్తల్లికూతురు శేషమ్మ.

"ఏంచెప్పను శేషూ, మావాళ్ళు మంచివాళ్ళు కాబట్టి సరిపోయిందిగాని లేకపోతే అక్కడ అల్లరేనా? ప్రధానానికి మీ అత్తారు ఏమిచ్చారు చెప్పు? నూటయాభైయిచ్చి కోయంబత్తూరు చుట్టు జల్తారు చీర పెట్టేరా, లేదా? ముక్కుమీద గుద్ది మూడువేలూ ముందు పుచ్చుకుని వీళ్ళు పెట్టిం దేమిటి? పదిహేను రూపాయిల 'వరయూరు' చీర పెడ్తారా?'

'అ-వ్వ! ఊఁ చెప్పు, చెప్పు'

'ఇంకేం చెప్పను శేషూ? అంటే అనకూడదుగాని ఎంత కాసుకు గతిలేనివాళ్ళయినా నగలు పెట్టేటప్పుడు యాభైరూపాయిల చీరయినా పెడతారంటూవా?'

'నా మొహంలాఉంది నీ సందేహం. మా చిన్నాడబొడుచు పెళ్ళికి ఇలాగే 'కంత'కి నూర్రూపాయిల చీరపెడితే వియ్యపురాలు ఏం చేసిందో తెలుసా? కాళ్ళకిందేసి తొక్కేసింది!'

'అవునా మరి? పన్నెండున్నర పెట్టి గ్లాస్కో చీరపెట్టేరమ్మోయ్.'

'పెడితే పెట్టేరు, ఏమంటూపుచ్చుకున్నారూ? నగలేం పెట్టేరేం?'

'ఏవో పెట్టేరులే కన్నీళ్ళతుడుపుకి. అయిదు పేటల చంద్రహారం ఒకటీ- రెండు జతల గాజులూ- ఒక నెక్లెసూ- బంగారానికి ఓ మెఱుపూ లేదు పసుపూ లేదు. ఏ చవకరకమో గాని' ఈసారి శాంతమ్మ ఊరుకోలేకపోయింది.

'ఏమే సుందరం, ఊరుకున్నకొద్దీ పెద్ద కబుర్లు ఎక్కువై పోతున్నాయే! మనకున్న ఆస్తిపాస్తులికి వందేళ్లు తలక్రిందులా తపస్సు చేసినా ఇలాంటి సంబంధం దొరకదు. చాలు గాని ఈపాటికి నోరు మూసుకు ఊరుకో.'

తల్లి ఇలా అందని సుందరం మూడ్రోజులు ఆమెతో మాటాడలేదు.

* * *

'ఎందుకు సుందరీ అనవసరంగా బాధపడతావ్?' అని అడిగేడు ఆమెభర్త శేషగిరి. గవర్నమెంటు హాస్పటల్లో కంపౌండరీచేస్తున్న అతనికి మందులు కలపడమేగాని మాటకలపడం చేతగాదని సుందరి ఉద్దేశం?

ఆమె ఆస్ట్రేలియన్ డీసెలు ఇంజను కూతలా విరుచుకుపడింది. 'నేనేం బాధపడ్డాను? అయినా నేను బాధపడితే మీకేం? నా మాటమీద కొంచెమేనా మీకు గురి ఉంటే కద? నన్ను సుఖపెట్టాలనే కాస్తయినా తోస్తేకద! నా ఆశలన్నీ మీమీదే పెట్టుకున్నాను. నా కోరికలన్నీ తీరుస్తారని ఆశపడ్డాను. నా అదృష్టం మీరే అనుకున్నాను. నా సరదా- ఒకటీ- ఒక్కటేనా మీరు తీర్చేరా? మీరు- మీ ఉద్యోగం- ఏమైనా కాస్త టైముంటే మీ పుస్తకాలు. అంతేగాని తన సర్వస్వం వదలి మీదగ్గిర శాశ్వతంగా పడి ఉండడానికి ఒక ఆడది వచ్చిందనీ- ఆడదన్న తరవాత దానికీ ముద్దూ ముచ్చటూ అంటూ వుంటుందనీ- అది తీర్చాలనీ ఈ అయిదేళ్ళలో ఒక్కసారి- ఒక్క సారేనా అనుకున్నారా?'

శేషగిరి అనుకున్నది వేరు.

'ఆహా! చెంచీభర్తలు ఎంత అదృష్ట వంతులు!' అని. ఆమెతో వాదించడం అవివేకం అని అతనికి తెలుసు. అయినా ఊరుకోలేక పోవడం వ్యసనం అనీ అతనికి తెలుసు!

'చూడు సుందరీ! చాలామంది మొగాళ్ళకి ఊళ్లో ఉన్న పేరు ప్రఖ్యాతులు ఇంట్లో వుండవు. అందులో నేనొకణ్ణి. ఏంచెయ్యను! నీ మనసు వికసించడానికి తగినన్ని ప్రయత్నాలు చేస్తున్నాననే నా నమ్మకం. లైబ్రరీ నుంచి ఎన్నో పుస్తకాలు తెస్తున్నాను. నువ్వు చదవకపోతే నే నేం చెయ్యను? ప్రైవేటుగా నువ్వు పరీక్షకి ఎందుకు కూచోకూడదు? నీకు ఎన్ని చీరలు కొంటే తృప్తి అవుతుంది చెప్పు? అయినా మనిషికి నిజమైన అలంకారాలు అవేనా?

'అబ్బే కాదు, కాదు! మంగలి కత్తులూ, మంత్రసాని మందులూ, ఇవే! అవున్లెండి, మీలాంటి చేతకాని మొగాళ్ళని కట్టుకున్నాక నాలాంటి ఆడకూతుళ్ళు ఉద్యోగాలే నా చెయ్యాలి, ఊళ్ళేనా ఏలాలి!' శేషగిరి యీ మాట పూర్తయేసరికి నాలుగు చుక్కల పిల్లవలలో ఉన్నాడు. పెళ్ళాల పెదవి పెనుతుపానులో తడవడానికి ఇష్టపడక చాలా మంది పేకాట చూరుకింద చేరతారు. అందులో శేషగిరి ఒకడు.

నాలుగేళ్ళ పిల్లాడికి అన్నం తినిపిస్తోంది సుందరి. పొరుగింటి పుల్లమ్మ గ్లాసెడు పంచదార అప్పుకువచ్చి,

'ఏం కూతురా, అలా విచారంగా ఉన్నావ్?' అని పరామర్శించింది. 'ఏమిటో పిన్నీ, ప్రపంచంలో యిందరి కొచ్చింది; నాకు రాదు చావు.' 'అయ్యయ్యో, మంగళారపూటా ఏమిటా మాట? తప్పు, తప్పుతల్లీ; ఇంతకీ నీకేం లోటు కూతురా... ఒక్కగానొక్క కొడుకు.. అల్లుడేమో సంపాదనాపరుడు...'

'ఆ... గొప్ప సంపాదనే! చచ్చీ నాటికి నూట ఏభై అందుకుంటేను! ఇంతెందుకు పిన్నీ- మీ అల్లుడికి నామాట మంచిమాటే నా పడదు గదా! ఇంతోటి సంపాదనలో దానాలు కొన్ని. ప్రతిషష్టికి మావఁగారికి పదీ వెళ్ళిపోవలసిందే గదా!'

'అయినా ఒక్కమనిషికి - ఆపల్లెటూళ్లో - పదిరూపాయిలెందుకమ్మా? 'అలా అడిగేవాడు లేక... మిగిలిందేనా తిన్నగా చేతికిస్తారా? ఎన్నిదానాలు, ఎన్నిధర్మాలు! ఈమధ్య ఏమయిందా, నాతో చదువుకున్న సావిత్రి ఈ ఊళ్లో కనబడి పేరంటానికి పిల్చిందిలే. ఆయిల్లూ ఆ మేడా చూస్తే మళ్ళీ మనింట్లో అడుగెట్టడానికి నాకే తల తీసేసినట్టయిందనుకో. ఆ బట్టలూ ఆనగలు చూస్తే ఒళ్ళు చచ్చిపోయినట్లయిందనుకో. ఎందుకూ? నేనూ ఉన్నాను. 'తనూఓ మనిషేనా? తవుడూ ఓ రొట్టేనా?' అన్నట్టు. కాపురానికివచ్చి పదేళ్ళుఅయింది. ఓరవ్వల ముక్కుపుడక ఎరుగుదునా? ఓటీస్యూ చీర ఎరుగుదునా?'

" నేను కొంటానమ్మా నీకు చీర " అన్నాడు హఠాత్తుగా బాబు. "కళ్ళముందు కనకొన్ని కానుకోలేక ఊరంతా వెతుకుతావెందుకు వెర్రితల్లీ! నాలుగుగోజులు కళ్ళు మూసుకుంటే ఈ కుర్రకుంక నీ ఒళ్ళు నింపెయ్యడుటమ్మా!" అంది పొరిగింటావిడ. తన ఆశలన్నీ మూటగట్టి - బాబుని ముద్దెట్టుకుంది సుందరం. "పెనిమిటి చాటు పెళ్లాన్ని... ఆడదాన్ని... నాకు స్వాతంత్ర్యం ఏముంది? ఎక్కడో వెతికేను! నా సుఖమంతా ఇక్కడే! ఇక్కడే!! నాబాబు, నా బంగారుకొండ, నా చిలక పిట్ట తండ్రి, కన్నతల్లిని నాకంటె వాడిసంపాదనకి హక్కుదారు లెవరు?'

ఆమె మనసులో వెన్నెలలు విరిశాయి. ఆమె ముఖం చూసి పిన్నిగారు "అలా నవ్వితే ఎంతబాగున్నావు కూతురా. తగిన సంరక్షణ లేక గాని!" అంటూ పంచదార పట్టుగెళ్లింది.

## 3

'బంగారుకొండ' ఒక గొప్పయింటి అల్లుడై సమర్థుడై సంపాదనాపరుడయ్యేసరికి ఆ యింట్లో వచ్చిన ముఖ్యమైన మార్పు శేషగిరి పరారయి పోవడం. కొడుకు చదువు పూర్తయేదాకా యించుమించు ఉన్నాడు. ఒకరాత్రి మొగుడూ పెళ్లాం ఏంవాదించుకున్నారో తెల్లారేసరికి అతడు లేడు. అస్తమానూ అనేవాడు సుందరితో "కృషిచెయ్యకుండా ఏదీ కోరకు. ప్రయత్నం లేకుండా ఫలితం కోసం చూడకు. శ్రమలేనిపారితోషికం ఆశించకు. నువ్వుచేసేది అర్ధరూపాయ్ చాకిరీ. నువ్వుకోరేది లక్షరూపాయ్ లాటరీ!'... బాధ్యతలన్ని తీరిపోయాక భరించలేక ఏకాశీయో పోయిఉంటాడని కొందరంటారు.

ఏదైతేనేం ఇది సుందరమ్మకి 'చేతకాని మొగాడు చేసే పనిలా' కనిపించింది. ఆమె

చలించలేదు. కొడుకుమీద ఆశలు ఇన్నాళ్లూ పెంచుకుంది. కోడలువస్తే అడ్డుగోడలు లేవవా అని ఆమె శంకించకపోలేదు. కాని 'నా బాబు నావాడు! నేను వాడి కన్నతల్లిని! నాకున్న అధికారం ఎవరికుంది? వాడు ఎమ్మెస్సీ స్కాలర్‌షిప్‌తో చదివి ఫస్టుక్లాసులో ప్యాసయినాడు. కన్నతల్లిని కారులోంచి దిగనిస్తాడా? ఇంట్లో అయినా పట్టుచీరతప్ప కట్టనిస్తాడా? శీతాకాలంలో అయినా 'శీలింగు ఫేను' ఆర్పనిస్తాడా? వెయ్యిరూపాయిల తక్కువ నగ పెట్టనిస్తాడా?' ఇలా ఉండేవి ఆమె ఆలోచనలు.

★ ★ ★

ఆ కోరినదివసం రానేవచ్చింది. ఆ కోడలు తిలకం రానేవచ్చింది. తరువాత రెండ్రోజులు కోడలూ అత్తా ఏమనుకున్నారో తెలీదు. 'కేంపు' నుంచి బాబు రాగానే ఇద్దరూ చెరో గంటా మాటాడేరు. తెలివైన బాబు ఇద్దర్నీ ఒకేసారి సమావేశపరిచాడు. 'చూశావా, చూశావా బాబూ నీ పెళ్లాం నన్ను ఎన్ని మాటలందో! 'ఇది నాయిల్లు' అంది. 'నువ్వు పైదానివి' అంది. 'నేనూ నా మొగుడూ ఒకటి' అంది. 'నాదే అధికారం' అంది. బాగుందా నాయనా! ఇరవై అయిదేళ్ళు పెంచాను. నీమీద ఆశ పెట్టుకున్న దిక్కుమాలినదాన్ని. నేను పడవలసిన మాటలేనా ఇవి?' అంది ఏడుస్తూ. 'దాని మాటల్లో ఒక్క ముక్కకూడా అబద్ధం లేదమ్మా, అన్నీ నిజమే' అని మొదలెట్టాడా 'చిలకపిట్ట తండ్రి.'

'నిజమే - ఈ ఇల్లు దానిది కాక మరెవరిది? మనయిల్లు 'నాది' అని నువ్వనుకోలేదా?' 'నువ్వు పైదానివి' అనడంకూడా నిజమే. నిజానికి మనిద్దరం పైవాళ్ళమే. నేను తప్పక పోవచ్చు. ఇక ఇష్టం లేకపోతే అత్తగారు ఎప్పుడూ పైదే. 'నేనూ నా మొగుడూ ఒకటి' అనడం పతివ్రతాలక్షణం కాదంటావా? ఇంట్లో అధికారం ఇల్లాలిదికాక యింకెవరిది? నువ్వు ఇరవై అయిదేళ్ళు నన్ను పెంచావు సరే. తను ఏభైఏళ్ళు భరించాలేమో ఆలోచించావా? చూడమ్మా లేనిపోని ఆశలు పెట్టుకుని నువ్వు బాధపడకు, ఒకళ్ళని బాధ పెట్టకు. అన్నిటికీ పనిమనుషు లున్నారు. పూజా పునస్కారాలకి పాతికరూపాయిలు ఇస్తాను, హాయిగా ఖర్చు పెట్టుకో.' సుందరమ్మ బుర్రలో అగ్నిపర్వతాలూ, ఆటంబాంబులూ ఒక్కమాటు అంటుకున్నాయి. పాతికరూపాయలు! ఇరవై అయిదేళ్ళు ప్రేమగా పెంచిన తనకోరిక విలువ పాతికరూపాయలు!! తనకు జ్ఞానమొచ్చిన దగ్గిరనుంచీ అంటే ఏభై అయిదేళ్ళ వయస్సున్న తన మనసులో మనసు మూల్యం నెలకి పాతిక!!! రవ్వగుద్దులు, పట్టుచీరలు, కారు షికార్లు... అన్నీ...అన్నీ కలిపి నెలకి భరణం ముష్టి పాతిక!!!

రక్తనాళాలన్నీ తెగిపోయేటట్టు ఆమె ఒక్క కేక వేసింది. చనిపోయిన తల్లినే తలిచిందో, పారిపోయిన భర్తనే పిలిచిందో తెలీదు. నాలుగు యినపెట్టెల నగలూ, నాలుగు వేళ్ళ వెడల్పున్న అసలు జరీఅంచు చీరలూ - తీరని కోరిక తీర్చుకోడానికేమో ఆ దిక్కులేనిది దిక్కుల్లో కలిసిపోయింది! *

చతుర్థ బహుమానం పొందిన కథ

# ★ నేను! ★

శ్రీ సిద్ధాంతి మల్లికార్జునం

అప్పుడే పదికొట్టింది. ఊరంతా మాటు మణిగింది. ఎంతప్రయత్నించినా కళ్ళు మూత పడటంలేదు ఏవేవో ఆలోచనలు, ఎక్కడెక్కడివో జ్ఞాపకాలు తెలీకుండానే మనస్సును వేధిస్తూన్నాయి.

ఏదైనా గ్రంథపఠనమే దీనికి మందనిపించింది. వెంటనే లేచి ఎన్నాళ్ళనుంచో ప్రాణప్రదంగా కాపాడుకుంటూవస్తున్న పుస్తకాల పెట్టెముందు కూర్చున్నాను. ఒక్కొక్క పుస్తకమే తిరగేసి చూస్తూంటే పదేళ్ళనాటి డైరీ చేతికొచ్చింది. అట్టలు చెదలు తిన్నాయిగాని లోపలి కాగితాలు మాత్రం చెక్కుచెదరలేదు.

ఎంతకాలం దొర్లిపోయింది! ఎన్నికథలు జరిగాయి! ఎన్ని కాపురాలు పచ్చగా పెరిగి పెద్దవైనాయి! ఎన్ని నలిగి నశించాయి!...ఏమిటో! ...మహాత్ములు చెప్పినట్లిదంతా మానవబుద్ధి కతీతమైన మహామాయ!

పది సంవత్సరాలనాటి డైరీ చూడగానే నాజీవితరథం పది సంవత్సరాలు వెనక్కి పరుగెత్తింది. కాని నాహృదయం మరో పది సంవత్సరాల జీవితభారంతో క్రుంగిపోయింది!

డైరీ తీసుకొని గోడ కానుకొని కూర్చున్నాను. నాకు ఎడమువైపున చిన్న బల్లమీద లాంతరు వెలుగుతూంది. నాపక్కనే చాప మీద పడుకున్న గోపీ మొహానికి మెరుగులు దిద్దుతోంది ఆ వెలుగు. ఆ వెలుగులో గోపీ మొహం, చంద్రబింబంలాగా ఎలా ఎంచక్కగా వుందో! గోపీ అంతా వాళ్ళ నాన్నే! ఆయన రాసిందే యీడైరీ.

దాన్ని తిరగేస్తూంటే ఏవేవో మాసిపోయిన సంఘటనలన్నీ మరోసారి సినిమాదృశ్యాల్లాగా నాకళ్లముందు మెరుస్తూన్నాయి. ఆ పేజీదగ్గర కొచ్చాను! దానిమీద సరీగా యివ్వాళ తారీఖే వేసుంది. ఎందుకో దాటోసంగతులన్నీ చదవాలనిపించింది తీరిగ్గా. చదివాను. అంతే! ... స్తంభించిపొయ్యాను. ఆకథంతా కళ్ళలో మెదలడం మొదలెట్టింది.

మధ్యాహ్నం ఒంటిగంటైంది. గదిలో పడుకొని ఏదో నవల చదువుకుంటున్నా. ఎవరో గబగబ తలుపు తట్టిన శబ్దం హఠాత్తుగా వినిపించింది. ఉలిక్కిపడి లేచి తలుపు దగ్గరికెళ్లాను. గడియతీయటానికి జంకుతూ 'ఎవర'ని ప్రశ్నించాను. జవాబు రాలేదు. కాలితో తలుపును తన్నిన శబ్దం వినిపించింది. నిజంగా ఆ తన్ను నా గుండెలమీద తన్నినట్లనిపించింది. గుండె



దడ జాస్తయింది. ఎవరో పట్టపగలే దోపిడీ చెయ్యటాని కొచ్చారన్న ఆలోచన మనసులో మెదిలింది. అంతే! కొయ్యబారిపొయ్యాను. ముచ్చెమటలు పోశాయి. నాలుక పడిపోయింది. ఆపాదమస్తకం గడగడ్లాడిపోతోంది శరీరం...మళ్లీ ఒక తన్ను! ఒక్కక్షణం ఆలస్యమైతే తలుపు విరిగిపోను...చెట్టులా అక్కడే పాతుకుపొయ్యాను. తల పనిచెయ్యడం మానుకుంది...కాని ఎక్కడో ఏదో కాస్తంత ధైర్యం మేలుకొన్నది. అప్రయత్నంగా నా చెయ్యి గడియ తీసి తలుపు తెరిచింది.

ఆయన కనిపించారు!!...అబ్బబ్బ! ప్రాణాలు లేచివచ్చాయి!...ఏమిటో!! జీవితంలో అడుగడుగునా అయినదానికి, కానిదానికి కూడా భయమే!

ఆయ నెప్పుడూ యింత తొందరగా రారు. ఇవ్వాళ విశేష మేమిటో అర్థం కాలేదు. లోపలి కొచ్చారు. వేషం విప్పుకొని కుర్చీలో కూర్చున్నారు. మొహ మెందుకో చాలా గంభీరంగా వుంది. మంచినీళ్ళు పట్టుకొచ్చి దగ్గర నిలుచున్నాను. తాగారు. నిట్టూర్పు విడుస్తూ కుర్చీలో వెనక్కి వాలారు...ఏదో ఓ పెద్ద ఆందోళన బాధిస్తున్న సూచనలు, ఆయన మొహంలోనేగాదు, ప్రతి కదలికలోను కనిపిస్తున్నాయి. ఉండబట్టలేక అడిగేశాను.

"అట్లావున్నారేం?...ఒంటో బాగాలేదా?"

జవాబివ్వలేదు. జేబీలోనుంచి ఓ కాగితం తీసిచ్చారు. ఏదో ఆఫీసుకాగితం. ఇంగ్లీషులో వ్రాసుంది. దాన్ని చదువుతూంటే అలాగే వణికిపొయ్యాను. కళ్ళు తిరిగిపొయ్యాయి. కాగితం కిందపడ్డది.

"ఏమిటిది?" బెదిరిపోతూ, అడిగాను.

"ప్రారబ్ధం." అన్నారు.

అంటూనే చివాలున లేచి ఆకాగితం మడిచి జేబీలో పెట్టుకొని ఎక్కడికో వెళ్లారు.

ఇక నా మనసు మనసులో లేదు. మేము ఆ వూరొచ్చి మూడేళ్లైంది. ఈ మూడేళ్ళలో ఆయనలాంటి మేజిస్ట్రేటు అంతవరకు ఆ వూరికి రాలేదని నలుగురు చెప్పుకునేవారు. అసలు ఆయన తరహాకూడా అంతే. ఎప్పుడూ ముక్కుకు సూటిగా పొయ్యేవారు. తనేమిటో, తన పనేమిటో! ఆఫీసు, యిల్లు తప్పనిస్తే చివరకు క్లబ్బుకైనా వెళ్ళేవారుకాదు. ఇంతెం

దుకు, ఆయన చాలా కచ్చితమైన వ్యక్తి... కాని చాలనిరోజులొస్తే బలవంతమైనసర్పం కూడా చలిచీమలచేతజిక్కి శల్యమౌతుంది! ఇది ప్రకృతిసిద్ధం.

సుమారు నెలరోజులక్రితం పెద్దకూనీకేసొకటి విచారణకొచ్చింది. ఆకథంతా ఓనాడు నాతో చెప్పారు.

"చాలా విచిత్రమైన కేసు...ఇంతవరకు యిలాంటిది నేనెక్కడా వినలేదు, కనలేదు." అన్నారు.

"మనదేశంలోకూడా అలాంటినేరాలు జరుగుతాయంటారా?" అన్నాను.

"జరక్కేం? కనిపించేటంత న్యాయంగా, ధర్మంగా బతుకుతున్నారంటావా ప్రజలు?"

"ఎందుకులేరు."

"ఉంటే మా ఉద్యోగాలు, యీ న్యాయస్థానాలు లేకనేపోను." అన్నారు.

"అయితే లేనే లేరంటారా?"

"ఉండొచ్చు, వేళ్ళమీద లెక్కపెట్టుకోడానికో నలుగురు."

"అలా ఒప్పుకోండి." అన్నాను నావిజయానికి పొంగిపోతూ.

"ఏమైనా యిదో విచిత్రమే."

"పోనీ చెప్పండి." అన్నాను ఆ సంభాషణ నంతటితో తెగేస్తూ.

"ఏ సందర్భంలోనైనా ఒక స్త్రీ తనభర్తను నిలువునా హత్యచేస్తుందంటావా?" అన్నారు కొద్దిగా నవ్వుతూ.

నిర్ఘాంతపొయ్యాను.

"హాస్యమాడుతున్నారా?"

"హత్యలతో హాస్యాలేమిటి?" అన్నారు.

"నమ్మలేను.....భారతస్త్రీ ఎవరైనా సరే భర్తను చంపుకుంటుందా! అసంభవం." అన్నాను సందేహానికి ఆస్కారం లేకుండా.

"అయితే విను. ఆవిడ భర్తకు, స్నేహితురాలికి సంబంధమున్నట్లు తెలిసింది......"

"ఛీ, ఛీ...ఏమిటీ రంకు పురాణాలు!" అన్నాను ఏవగించుకుంటూ.

ఆయన, నవ్వారు...నవ్వుతూ నేవున్నారు. ...నాకు ఏమీ తోచక, కోపంవస్తోంది.

"అలా గనుకుని లాభమేమిటి? ఈ ప్రపంచంలో ఎంత మంచి వున్నదో దానికి పదింతలు చెడ్డకూడావుంది!.........మనం అసహ్యించుకున్నంతమాత్రాన, ఆ చెడ్డ మంచౌతుందా? అయింది కాకుండా పోతుందా?" అన్నారు కాస్త ఉపన్యాసధోరణిలో.

"సరేలెద్దురూ, తర్వాత."

"ఓనాడు వాళ్ళ ఏకాంతాన్ని తలవని తలంపుగా చూచింది."

ఏదో ఒకభయం చప్పున కదిలించింది హృదయాన్ని. నివ్వెరపోతూ చూస్తున్నాను.

"వాళ్లు నిద్రపోతూండగా వెళ్లి భర్తను బాకుతో పొడిచి చంపింది, ఆదృశ్యాన్ని భరించలేక."

"నేను నమ్మను." అన్నాను.

"ఏమిటీ వితండవాదం.........ఇదేమైనా, కోర్టులో కేసా? లేకపోతే వూసుబోనికబురా?"

"అదేమిటండి!... ఒకవేళ వాళ్లనలా చూస్తే మాత్రం..."

"దాన్ని చంపుతుంది కాని, మొగుణ్ణి ఎందుకు చంపుతుందంటావ్.." అన్నారు నన్ను పూర్తిగా చెప్పనీకుండానే.

"అవును... అలాగే అంటాను."

"అవును... ఎందుకు చంపకూడదంటాను."

"ఏమిటి మీ వితండవాదం?" అన్నాను.

ఇద్దరం ఫక్కున, నవ్వుకున్నాం.

"ఒకవేళ దాన్ని చంపబోయి, పొరబాటున భర్తని చంపిందేమో..." అన్నాను సందేహాన్ని వెలిబుచ్చుతూ. "ఇది పోలీసువాళ్ళు పెట్టిన కేసు. గొప్ప సాక్ష్యంకూడా వుంది."

"సాక్ష్యానికేమిలెండి. పిల్లికి ఎలుకసాక్ష్యం వుండనే వుందిగా... యింతకూ ఏం తీర్మానించారు."

"ఇంకా ఏమీ లేదు."

"ఇందులో మీ ఉద్దేశమేమిటి?"

"ఏమో... ఏమీతోచటంలేదు... అసలీ వుద్యోగమే పెద్దచావు... ప్రతిరోజూ యిలాంటి తీర్పులు చెబుతూనే గడపాలి జీవితం... ఇలాంటి కథలు, విని విని మా హృదయాలు నశించిపోతాయి. దయ, దాక్షిణ్యం... యివన్నీ చట్టానికి తలవంచాల్సిందే."

"ఆ చట్టాలు మీకు తలవంచవూ?" అన్నాను.

"పొరబడుతున్నావ్... చట్టానికందరూ దాసులే. ఆ ధర్మాసనంలో కూచున్నాక మా వ్యక్తిత్వాన్నే మరిచిపోతాం."

"నిజమేకావచ్చు... కాని... ఎంతైనా, మానవులమన్నాక, కనికరం కాస్తయినా వుండొద్దటండీ... ఏమిటో పాపం." అన్నాను.

ఆయన నిశ్శబ్దంగా నవ్వారు.

తర్వాత నాలు గైదురోజులు గడిచాయి కాబోలు. ఆయన కోర్టుకెళ్లారు. గోపీ ఊయ్యాల్లో నిద్రపోతున్నాడు. మధ్యగదిలో సోఫామీద కూర్చొని ఏదో కుట్టుపని చేసుకుంటున్నాను. బైట వరెండాలో అడుగులచప్పుడైంది.

"అమ్మా!"

ఎవరో పిలిచారు. వెళ్లి తలుపుతీశాను.

ఒక ముత్తయిదు. సుమారు యాభైయేళ్లుంటాయి. కాస్త వున్న యింటావిడలాగే వుంది. నమస్కారం పెట్టింది. లోపలికి తీసికొచ్చి చాపవేశాను. కూర్చుంది.

"ఎవరమ్మా?" అన్నాను.

కన్నీరు కార్చింది.

"ఎవరమ్మా... ఎందుకలా కష్టపెట్టుకుంటావ్?" అన్నాను. నా రెండు చేతులూ చప్పున పట్టుకొని దుఃఖాన్ని దిగమ్రింగుతూ, "ఇవి చేతులు కావు తల్లీ ... నడిసముద్రంలో వున్నాను...నాకష్టం తప్పించు ... చచ్చి నీ కడుపున పుట్టి నీ ఋణం తీర్చుకుంటానమ్మా!" అని చెప్పింది.

ఆవిడ, ఆవిడమాటలని చూచి నా హృదయం అలాగే ద్రవించింది.

"నీకొచ్చిన కష్టమేమిటో చెప్పు...పరవాలేదు." అన్నాను ధైర్యాన్ని పురిగొల్పుతూ.

"ఏమని చెప్పనుతల్లీ ..ఈ అన్యాయాన్ని నీవైనా తప్పించమ్మా." అన్నది.

ఆవిడమీద నాకింకా జాలికలిగింది.

"నీ మనసులో దేమిటో చెప్పు ... చేతనైనంతమటుకు సహాయం చేస్తాను." అన్నాను.

"మా బంగారు తల్లి...ఎంత గొప్పమాటన్నావు. నిన్ను, నీ మాటల్ని చూస్తూంటే నేనా బాధంతా పోయినట్లే వుంది... నా కూతురు మొగుణ్ణి చంపిందని పోలీసోళ్లు దాని మీద కేసుపెట్టారు తల్లీ ... వాడొక తాగుబోతు. పచ్చిరౌడి...ఎవతెనో వుంచుకుని నా కూతురి బతుకు బుగ్గిచేశాడు ... ఒక్కనాడైనా దాన్ని కన్నెత్తి చూచిన పాపాన పోలేదు...

ఎవరో గిట్టనోళ్ళు, పొడిచి చంపేసి, నోరు వాయి లేని దానిమీద పెట్టారమ్మా యీ తప్పంతా...” దుఃఖం పొంగి పొర్లుకొస్తూంటే ఆగింది.

“ఊరుకోవమ్మా... కొస్త నిదానించు.” అన్నాను ఓదార్చుతూ. “దాన్ని వురితీస్తారంట...అది లేకపోతే నేను బతకలేనమ్మా... నా కడుపున పుట్టి బతికిన బిడ్డ అదొక్కటే... రక్షించుతల్లీ” అంటూఅమాంతంనాపాదాలమీద పడింది. వెంటనే జ్ఞాపకానికొచ్చింది; మొన్న నాకు ఆయనకు మధ్య జరిగిన సంభాషణ. ఏదో భయం నన్నావరించింది... ఆవిడకూతుర్ని వురి తీస్తారేమో!... గుండెలు ఝల్లుమన్నాయి. 'ఉరి' ఆ మాటలో యిమిడివున్న క్రౌర్యాన్ని వూహించుకునేకొద్దీ నా నవనాడులు స్తంభించిపొయ్యాయి... పోయినవాడెలాగూ పొయ్యాడు... అందుకోసం అమాయకమైన మరోనిండుప్రాణాన్ని బలవంతాన బలితీసుకోటమా... మరిదంతా పశుత్వంకాదా? మనం మహాగొప్పగా చెప్పుకునే నాగరికతంతా ఏమైనట్లు?... శుద్ధ అన్యాయం!... నాలో నేను తిరగబడ్డాను. ఈ లోకంమీద, న్యాయాలమీద, చట్టాలమీద, న్యాయస్థానాలమీద, న్యాయాధికారులమీద నాకు అమితమైనద్వేషం కలిగింది...అన్నీ మరచి దీన్నేగురించి ఆలోచిస్తూ కూర్చున్నాను.

“చెప్పుతల్లీ... అనుకుంటే ఏమైనాచెయ్యగలవు... నాబిడ్డను నిలువునా వురితీస్తారంటే నా కెలా వుంటుందమ్మా!...... నీవుమాత్రం కడుపుతీపి ఎరగవా?” అన్నది. నా మనసు చివుక్కుమన్నది. సంవత్సరం పిల్లాడు, గోపీ జ్ఞప్తికొచ్చాడు... మా పంచప్రాణాలు గోపిమీదేవుండేవి. ఆతల్లికి ఆకూతురంతేగదూ.

“నీఋణం వుంచుకోనులే తల్లీ... బిడ్డలుగల తల్లివి... నీవుగాకపోతే నా కడుపుమంటని తెలుసుకునేవా రెవరమ్మా,” అంటూ, ఒళ్లోనుంచి ఓమూటతీసి నా చేతిలో పెట్టింది.

“ఏమిటి!” అన్నాను. తికమక పడుతూ.

“ఏముందమ్మా... నీఋణం ఎలాతీర్చుకోవాలో అర్థం కావటంలేదు... ఏదో నా శక్తి కొద్దీ...” అంటూ మూటవిప్పింది.

నాకళ్ళు చెదిరిపొయ్యాయి. తళ తళ మెరిసే కాసుల పేరు, నాలుగు జతలగాజులు, బంగారు గొలుసు కనిపించాయి!

“నీవుద్దేశమేమిటో నా కర్థంకావటంలేదు.” అన్నాను.

“అయ్యగారితో చెప్పి శిక్షలేకుండా తప్పించమ్మా!” అన్నది.

“అందుకిది లంచమా,”

“ఎందుకు తల్లీ అంతమాట!... నా బిడ్డ ప్రాణాలు కాపాడినదానివి... మా ప్రాణాలే నీ చేతిలోవున్నాయి. యీ మాత్రం మేం చెయ్యకూడదా!... నా బిడ్డ బతకాలేగాని మా కిదో లెఖ్ఖా! ... ... చిన్నదానివమ్మా... నామాటవిని దాచుకో......అవన్నీ పెట్టుకుంటే మహాలక్ష్మిలాగుంటావు........ పోనీ అయ్యగారికి తెలీకుండా ఎక్కడైనా దాచుకో.” అంటూ చాలాదూరం హితబోధ చేసింది!

నా కేమీ తోచలేదు. మనస్సు వుయ్యాల్లాగా అటూ యిటూ వూగుతోంది.

“వస్తానుతల్లీ,” అంటూ తటాలున లేచి గబగబా వెళ్లిపోయింది. వెనక్కి పిలిచి ఆసొమ్మంతా తీసికెళ్ళమని చెపుదామనుకున్నా గాని నోట మాటరాలేదు. ఈ లోపల ఆవిడ వెళ్ళనే వెళ్లింది.

పనంతా మానుకొని ఆలోచనలో పడ్డాను. ఒక్కోమాటు ఏదో అవ్యక్తమైన భయం చెలరేగుతుంది. వెంటనే సమాధానపరుచుకుంటాను. ఇది చాలా అన్యాయం అనిపిస్తుంది.... న్యాయాన్ని నిలువునా హత్యచెయ్యడం!... న్యాయాధిపతి విధి నియమాలను పాపిష్టి డబ్బుతో అరికట్టడం!...ఇది నిజంగా మహాపరాధం!

ఆయనకి తెలిస్తే, ఏంకాను!?...ఏంతెలిస్తే?.

ఏమౌతుంది?... కాదంటారా?... ఇందులో తప్పేముంది?...పరోపకారంచేస్తే తగిన పారితోషికం యివ్వడంకాని, పుచ్చుకోడంకాని లోకాతీతమైన విషయం కాదే.

పోనీ...తనభార్యను గదా... యీమాత్రానికే తూలనాడతారా? నేను సొమ్ములు పెట్టుకోడం తన కిష్టం లేదంటారా? నేను అందంగా కనిపించటం సహించలేనంటారా?...ఇంత సునాయాసంగా యింటికి నడిచివచ్చిన మహాలక్ష్మిని కాదంటారా?......ఎన్నటికీ అనరు. ఆయనంత వెర్రిబాగుల రకంకాదు...ఇంతకూ యిప్పుడొచ్చిన ప్రమాదమేముంది. ఆయనేమీఅన్యాయంచెయ్యటంలేదు... నేనుఆయన్ని అలా చెయ్యమని బలవంత పెట్టటమూలేదు.... ఆయనకే ఆవిడమీద ఏదో దయకలిగినట్లు మొన్నటి మాటల్లోనే గ్రహించాను. ఆవిణ్ణి అంత కఠినంగా శిక్షించటాని కాయనకు మన సొప్పటంలేదు.... శిక్షించటం చాలా అన్యాయమనికూడా భావిస్తున్నట్లు కనిపించారు...

అసలాయన ఎలా తీర్పు చెప్పినా న్యాయమే!

అయితే ఇంతగా తర్కించుకోటం దేనికి... న్యాయంగా సంపాదించిన దానికి దిగులెందుకు... ఏదో కుటుంబానికోసమే యిలా సాహసించటం... ముందుతరంవాళ్లు సంతోషిస్తారో యీ పనికి... మొత్తంమీద లేనిపోని చచ్చు నీతులు, అవి ఇవి అడ్డంపెట్టుకొని, సిరి రా మోకాలొడ్డలేదు... అవకాశాలంటూ ఏర్పడాలేకాని జారవిడుచుకునే చవటలెవ్వరూ వుండరు... ఉంటే యీ ప్రపంచంలో బ్రతకగలరా......” ఆయన కోర్టు నుంచి యింటికొచ్చారు. నా స్వప్న వీధుల నుంచి నేనూయింటికొచ్చాను.ఎందుకో ఆయన్ని చూస్తే భయంతో గుండె దడదడలాడటం మొదలెట్టింది. నే నేదో నేరస్థురాలనని, నన్ను నా అంతరాత్మ నిందిస్తూనే వుంది. ఇంచుమించు ప్రతి సమాధానమూ ఆయన చూపులు తప్పించుకుంటూనే యిచ్చాను. అనుక్షణం సముద్ర తరంగాల్లాగా పెల్లుబికే ఆందోళన మహా ప్రయత్నంతో కప్పిపుచ్చాను...రెండు రోజు లలాగే గడిచాయి.

రాత్రి పదిగంటలైంది. ఆనాడు శనివారమవడంచేత ఫలహారంచేసి పడుకొని ఏదో లోకాభిరామాయణం మొదలెట్టాం.

అలవాటుప్రకారం ఆకు మడుపులిస్తూ.

“ఏమిటండీ విశేషాలు?” అన్నాను.

“ఏమీ లేవ”న్నట్లు తలవూపారు.

“ఆకేసు ఏమైంది?”,

“అదా!... అయిపోయింది.” అన్నారు.

“అయిపోయిందా!! ఆ ప్రయత్నంగా అన్నాను. ప్రాణాలన్నీ అమాంతం ఎగిరిపోయినంత పనైంది. నేరస్థురాలు, ఆవిడ తల్లి... ఆ కన్నీరు, ఆ సొమ్ములు, అన్నీ నా కళ్ళ ముందు గిర్రున తిరగసాగాయి.

“ఏమిటలా కంగారు పడుతున్నావ్?” అన్నారు నా అవస్థ చూచి.

"ఎంత అన్యాయం చేశారండి!" అన్నాను.

నేరస్థురాలికి, ఆవిడ తల్లికి ఏదో ఘోరమైన అపచారం చేసినట్లు నా మనసు చెప్పలేనంత బాధపడుతోంది.

"అవును...అన్యాయమే చేశా ననిపిస్తోంది." అన్నారు ఒక్క నిట్టూర్పు విడుస్తూ.

"అనిపిస్తోందా!...పాపం... ఏం న్యాయాలో, ఏం నీతులో, మనుషుల ప్రాణాలతో చెలగాటాలు తప్పనిస్తే మరో న్యాయం కనపడటం లేదీ ప్రపంచంలో."

"నీ ధోరణేమిటో అర్థంకాలేదు." అన్నారు కొంచెం విసుగ్గా.

"అన్నీ అయిపోయ్యాక అర్థమైనా ఒకటే ..." ఆ ముక్క పూర్తిచేసే లోపలే అందుకున్నారు.

"ఏమైనా మనచేతిలో ఏముంది. నే నొకటనుకుంటే మరొకటైంది."

"బాగానే అయింది ... అయినా దాని వుసురు మనకు తగలకపోదు." అన్నాను చాలా నిస్పృహతో.

"ఏమిటలా నిస్పృహ చెందుతావ్?" అన్నారు.

కాక మరేమిటి. ఒత్తిపుణ్యానికి ఆ స్త్రీ వురికంబాని కెక్కబోతూంటే..."

"ఎవరన్నారామాట?" అన్నారు చప్పున.

"అనకపోయినా చేశారుకదా!"

"లేదు..వురిశిక్ష వేసే అధికారం నాకులేదు."

"నిజంగా!"

ప్రాణాలు లేచివచ్చాయి.

"అవును."

"మరి ఏంచేశారు."

"నిర్దోషిగా తీర్పుచెప్పాను." అనారు.

సంతోషం పట్టలేక, ఆయన బాహువుల్లో విశ్రమించాను.

నెలరోజులు గడిచాయి. ప్రభుత్వాన్నుంచీ తాకీదొకటొచ్చింది. దాన్నే నాకు చూపించారు దానికి సమాధానం రాసి పంపించారు. కాని వారం తిరగలేదు, మరొక తాకీదొచ్చింది.

'రంగయ్య ఖూనీకేసులో బంగారునగల రూపంలో లంచం తీసుకొని నేరస్థురాలు సీతమ్మను, నిర్దోషిగా వదలిపెట్టిన కారణాన, ప్రభుత్వానికి, రంగయ్య బంధుమిత్రాదుల ద్వారా కొన్ని అర్జీలువచ్చాయి. ఆసందర్భంలో మిమ్మల్ని విచారణ చేయవలసినదిగా ప్రభుత్వం నిర్ణయించింది. ఆ విచారణ పూర్తయేవరకు మిమ్మల్ని తాత్కాలికంగా ఉద్యోగంనుండి బర్తరఫ్ చేస్తున్నాము. నాలుగైదు రోజుల్లో జరగబోయే విచారణకు, మీరు హాజరుకావాలి; లేనిచో తగుచర్య గైకొనబడును.'

ఏమిటో ఆయనకు దిక్కు తోచటం లేదు. దీని కంతేమిటో బోధపడటం లేదు. రాత్రింబవళ్లు ఆలోచనలతో మనస్సు పాడుచేసుకుంటున్నారు. ఆయన్ని చూచే నాకు, భయము, విచారము, నిరాశ, నిస్పృహ ఒకదాన్ని ఒకటి పెనవేసుకొని పైకి పొంగుతున్నాయి. నా అంతరాత్మ నన్ను చెండుకుతింటోంది...... పరిస్థితులు యీ విచిత్రరూపం దాల్చగలవని నే నెన్నడూ వూహించలేదు.... ఈ నీలాపనిందను భరించలేక, ఆయన లోలోపల కుమిలిపోతూంటే నే చేసిన నేరానికి నాహృదయం దగ్ధమై పోతోంది......ఎవరితో ఏమని చెప్పుకోను, యీ బాధలు!

ఆనాడే విచారణ ప్రారంభం. ఏక్షణాన, ఏం జరగబోతుందోనన్న భయంతో క్షణమొక యుగంలాగా, గడుపుతున్నాను.

వచ్చారు! హఠాత్తుగా వచ్చారు! ప్రళయభీకర ఝంఝూమారుతంలాగా రివ్వున లోపలికొచ్చారు. 'విమలా!' అంటూ సింహగర్జన చేశారు. నాల్గుదిక్కులుమారుమ్రోగివుంటాయి! నా చెవులు బద్దలుగా చీలాయంటే ఆతిశయోక్తిలేదు. చేతిలోవున్న గోపీ, అమాంతంగా జారి కిందపడి ఏడవసాగాడు...దానితో నా సర్వస్వం జారి క్రిందపడినట్లనిపించింది.

అగ్నిగోళాల్లాగా, గనగనమండే ఆయన క్రోధావేశపూరితమైన కన్నులు చూడలేక చప్పున తలవంచుకున్నాను. నా బుజాలురెండు చేతులతోనొక్కిపట్టి నా మొహాన్ని తనవైపుకు తిప్పుకొని 'విమలా! చెప్పు...నిజం చెప్పు... అంతా బైటపెట్టు! అని వెర్రికేకలేస్తూ నన్ను బలంకొద్దీ వూపేశారు. అప్పటి ఆయన బలానికి నేను ఆహుతైనానంటే నమ్మండి.

'ఏ మి...టి' అన్నాను. ఆరిపోయే గొంతుతో.

'ఏమిటంటావా,... ఛండాలపుదానా! అప్పుడే మరచిపొయ్యావా!... మానాభిమానాలులేని ద్రోహి వనుకోలేదు... చెప్పు... ఆ బంగారునగలు పుచ్చుకున్నావా?' కుప్పకూలిపోయ్యాను. బ్రహ్మరుద్రాదులకు తెలిసినా, ఆయనకు మాత్రం తెలియకూడదనుకున్న రహస్యం ఆయనకే దానంతటదే తెలిసింది!

"చెప్పు...చంపేస్తాన్..." అంటూ పండ్లు పటపట కొరికారు.

"అవును." అన్నాను. హీనస్వరంతో అన్నిటికి తెగించి.

"అవునా!...... ఎంతపనిచేశావే!" అని నుదుటిమీద చేత్తోబాదుకుంటూ కుర్చీలో కూలపడ్డారు. తలవంచుకొని నిర్జీవప్రతిమలాగా గది మధ్య నిలుచున్నాను. నా తలలో ఆలోచనలన్నీ ఆగిపొయ్యాయి. ఏడవటానికి ఏడుపు కూడా రాలేదు.

"ఎక్కడ దాచిపెట్టావా నగలు?"

"మా అన్నయ్యచేత పంపించేశాను."

"ఈ పాపిష్టిపనికి ఆ రాడీవెధవకూడా తోడ్పడ్డాడన్నమాట నీకు."

నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. గొంతుపూడుకుపోతోంది దుఃఖంతో.

"లేదు, అంతా నాపనే...... ఇంతదూరం వస్తుందనుకోలేదు."

"నేరాలుచేసిన వాళ్లందరూ అలాగే భావిస్తారు...... అయిపోయింది... జీవితం సర్వనాశనమైపోయింది... ఇంతకాలం, ఏ పరువు కోసం, ఏ నీతి న్యాయాల కోసం, పరాయి డబ్బును గాని, వస్తువును గాని, కాలకూటవిషంగా చూశానో అదంతా బూడిదలో హోమంలా నిష్ప్రయోజనమై పోయింది ... ఏమేమిటో సాధిద్దామనుకున్నాను...ఇదంతా ఒత్తి మోసం, మహామాయ" అనుకుంటూ మంచంమీద బోర్లపడుకొని మొహానికి చేతులు కప్పుకొని, హఠాత్తుగా ఏడవసాగారు!

ఒక్క పరుగున వెళ్ళి ఆయన పాదాలు హృదయానికి హత్తుకొని ఏడ్చాను. బ్రహ్మాండమైన ఉప్పెనలా నాలో దుఃఖంపొంగింది.తనివితీరా ఏడ్చాను...అంతకన్నా ఏంచెయ్యను?... ఏమని సమాధానం చెప్పగలను? ఎవరితో?...

మూడురోజుల్లో విచారణ పూర్తయింది. ఉన్నదున్నట్లు చెప్పుకున్నారు. తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకుంటూ పూర్వపు రికార్డు చూపించారు.

అయితే ఏం? నేను బంగారునగలు తీసుకున్న దెవరు కాదనగలరు? ఆయనకు తెలీ

కుండా తీసుకున్నాననిగాని. దీనికి, ఆ కేసులో చిట్టచివర తీర్పుకు ఏలాటి సంబంధమూ లేదని ఎంత గొంతుచించుకున్నా వినేదెవరు?.. అదంతా అరణ్యరోదనం!...ఇన్నాళ్లూ, ఆయన్ని ఇంద్రుడు, చంద్రుడు అని భట్రాజుల్లాగా పొగిడినవారంతా యిప్పుడు చాటుచాటుగా ఆ నాలుకలతోనే విమర్శిస్తున్నారు!...అంతే. సత్యం ఎవడికి కావాలి!...సత్యాన్వేషణ చేద్దామన్న పట్టుదల, తీరిక, ఓపిక ఎవడికుంది. ...పోనీ ఎంతమందున్నారు అలాటివాళ్లు! ఈ సంగతి వూరంతా పాక్కిపోయింది. పత్రికల్లో అచ్చుపడింది...ఇక సగౌరవంగా తలెత్తుకొని తిరిగే రాత యీ బ్రతుకికి లేదు; వారం పది రోజుల్లో ఆయన్ని ఉద్యోగంలోనుంచి బర్తరఫ్ చేసినట్లు తాకీదొచ్చింది. మా జీవితాల్లో వసంతం ముగిసింది!

ఉద్యోగం వూడినా లెఖపెట్టే రకం కాదాయన. అకారణంగా తన కిలాంటి అవమానకరమైన ఘోర శిక్ష లభించినందుకు ఆయన చాలా బాధపడుతున్నారు. మానసికంగా...అలాగే రాత్రింబవళ్లు ఆలోచించి, కృశించి, నీరసించసాగారు...కొద్దిరోజుల్లోనే. ఆయన మనసు చలించింది!...చుట్టూ అందరూ చేరి ఆయన్ని విశాఖపట్నంలో పిచ్చి ఆసుపత్రిలో చేర్పించారు. నా చేతనైంది అదొక్కటే! తర్వాత వన్నీ ఒక్క మాసం గడవకముందే భగవంతుడు పూర్తిచేశాడు! ఫలితం?... ఈ విశాల ప్రపంచంలో నేను ఏకాకి నయ్యాను!

ఇంత విశాల ప్రపంచం, మొన్న మొన్నటి దాకా, ఆనందమయ స్వర్గధామ మనుకున్న ప్రపంచం, నాకిప్పుడు, నిబిడాంధకార నరక కూపమైంది!... ఎక్కడ తలదాచుకోను... అత్తగారింటివాళ్ళు నన్ను చీడపురుగులా చూచారు. ఆ వంశ వినాశానికి, పరువు ప్రతిష్టలు నట్టేట కలపడానికి శనిగ్రహంలా నేను దాపురించానని అనరానిమాట లెన్ని అన్నారో లెఖ్కలేదు.ఆయనజీవితాన్ని బలిగొన్న బ్రహ్మరాక్షసి నన్న బిరుదిచ్చారు నాకు. చివరకు నా గోపీని చూచైనా వాళ్ల కోపం చల్లారలేదు. బ్రహ్మరాక్షసి పెంచిన బిడ్డమాత్రం ఎలా వుండబోతుందని మళ్ళీ వాళ్ళ గడప త్రొక్కనివ్వలేదు.

ఇక నాకు పుట్టిల్లే దిక్కు! అక్కడమాత్ర మేముంది? మా నాన్న లేరు. మాఅన్నయ్య కోసం వెళ్లాలి. పాపం మొదటినుంచి వాడికి నేనంటే ఎంత మమకారం! వాడొక్కడే నా బాధ అర్థంచేసుకొని, దగ్గరికి తీస్తాడు!... అందుకే వెళ్లాను. నన్నుచూచి మా అమ్మ భోరున ఏడ్చింది. అన్నయ్య కింకా పెళ్ళికాలేదని మరో ఏడ్పు ఏడ్చింది. అన్నయ్య క్షేమ సమాచారాల గురించి ఎన్నో ప్రశ్న లడిగాను.

నెలరోజులుగా యింటికే రావడం లేదని జవాబిచ్చింది! ఇంకేం?... తర్వాత సంగతంతా నాకర్థమైపోయింది. ఆ సొమ్ము తీసికొని పరారీ చిత్తగించాడు.. అంతే. ఎవడిసొమ్ము ఎవడికి ప్రాప్తమో. ఈ నాటకంలో నా సంసారం ఓ చిన్న పాత్ర ధరించి సమూలంగా నాశనమైంది!... అన్నయ్య!!... వాణ్ణి తల్చుకొని ఎంత ఏడ్చానో...

నాలాగా మా అమ్మకూడా యిప్పుడు మరొక ఏకాకి!... దిక్కులేని పక్షుల్లాగా మేమిద్దరం మా అక్కయ్య వాళ్లయింట్లో ప్రవేశించాం. వాళ్ళది గొప్ప కుటుంబం! వాళ్ళ అత్తగారు గొప్ప వ్యాపారస్థులు. మాబావ చాలా పెద్దమనిషి. పాపం మమ్మల్నెంతో ఆదరించాడు. నన్ను చూచి ఎంత జాలిగొన్నాడో ఎలా వర్ణించగలను! నాలో ఎంత ధైర్యాన్ని పురిగొల్పాడు! ఈ జీవితంలోని హాలాహలాన్నంతా దిగమ్రింగి కాలక్షేపం చేసే ధైర్యం నాలో రగుల్కొల్పాడు. నాగోపికోసం నా సర్వశక్తులు ధారబొయ్యమన్నాడు... నిజానికి ఆయనే నాకు తటస్థపడకపోతే యీవరకెప్పుడో నేను ఏ నుయ్యో, గొయ్యో చూచుకొని నాగోపిని మరో ఏకాకిగా చేసి లేనిపోని పాపం మూటగట్టుకొనే వుండేదాన్ని.

కాని మా అక్కయ్య మమ్మల్ని అపార్థం చేసుకుంది. అంతకన్నా ఏంచెయ్యగలదు? తన పంచ తల దాచుకుందామని వచ్చిన నేను నా యవ్వన సౌందర్యంతో తన సంసారాన్ని సర్వనాశనం చెయ్యక మరేంచేస్తాను! సామాన్య స్త్రీలాగే అదికూడా యీర్ష్యకు లోనైంది. చూపులతో చేష్టలతో మాటలతో నాశరీరాన్ని, మనసును బాకుపోట్లలాగా హింసించసాగింది. అగ్నిలో ఆజ్యం పోసినట్లు నాబతుక్కితోడు, యీ శృంగారాలు, యీర్ష్యలు, ద్వేషాలా!!... ఈ వాతావరణం నాకు దుర్భరమైపోయింది. నాదురదృష్టాన్ని యితరుల అదృష్టంతో మేళవించి సంతోషించాలన్న కోరిక నాకెన్నడూ లేదు. నా చేతులారా చేసుకున్న దానికి నేనే భగవంతుడిచ్చిన శిక్ష ననుభవించాలి. అదే న్యాయం!

ఈ బంధువులమీద చివరకీ గడ్డమీద నాకు రోత పుట్టింది. నామీద నాకు ద్వేషం చెలరేగింది. ఈ వాతావరణం, యీ దృశ్యాలు నన్ను బాధిస్తున్నాయి. నా మనసు నలిగి నశిస్తోంది. ఇక లాభంలేదు....ఒకనాటి రాత్రి నాగోపిని తీసుకొని రైలెక్కాను. మూడోనాడు రైలు పెట్టెలోనుంచి అందరినీ దింపేవరకు నేను దిగలేదు. తీరా రైలు దిగి స్టేషనులో అడిగి తెలుసుకున్నాక ఆవూరు కలకత్తా నగరమని తెలిసింది.

గోపీని వెంటబెట్టుకొని వూరంతా తిరిగాను. విద్యావంతులైన స్త్రీలను చాలామందిని కలుసుకున్నాను. ప్రతిఒక్కరు సంఘాన్ని తిట్టసాగారు. స్త్రీని అధోగతిపాలుచెయ్యడమే యీ సంఘ పరమాశయమన్నారు!! స్త్రీవల్ల అధోగతిపాలయ్యే సంఘంకూడా ఆదేనన్న భావం వారికిలేదు!! అది వారిలో పుట్టలేదు. పుట్టినా దాన్ని పురిటిలోనే తుంచి అవతలపారేస్తారు! పాపం!

ఏవేవో ఉద్యోగాలు చెయ్యమన్నారు నన్ను...కాని ఉద్యోగాల్లో నాకు నమ్మకం పోయింది. నిజాయితీగల ఉద్యోగస్తులని లోకం మెచ్చదు. ప్రభుత్వం నమ్మదు. అమాయకులైనవాళ్లని, ఏవేవోచెప్పి, చూపి, మభ్యపెట్టి రొంపిలోకి దించటం లోకానికో క్రీడ!... ఇవన్నీ అనుభవించాను.

ఒకనాడు రామకృష్ణసమితికి వెళ్లాను మనశ్శాంతికోసం. నాలాంటి అభాగినులు కొంద

రక్కడ ఆధ్యాత్మిక సాధనలో శాంతినిపొందుతున్నట్లు తెలుసుకున్నాను. నా అంతరాత్మ బోధించింది నా శేషజీవితరంగ మదేనని... నా కళ్ళు, కాళ్ళు అక్కడనుంచి కదల్లేదు. వాళ్ళను కాళ్ల వేళ్ల బ్రతిమాలుకున్నాను. ప్రార్థించాను. కన్నీటితో వారి పాదాలను పరిశుభ్రపరిచాను. చివరకెలాగో ఒప్పుకున్నారు. నా వేషం మార్చి కాషాయవస్త్రాలిచ్చి, ఆశ్రమంలో చేర్చుకున్నారు. నా జీవితలతకు ఆధ్యాత్మికాలంబన దొరికింది. నా జన్మచరితార్థమైంది.

నా గోపి విద్యాభివృద్ధులకు మఠాధిపతులే బాధ్యత వహించారు. కాలం తిన్నగా దొర్లిపోతోంది.

ఒకనాడు ఆయన తాలూకు ప్రావిడెంటు ఫండు నాకు ఒప్పచెప్తారని, కొన్ని కాగితాల మీద నా సంతకాలు కావాలని ఒక ఉత్తరం వచ్చింది.

నిశ్చింతగావున్న దాన్ని మళ్ళీ యీ గొడవలోకి దిగనా! ఈ ఆకర్షణలే నా జీవితాన్ని భగ్నం చేశాయి. నేను, నా బ్రతుకు, నా సంసారం, నా సౌందర్యం......అబ్బబ్బ! యీ మమకారాలే యింతకూ మూలకారణం. ఆ భావమే చంపేసుకుంటే, యిప్పటికెంతో బాగుండేదాన్ని... కాదు....యిదంతామంచికే. నేను, అన్న భావం ఒక వ్యక్తిని ఎంత నీచానికి, ఎంత ఔన్నత్యానికి తీసుకొస్తుందో నాకిప్పు డర్థమౌతోంది. నా పూర్వ జన్మ జీవితం, ప్రస్తుత జీవితం వైభావానికి చక్కటి నిదర్శనాలు.

తక్షణం ఆ కాగితాల్లో సంతకాలు పెట్టి తిరుగుటపాలో పంపించాను. నెలరోజుల్లో మూడువేల రూపాయలకు చెక్కు వచ్చింది.

దాన్ని ఏంచేసుకోను? నాకెందుకు? నేను అనుకునే వ్యక్తి, అహంభావ పూరితమైన ఆ వ్యక్తి యిప్పుడు నాలో లేదు! ఈ వ్యక్తి అవసరాలు, ఆశయాలు వేరు.

వాటికి వీటితో అవసరంలేదు...ఈ 'నేను' ఆ 'నేను' కాదు. ఆ చెక్కు ఆశ్రమాభివృద్ధికోసం రాసిచ్చేశాను... నా పాపాని కిదే ప్రాయశ్చిత్తం ... కాలచక్రం దొరలిపోతోంది యీ క్షణంవరకు.

ఇలా ఆలోచించుకొని ఎప్పుడు నిద్రపోయ్యానో తెలీదు. మళ్ళీ ఆశ్రమవాసుల వేద ప్రవచన పారాయణం నా చెవుల్లో పడేవరకు మెలకువ రాలేదు. ★

# శివ సంకల్పము

శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి

వ. భువనేశీ సముపాసనోజ్జ్వల తర భ్రూమధ్యగోర్ణా విలా
స విభా నిర్జిత భానుమండల సహస్రస్ఫూర్తిమై నొప్పి మూ
ర్తి విరూపాక్షుఁడువోలె నింపెసఁగు విద్యారణ్యయోగిన్ బున
ర్భవ దూరున్ దరిసింపఁ గోర్కి చిగురింపన్ ధర్మసేవామతిన్.

చ. తఱచుగఁ దాను పోయెడి విధంబునఁ గాక భవిష్యదర్థ త
త్పరత యొకండు లోఁతుటెడఁదం గదలించుచునుండ, స్వామి శ్రీ
చరణయుగంబు మ్రోల నొక చక్కని వాచిక మందుకోఁగ నా
హరిహరరాయ భూపతి సహానుజుఁడై వెడలెన్ వినీతుఁడై.

మ. అరుణార్క ద్యుతిరేఖ లాశ్రమ పురః ప్రాంతావనీజాతబం
ధురపర్ణాంతరజాలభాసురములై తోఁపన్ సమాధ్యంతమం
దరవిప్పం గనులెత్తి "యివ్విపొడలేల్లోరార! చెల్లెక్కు ట
బ్బుర" మంచున్ మఱి యంతలో నపుడ నవ్వున్ దాను దద్భ్రాంతికిన్.

ఉ ఆ పరమర్షి మందహసితాంచలమందు జగద్ధితైక సం
ధా పరమాదరోదర సుధాకణ మొక్కఁడు చెంగలించి లోఁ
దీపులు పొంగు నయ్యెడ సుధీజనసంఘ విధేయతా లసద్
రూప విలాసుఁడౌ హరిహరుండు సహోదరుఁడౌచు వచ్చుచున్.

శా. అల్లంతన్ గురుపీఠముం గనుచు భక్త్యావేశ విత్తంబు దో
సిళ్ళన్ నిల్వఁగఁ జిక్కఁబట్టుకొని యాశీర్లాభకాంక్షా త్వరో
ద్యల్లీలా గమనాభిరాములయి డాయం జేరి, ధ్యానాంతరో
త్ఫుల్లంబైన కటాక్ష నీరజ దళంబుల్ గాంచి రాసోదరుల్.

ఆ. వె. లోనలోనఁ దేనె సోనలు - పైపైని
శిలలు కత్తిరింపఁ గలుగు పదను -
గురుని యడుగుఁ దమ్ముల్లొరయ సాష్టాంగమై
యెఱఁగె వినయ భరత హరిహరుండు.

ఆ. వె. అన్న వెనుక నొక్కఁడై యొక్కఁడై యట్టె
సాగి మ్రొక్కు లిడినజాడ వెంట

ధర్మరాజు నరయు ధౌమ్యుఁడై మాధవుం
డాశిషమ్ము లిచ్చె హరిహరునకు.

మ. సవిశేష స్ఫురణాభిరామము కటాక్షశ్రీని నిండార్చి మా
ధవ విద్యాఖని గొంతులో జలద మంద్రధ్వాన గాంభీర్య గా
రవ మొక్కం డెదొ తొల్కరింపఁగఁ బ్రియారంభంబుతో, ధార్మిక
వ్యవసాయం బిటు పంటవోసినటుగా నాలించి రయ్యేవురున్.

మ. "అవురా! చూడఁగఁజూడఁగా, యవన మాయాభంగు లిప్పాట లొం
గవు కాఁబోలును! ధర్మధేను వది ముక్కాల్ కుంటిదై కంట వె
ల్లువగా నీరొడియన్ వడంకుఁగొని నిల్చున్నేఁడు; నాసుంత వై
భవముం బుణ్యముగట్టుకొంటకుఁ దలంపన్ వారు మంపిల్లిరో!

మ. పుడమిన్ ధర్మ మధర్మపున్ బెడఁదఁ బెంపుం బాసిపోనున్నయ
ప్పుడు విద్వాంసులు కార్యదక్షులును బ్రోపుంజూపి యద్దానిఁ గీ
డ్పడకుండన్ సరిదిద్ద నొప్పు; నటు తప్పన్ వారికే ముప్పు చే
పడుఁగానీ, చెడకుండ ధర్మమును నిల్పన్ దైవమొండుండెడిన్.

గీ. ఇచట మేముండి - పయి నీశ్వరేచ్ఛయుండి
యచట నసమాన విక్రమ ప్రచురమూర్తు
లైన మీరిందఱుండి - ధర్మావనంబు
నోఁచుకొనలేదె! నేఁడు హిందూధరిత్రి.

మ. అదికా; దీ యవనప్రతారణపుఁ జర్యల్ సాగనీకుండఁ జే
యఁదగున్; హైందవ ధర్మపాలన పరాయత్తైక చిత్తంబులన్
బదనౌ కత్తులు దూసి మీరు గను పాపం బింతయున్ లేదు, నాఁ
గదలున్ మాయెదలోన నొక్క శివసంకల్పంబు రేఖాకృతిన్.

చ. హరిహరరాయ! యీ నలువురైన సహోదరు లండ నిల్చి యుం
దురుగద! నీవు పంచవదనుండవుగాఁ గను జేవుఱించి సం
గరమున నిల్చినన్ యవన కంఠవిలుంఠనమౌను; ధర్మ బం
ధురమును దేశబంధువగు నూతనరాజ్య మొకండు పొల్చెడిన్.

మ. నిరమిత్త్రంబుగ హైందవప్రజలు రాణింపన్ గళాహృద్యమౌ
పుర మొక్కండు నభేద్యవప్రమొకఁ డొప్పుల్ మీఱఁగట్టించి, దే
శ రమాపాద సరోజ మంగళ సమర్చారంగమైయున్న బం
గరుగద్దెన్ నిను నిల్ప నొక్క వెలుఁ గాజ్ఞాపించు నాత్మీయమై."

— "ఆంధ్రపురాణము" విద్యారణ్య పర్వమునుండి.

### భక్తిభావ సంభరితమైన

# పోతనామాత్యుని ఆంధ్రభాగవతం

డా. దివాకర్ల వేంకటావధాని

రాజు లిచ్చు జాంబూనదాంబరాగ్రహారాదుల కాసింపక జగద్ధితమునకై మహాకావ్యము రచించి శ్రీహరి కర్పించిన పరమభక్తాగ్రేసరుఁడు బమ్మెర పోతనామాత్యుఁడు. సహజ భక్తిసంభరితుఁడైన యీ మహాకవి భక్తిప్రధానమైన భాగవతము రచించుట యాంధ్రజనుల యదృష్టమని చెప్పవచ్చును. పరమసాత్త్వికుఁడైన యాతని ప్రతిభకును, భక్తిరసపూరితమైన భాగవతమందలి వస్తువునకును బొందు పొసఁగుటచే నా గ్రంథమనన్యసామాన్యమై సర్వాంధ్రజనుల యాదరాభిమానములఁ జూఱగొనుట సంభవించినది.

సంస్కృతమున భాగవతమును రచించినవాఁడు వ్యాసభగవానుఁడు. ఇతర పురాణములకంటె భాగవతపురాణము భావములయందును, శైలియందును ప్రౌఢమై యలరారుచుండును. దానికి మూఁడు మతములకును సంబంధించిన వ్యాఖ్యానము లున్నవి. అందు శ్రీధరునిది యద్వైతమతపరమైనది. పోతన భాగవతము ననువదించునప్పుడు శ్రీధరుని వ్యాఖ్యనుగూడ సన్నిహితముగా ననుసరించెను. అనువాద విషయమున నతఁడు కవిత్రయమువారి పద్ధతి నే యనుసరించెనుగాని సహజ భక్తిభావ ప్రేరితుడై భక్తిరస సంభరితములైన ఘట్టముల సందర్భమున మూలభావములకుఁ దన భావములనుగూడ జతచేసి కొంత యావేశము ప్రదర్శించెను. అందుచే నాంధ్రభారతము మూలముతోఁ బోల్చి చూడఁ గొంత సంగ్రహింపఁబడినట్లు కనిపింప, నాంధ్రభాగవతము మూలముకంటెఁ బెంచఁబడినట్లు గోచరించును. పోతన దానిని యథాతథముగా ననువదింపక కొన్నిచోట్లఁ బెంచియుఁ గొన్నిచోట్ల వివరించియుఁ గొన్నిచోట్ల సన్నిహితముగా ననుసరించియు స్వతంత్రమార్గము నవలంబించెను. అందుచేతనే యది యనువాదమయ్యు స్వతంత్ర రచనవోలె సాగిపోయినది. భక్తిభావమును వివరించుపట్లను, భగవంతుని గుణగణములను స్తుతించుపట్లను పోతన స్వాతంత్ర్యము హెచ్చుగా గోచరించును.

పురాణమునకుఁ బంచలక్షణమని నామాంతరము. పురాణములందు సర్గము, ప్రతిసర్గము, వంశము, వంశానుచరితము, మన్వంతరము అను వాని వర్ణనము లుండును. భాగవతమునందుగూడ నా పంచ లక్షణములు గోచరించును. ఇందు జగద్రక్షణమునకై విష్ణువు ధరించిన ఏకవింశత్యవతారములచరిత్రము వర్ణితమైయున్నది. పోతన భాగవతారంభ పద్యమున గావ్యార్థసూచనము నెంతో నిపుణముగాఁ గావించియున్నాఁడు. భగవంతుఁడు లోకరక్షైకారంభకుఁడు, భక్తపాలన కళాసంరంభకుఁడు, దానవోద్రేక స్తంభకుఁడు, కేళీలోల విలసద్దృగ్జాల సంభూత నానా కంజాతభవాండ కుంభకుఁడు. అట్టి పరాత్పరుఁడు నందాంగనా డింభకుఁడై జనించి యనేక మహాకార్యము లొనరించినాఁడు. పరమేశ్వరునికిఁగల యీ లక్షణములే భాగవతమున లెస్సగా వివరింపఁబడినవి. ఇందు ధ్రువుఁడు, అంబరీషుఁడు, ప్రహ్లాదుఁడు, గజేంద్రుఁడు మున్నగు భక్తశిఖామణుల కితరులవలనఁ గలిగిన యాపదలు తొలఁగించి వారిని విష్ణువు రక్షించిన వృత్తాంతములు మనోహరముగా వర్ణింపఁబడినవి.

భక్తుల కథలను వర్ణించునపుడు పోతన్న యనన్యసామాన్యమైన నేర్పు ప్రదర్శించినాఁడు. పరమేశ్వరుని హృదయపూర్వకముగా నమ్మిన ప్రపన్నులై యుండువారి కెట్టి యిక్కట్టులైన భాస్కరునిముందు హిమబిందువులవలెఁ బటాపంచలైపోవు నను విషయ మందు వ్యక్తముచేయబడినది. పురంజయుని కథ, గజేంద్రమోక్షణము మున్నగునవి చక్కని కథారూపకములు. వానిని మానవజీవితమున కనుసంధించి చూచినచోఁ దాత్త్వికములైన పరమార్థ విషయములు చక్కగాఁ బ్రతిభాసించును. గజేంద్రుఁడు జ్ఞానవంతుఁడైన జీవి. ఆతఁడు తాపత్రయపూరిత సంసార ప్రతిరూపమైన నక్రము బారి పడినాఁడు. అప్పు డతఁడు మూఢుడై వర్తింపక పరమేశ్వరుని ధ్యానించి ప్రపత్తి ప్రకటించెను. విష్ణువు సాక్షాత్కరించి నక్రమును శిక్షించి యాతని రక్షించినాఁడు. ఇట్లే మానవులు జ్ఞానముకల్గి వర్తించినచో వారికి మోక్షము కరతలామలక మగునను విషయము నీ కథ యన్యాపదేశముగా బోధించుచున్నది. నవమ స్కంధమున రాజవంశముల చరిత్రలు సంగ్రహముగా వర్ణింపఁబడినవి.

భాగవతమందలి యితరస్కంధము లన్నియు నొక యెత్తు, దశమస్కంధ మొక యెత్తు. ఇది భాగవత తారహారమునకుఁ దరళాయమానమైనది. ఇందు కృష్ణుని బాల్యక్రీడలును, గోపికల భక్తి భావమును మనోజ్ఞముగా వర్ణింపఁబడినవి. ఇందుఁ బోతన భగవంతుని దివ్యత్వమును, మానవత్వమును గలగలుపుచేసి వర్ణించినాఁడు. వ్రేతల జానపద జీవితమును, మధుర భక్తిని వర్ణించుపట్ల నతఁడు చూపిన నేర్పు వర్ణనాతీతమై యుండును. గోపికలు కృష్ణునియెడఁ జూపిన యనురాగము కేవల ప్రేరితమా, భక్తి ప్రేరితమా యని పరిశీలింతుమేని యచ్చటచ్చట నా రెండు విధములును గోచరించును. కాని సూక్ష్మముగాఁ బరికించినచో నది మోక్షరతికమైన మధుర శృంగారమనియే వ్యక్తమగును. వారు కృష్ణుని వీడి యొక్కక్షణమైన నుండలేకపోవుటకు శారీరకమైన తాపముకాక హార్దమైన తాపమే కారణము. అది కామప్రేరితమైన విరహ వేదనకాదు. భక్తిప్రేరితమైన పవిత్ర విరహము. వారు వలచినది కృష్ణుని బాహ్యరూపమును మాత్రమే కాదు; అతని పరబ్రహ్మ స్వరూపమును. కృష్ణుని పాదము లొక గోపికకు సనకాదిముని యోగసరణి నొప్పినవిగాను, శ్రుతి వధూ సీమంత వీధులఁ జెన్ను

మీరినవిగాను, పాలేటి రాచూలి పట్టుఁ గొమ్మలుగాను, ముక్తికాంతా మనో మోహనములుగాను గానిపించుట యిందుకు నిదర్శనము. గోపికలు, మధుసూదన సరస్వతి భక్తి రసాయనమున వర్ణించిన తుది భూమిక నందుకొన్న యుజ్జ్వల భక్తిమూర్తులు. అందుచేతనే పరమేశ్వరుఁడు వారి ననుగ్రహించి ఇహమున నిత్య సన్నిధానమును బరమున మోక్షమును బ్రసాదించినాఁడు.

పోతన వర్ణనలు మిక్కిలి రమణీయములుగా నుండును. ఆతఁడు వర్ణ్యమును సాక్షాత్కరింపఁ జేసి పఠితల నానంద పరవశులఁ గావించును. వడుగు వామనుఁడు బ్రహ్మాండమంతయు నావరించిన సందర్భమున నాతఁడు కావించిన వర్ణన మద్భుతముగానుండును.

శా॥ ఇంతింతై వటు డింతయై మఱియుఁ దా
నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున క
ల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై
నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్ర
హ్మాండాంత సంవర్ధియై
(భా॥ ౮ స్కం॥)

యను పద్యము చదువునప్పుడు భూమికి బారెఁడెత్తున నున్న వామనుఁడు "మహాతో మహీయుఁడై" సత్యపదము నందుకొన్న దివ్యరూపము గోచరింపక మానదు. ఇట్లే విష్ణువిద్వేషులు భగవంతు నిందించునప్పు డతఁడు వ్యాజస్తుతి నవలంబించి యొకవంక విష్ణునింద చేయుచున్నట్లే కనిపించి యా దేవుని పరబ్రహ్మత్వమునుగూడఁ బ్రత్యక్షము చేయుచుండును. ఈ పద్ధతి గ్రహించువారికిఁ బరమోదాత్తముగా గానిపించును. అక్రూరుఁడు కృష్ణ బలరాములను ధనుర్యాగమునకై మధురానగరమునకుఁ గొనిపోవుచు మధ్య యమునానదీతీరమున నాగిన సందర్భమునఁ బోతన వర్ణించిన సన్నివేశము పరమాద్భుతముగా నుండును. కృష్ణుఁ డక్రూరునడిగిన ప్రశ్నయు నక్రూరుఁ డిచ్చిన సమాధానమును వ్యంగ్య వైభవోపేతములై పఠితల కానంద పారవశ్యము కలిగించును.

పోతన భాగవతమున బ్రదర్శించిన భావ గాంభీర్య మప్రతిమానమైనది.

శా॥ ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై,
నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ
బాలిండ్లపైఁ నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁ
దై నాకరంబుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే
కాయంబు నాపాయమే.
(భా॥ ౮ స్కం॥)

శా॥ కారే రాజులు రాజ్యముల్ గలుగవే
గర్వోన్నతిం బొందరే
వారేరీ శిరి మూటగట్టుకొని పో
వం జాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం
బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే
యిక్కాలమున్ భార్గవా!
(భా॥ ౮ స్కం॥)

శా॥ ఏలా బ్రహ్మపదంబు వేదములకున్
వీక్షింపఁగారాని ని
న్నీలోకంబున నీవనాంతరమునం
దీమందలోఁ గృష్ణ యుం
చాలాపాది సమస్తభావములు నీ
యందే సమర్పించు నీ
ప్రేలం దొక్కని పాదరేణువులు పై
వేష్టించినం జాలదే.
(భా॥ ౧౦ స్కం॥)

మ॥ నిను హింసించిన పూతనాదులకు...

మున్నగు పద్యములలోని భావము లుదాత్తములై యెంతటి వజ్రహృదయులనైన ద్రవింపఁ జేయఁజాలును. ఆభావములు కొన్ని సంస్కృత భాగవతమునందలి వేయైనను బోతన భక్తి భావముచే మెఱుఁగెక్కినవి.

రస పాత్రపోషణమునఁ బోతన యందె వేసిన చేయి. నరకాసురవధ ఘట్టమున వీర శృంగార సమ్మేళనమును, దశమస్కంధమున భక్తి శృంగార సమ్మేళనమును ఆతఁడు వర్ణించిన విధాన మనన్య సాధ్యమైనది. ఇతర ఘట్టములం దాతఁడు భక్తిరసమును గుమ్మరించినాఁడు. ఏ రసమునైన నాతఁ డావేశముతో నుప్పొంగునట్లు వర్ణించును. ఇట్లే ధ్రువ ప్రహ్లా దాంబరీష బలి శుక్రాదుల పాత్రలఁ దీర్చిదిద్దుటలో నాతఁడెంతో మెలఁకువ ప్రదర్శించెను. వారి స్వరూప స్వభావములఁ బరికించిన పాఠకులు వారి నెన్నఁడును విస్మరింప కుండుటయే యందుకుఁ దార్కాణము.

పోతన శైలి సాటిలేనిది. అంతమధురముగా వ్రాయఁగలకవి యాంధ్రమున నింకొకఁడు లేఁడు. ధారాశుద్ధి కాతని పద్యములు పెట్టినది పేరు. సంస్కృత సమాసముల నధికముగనే వాడినను ఆతని రచన యర్థము కాకపోవుటయుండదు. ఆతని పదప్రయోగ మపూర్వమైనది. ఆతని కలంకారములందుఁ బ్రీతి హెచ్చు. శబ్దాలంకారమో, అర్థాలంకారమోయుండని పద్య మాతని రచనలోఁ గానరాదు. అంత్యానుప్రాసములయెడ నతనికి మక్కువ యెక్కువ. మన లాక్షణికులు శబ్దచిత్రముతోఁగూడిన కవిత్వ మధమమని నిరసించిరి. కాని పోతనకవిత్వ మ దు కపవాదము. రూపకోపమాలంకారముల వాడుటలో నతఁ డపారమైన నేర్పు చూపును. ఆతని యుపమానములు పెక్కు తత్త్వసంబంధులై రమణీయముగావుండును.

ఉ॥ ఊహ గలంగి జీవనపు
టోలమునం బడి పోరుచున్ మహా
మోహలతా నిబద్ధ పద
మున్ విడిపించుకొనంగ లేక సం
దేహముఁ బొందు దేహిక్రియ
దీనదశన్ గజ ముండె భీషణ
గ్రాహ దురంత దంత పరి
ఘట్టిత పాద ఖురాగ్ర శల్యమై.
(భా॥ ౮ స్క॥)

శా॥ పాద ద్వంద్వము నేల మోపి పవనున్
బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్
మారాకు హత్తించి ని
ష్ఖేద బ్రహ్మపదావలంబనరతిం
గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరి పా
దాక్రాంత నిర్వక్రమై.
(భా॥ ౮ స్కం॥)

మున్నగు పద్యములందలి యుపమ లిందుకు నిదర్శనములు. పోతన కవిత్వ మొక పాటక చేరీ యనిపించును. ఆతని పద్యములలో సహజ సంగీతము నిండియుండును. అనుప్రాసాది శబ్దాలంకారము లెడనెడ మృదంగధ్వనిని దలపించుచుండును. భాగవత మాంధ్రుల కింత యాదరపాత్ర మగుటకందలి యప్రతిమాన మధురప్రసన్న శైలియు నొక కారణము.

నిగమకల్పతరోర్గళితం ఫలం।
శుకముఖాన్మధురద్రవసమ్మితం।
పిబత భాగవతం రసమాలయం।
ముహు రహో రసికా భువి భావుకాః॥ *

(౨౧ వ పుట తరువాయి)

ప్రభుత్వాలను భూషించడమో, దూషించడమో చేస్తుంటారు. కాని పార్టీ ప్రభుత్వ పద్ధతిని స్వీకరించినందునా, దేశంలో ప్రాంతాలకూ, కేంద్రానికీ అవిచ్ఛేదక సంబంధం ఉన్నందున మొత్తం దేశంలో పార్టీలు, ఆంతరిక సమస్యలపట్లా, విదేశ విధానాలపట్లా అవలంబించే వైఖరీ పద్ధతులే ప్రజల జీవన ప్రవాహానికి మార్గాన్ని ఏర్పరుస్తాయి. అందుచేత ప్రాంతీయవార్తలూ, ప్రాంతీయ ప్రభుత్వ విధానాలు ప్రకటించి ప్రజలకు యధార్థ వార్తలనూ, ప్రభుత్వ విధానాలనూ, వాటి లోపాలోపాలనూ తెలుపుతూ, ప్రజల భావాలనూ, ప్రజల కోర్కెలనూ ప్రకటించే పత్రికల అవసరం ప్రముఖంగా ఉన్నా. దేశ స్వాతంత్ర్యాన్నీ, దేశ సమైక్యతనూ, ప్రజాస్వామ్య సిద్ధాంతాన్నీ, ఆంతరిక, విదేశీయ విధానాలను ఎప్పటికప్పుడు ప్రజలకు తెలుపుతూ, వాటిలోని లోపాలోపాలను వివరిస్తూ ప్రజలదృష్టిని వ్యాపకంచేసి ప్రజలను బాధ్యతలేని ప్రాంతీయ పౌరులనుగాగాక, బాధ్యతగల భారత పౌరులుగా తీర్చిదిద్దే పత్రికలు చాలా అవసరం. జాగృతి యీ అవసరాన్ని పూర్తిచేయడానికే అవతరించిందని, ఈ పది సంవత్సరాలది అవలంబించిన విధానం తెలుపుతున్నది.

జాగృతి అలాంటి అత్యవసర పరిస్థితుల్లోనే అవతరించిందికూడా. బ్రిటిషువారు తూర్పు వలసల నన్నిటినీ వరుసగా వదలించుకుని, 1947 లో భారతదేశానికికూడా స్వతంత్రం ఇచ్చి వెళ్ళిపోయారు.

పోతూ సాధ్యమైనంతవరకు తూర్పున సన్నికట భవిష్యత్తులో ఏదేశమూ ఆర్థికంగా, సామరికంగా, బలవంతంగా రూపొందకుండా ఉండేందుకు చేయవలసిన ప్రయత్నాలన్నీ చేశారు.

అందులో మొదటిది పాకిస్తాన్, భారత్ లని రెండుగా దేశాన్ని చీల్చడం. ఇది ఉభయులకూ క్షేమంకరంకాదు.

రెండవది సంస్థానాధిపతులకు స్వయం నిర్ణయ స్వాతంత్ర్యాన్ని ఇచ్చారు. ఫలితంగా కాశ్మీరు, హైదరాబాద్‌ల్లాంటి సమస్యలు వచ్చాయి.

మూడవది పాకిస్తాన్, భారత్ అనే విభజనతో ద్విరాష్ట్రి సిద్ధాంతానికి దారిచూపడమే కాక, క్రిస్టియన్ తత్వాన్నికూడా రెచ్చకొట్టారు. ఫలితంగా నాగస్తాన్ సమస్య అవతరించింది. కేరళలో కమ్యూనిష్టు ప్రభుత్వానికి దారితీసింది. ఉత్తర సరిహద్దుల్లో సిఖ్‌స్తాన్‌కు ప్రేరేపించింది.

నాల్గవది విదేశీస్థావరాల విషయం ఒకటి ఎదురైంది.

జాగృతి పైసమస్యల పట్ల చాలా వాస్తవికంగా ప్రవర్తించిందని ఈ పది సంవత్సరాలు ఈ పత్రికలో ప్రకటింపబడ్డ సంపాదకీయాలే సాక్ష్యం. పత్రిక సాఫల్యాన్ని ఎలా నిర్ణయించడం. ఎన్నాళ్ళు నడిచింది? ఎన్ని కాపీలు ఖర్చుఅయినాయి? ఎన్ని పేజీలు ఉండేవి? మొదలైన ప్రశ్నల జవాబులు పత్రికా విజయాన్ని నిర్ణయించలేవు.

స్వతంత్రం రావడంతోటే దేశంలో ఒక విచిత్రమైన మార్పు వచ్చింది. ఆంగ్లేయులు కాంగ్రెసుకు ప్రభుత్వాన్ని అప్పచెప్పారు. కొన్ని శతాబ్దాల బానిసత్వంవల్ల ప్రజలకు స్వాభిమానం, స్వయం నిర్ణయశక్తీ లేకుండాపోయింది. విదేశవిద్య, విదేశసంస్కృతి నిజమైన రాష్ట్రీయ భావాలను అణగద్రొక్కాయి. అదొక కుట్రగా అప్పట్లో జరుగుతూ ఉన్న సామరిక స్వతంత్రపోరాటాన్ని (Militant National struggle) అణగద్రొక్కి, ప్రజల నాయకత్వాన్ని పాశ్చాత్య ప్రభావానికి లొంగిపోయిన మితవాద నాయకులను పైకి తీసుకొనిరావడం జరిగింది. అయినా ప్రజలందరూ తమ విశ్వాసాలనూ, ఆదర్శాలనూ, కొంత నిగ్రహించుకొని, కలసి పోరాడేందుకు కాంగ్రెసులో చేరారు. దానివల్ల ప్రజల జాతీయభావాలకూ, సక్రమ ప్రజాస్వామ్య సాంప్రదాయానికీ వికృతి ఏర్పడినా, ఏకోన్ముఖంగా కలిసి పోరాడితేనే లాభం ఉంటుందని ప్రజలలో వ్యాపించిన నమ్మకంవల్ల కాంగ్రెస్ ఏర్పడి, బలపడి, పైకి రావడమే కాక, స్వాతంత్ర్య ప్రాప్తి తర్వాత అది ఒక వర్గపు స్వంత ఆస్తిగా, ఒకవర్గపు హక్కుగా మారిపోయి, పూర్వపు సమష్టి త్యాగాల కీర్తిని బావుకు తిందామనే పార్టీగా మారింది.

ఇదంతా సరియైన జాతీయ భావాలు లేనందున, వాస్తవ దృక్పథం లేనందున వచ్చింది. జాగృతి ఆనాడే 1948 లోనే స్పష్టంగా చెప్పింది. "మనం పోరాడి స్వతంత్రం పొందలేదు. ఆంగ్లేయుల దయాదానం అది. మనకు పూర్తి స్వాతంత్ర్యం రాలేదు. స్వతంత్రపోరాటంలో ఓడిపోయి లొంగిపోయి చేసేదిలేక వారిచ్చిన భూమితో తృప్తిపడ్డాం. మన బలహీనతను, ఓటమిని కప్పిపుచ్చుకోడం, ప్రజలను మోసగించి వారి నైతిక సక్రమ వికాసాన్ని నాశనం చేయడమే ' నని ఉద్ఘాటించడం, దేశ నాయకులకు వారి వారి కర్తవ్యాలను తెల్పడం ఎంత సాహసం, అయినా ఎంత అవసరం. ఆ సాహసాన్ని ప్రదర్శించడానికే, ఆ అవసరాన్ని తీర్చేందుకే జాగృతి మొండిధైర్యంతో అవతరించింది.

'పాకిస్థాన్, భారత్ లని దేశం ఖండింప బడడానికి ఆంగ్లేయులా, మహ్మదీయుల కుట్ర కారణంకాదు; వాటినిగుర్తించలేక, గుర్తించినవారు ఎంతపోరినా వినక, దేశఖండనకు దారితీసిన నాయకుల వివేకశూన్యత, రాజకీయపరిజ్ఞానలోపం, దూరదృష్టినశించడం, మొండితనం, అహంకారం, ఓటమినంగీకరించలేని నీచమనస్తత్వాలే కారణాలు. ఇప్పటికైనా ప్రజలు యధార్థం గ్రహిస్తే, వాస్తవరాజకీయాలను గురించి ఆలోచించే సామూహికశక్తి వస్తుంది" అని జాగృతి ఆనాడే సూచించిందంటే ఎంత ధైర్యంకావాలి. ఎంత నిశిత విమర్శనాశక్తి కావాలి.'

'ద్విరాష్ట్రి సిద్ధాంతాన్ని అంగీకరించింది కాంగ్రెసు. దానికి విరుగుడు అఖండభారత సిద్ధాంతమే. లేనిచో ప్రజలలో చీలికలువచ్చి ప్రతివర్గమూ వేరైపోతారు. అందుకనే నైతికంగానైనా వారిని కలిపిఉంచేందుకు, పరస్పర వైషమ్యాలనూ, ప్రాంతీయభావాలనూ, కుల, వర్గ, మతతత్వాలను జయించేందుకు-భారత విభజన మన ఓటమికి ఫలితం- మనలక్ష్యం అఖండ భారతం అని ఉద్ఘోషించాలి." అని జాగృతి చేసిన సూచనకు నిదర్శనగా ఈనాడు నాగా సమస్య, జార్ఖండ్, సిఖ్‌స్తాన్ సమస్య. ద్రావిడకజగం సమస్య, కాశ్మీర్ సమస్య. ప్రాంతీయ విభేద, వైషమ్యాలు సాక్షులై కన్పించడంలేదా ?

కాశ్మీర్ సమస్య విషయంలో హెచ్చరించి 'దేశం అంతా ఒకటేననీ, దేశప్రజలంతా ఒకటేననీ, మీకు నమ్మకంఉంటే కాశ్మీర్‌ను వెంటనే పూర్తిగా విలీనంచేసుకోండి; కాశ్మీర్ ప్రజలు భారతప్రజలేనని ప్రకటించండి.' అని సూచించింది. లేకపోతే కాశ్మీర్‌కూడా మనకు దక్కదని చెప్పింది. అయినా ప్రపంచపు పంచాయితీకి కాశ్మీర్ నప్పగించి, ఇప్పుడు కన్నీరు కారుస్తూ నిస్సహాయంగా కొరివితో తల బరుకుకున్నట్లు చేసిన కాంగ్రెస్ ప్రభుత్వ విధానాన్ని ఏమనాలి ?'

‘షేక్ అబ్దుల్లా ద్రోహి’ అని జాగృతి ప్రకటించినప్పుడు శ్రీ నెహ్రూ కౌగిలిలో వెచ్చదనాన్ని అనుభవిస్తూ షేర్-ఏ-కాశ్మీర్ అయి దేశంలో పర్యటించాడు. మరి యీనాడో?

‘మృదులా సారాభాయి లీలలు మోసంగా ఉన్నా’యని సుదూర దక్షిణంలో ఉన్న జాగృతి గ్రహించగలిగిందే, మరి కేంద్రం ఎందుకు గ్రహించలేదు.

కేరళలో క్రిస్టియన్లు చేస్తున్న ఆగడం విషమపరిస్థితులకు దారితీయవచ్చు, నాగా సమస్యయూ, క్రిష్టియన్లు ఇతర ప్రాంతాల్లో చేస్తూన్న ఆగడాలనూ ప్రభుత్వం గుర్తించాలి అని మొదటిసారిగా దక్షిణప్రజలకు తెలిపిన పత్రిక జాగృతే! ఇలా అనేక జాతీయ సమస్యల్లో ప్రభుత్వ విధానాలను, ప్రభుత్వం అనుసరించే అనుకరణ తత్వాన్ని, సడలింపు నీతిని, విమర్శించి ధైర్యంగా నిల్చున్నదీ. చెప్పినదాన్ని పరిణామాల దృష్ట్యా ఋజువుపరచి ప్రజలకు తెలిపి వారి ఆలోచనా పద్ధతులను రాష్ట్రీయ తత్వాలకు అనురూపంగా ప్రవహింపచేసింది జాగృతి మాత్రమే అని చెప్పడంలో వాస్తవాన్ని గుర్తించే హృదయం ఉన్నవారికి ఆశ్చర్యం ఏమీ కన్పించదు.

పత్రిక విజయం అక్కడే ఉంది. ప్రతుల అమ్మకం, ప్రకటనల సేకరణపైగాక ఎంత నిర్దుష్టంగా ప్రజా భావాలను మలచి సంక్షేమ ప్రజాస్వామ్య విధానానికి అనుకూలమైన మనస్తత్వాన్ని నిర్మిస్తున్నది అనే విషయంమీద పత్రికా విజయం ఆధారపడి ఉంటుంది. అలా చూస్తే అనేక జాతీయ సమస్యలను గురించి వాస్తవ వార్తలు ఒకరికి వ్యతిరేకమేమో ననే భయం కాని, భీరువుగానైనా జీవించి ఉండడమే కావాలనే కాపురుషభావంగానీ, ప్రజాప్రవాహం ఇలా ఉన్నదే, మరి వ్యతిరేకిస్తే ఎలా ననే సంకోచం లేకుండా ప్రకటించి, ప్రబోధించి, అలాంటి సమస్యలకై ఉద్యమాలు దేశంలో, కాశ్మీర్‌లో నడిచినా, గోవాలో నడిచినా దానికై భూమిక నిర్మించి, ప్రోత్సహించి, జయంలభించేట్టు సర్వ విధాలా, సరియైన విధంగా ప్రజలను నడిపించిన పత్రిక జాగృతి.

అఖిలభారత సమస్యలపట్ల యథార్థపరిజ్ఞానం, సమస్యలను వాస్తవ పరిష్కారం సూచించే మరోపత్రికే తెలుగులో లేదు. అందుకే ఏ పెట్టుబడీ లేకుండా, ప్రభుత్వ సహాకారం లేకపోగా ఒకొక్కప్పుడు వ్యతిరేకాన్నీ, బెదరింపులనూ సహిస్తూ, తట్టుకుంటూ ఈపది సంవత్సరాలు జాగృతి నడిచిందంటే అది జాగృతి అవలంబించిన నిర్దుష్ట వైఖరికి ఫలితం ఆ ఫలితంవల్లనే జాగృతి నిర్భయంగా ప్రజల్లోకి వెళ్ళిపోతున్నది.

ఇలా రాజకీయ, విధానాలేకాక, మిగతా జాతీయ రంగాలలో కూడా జాగృతి ఆంధ్ర పాఠకులకు అపారసేవ చేసింది. ఎందరో రచయితలను ప్రోత్సహించి, వారికి దారిచూపి, దిద్ది పదునెక్కిన రచయితలుగా తయారు చేసింది. పండితుల నాదరించింది. కథానికల పోటీలు జరుపుతూ కథకులకు ఉత్సాహాన్నిచ్చింది. చేనేతకై, గోసంరక్షణకై, అఖండ భారతానికై ఇంకా ఇతరజాతీయ ఉత్సవాల సందర్భాలకై ప్రత్యేక సంచికలను ప్రత్యేక ప్రయోజనాలతో వెలువరించింది. ఇన్ని చేసినా ఒక లోపం నాకు ఇంతవరకూ కన్పిస్తుంది. స్థానిక ప్రాంతీయ రాజకీయాల్లో ఆంధ్రజీవన విమర్శలో జాగృతికి స్థానం లేకుండా పోతున్నది. అది ప్రమాదకరం. స్థానిక సమస్యలపట్ల మనం అవలంబించే విధానం జాతీయ సంక్షేమం దృష్ట్యా ఎలా ఉండాలి అని చూపడం చాలా అవసరం. దానికై జాగృతి ప్రయత్నించక పోగడం తీరనిలోటే. అఖిలభారతీయ సమస్యలపట్ల ఆంధ్రుల నాకర్షించి, నిజానిజాలను తెలిపిన జాగృతి ప్రయత్నిస్తే స్థానిక సమస్యల పట్ల నిర్దుష్టంగా వ్యవహరించి, ప్రస్తుతం అల్లకల్లోలంలో ఉన్న పరిసర జీవితాన్నుంచికూడా ఒకదారి చూపగలుగుతుంది. అందుకే మునుపటిలా క్రూసేడింగ్ తత్వంతో జాగృతి పురోగమిస్తే ఇంకా పరిపూర్ణతను సాధించగలుగుతుంది.

ఈ దశాబ్ద్యుత్సవ సందర్భంలో ఈకోరికతో జాగృతి నిరంతరాయంగా సాగిపోవాలని కోరుతున్నాను. ★

పదేండ్ల తెనుగు నాటకరంగ సమీక్ష

# ప్రమాణగ్రంథాలాధారంగా నాటకరచనసాగాలి

## విదేశీవ్యామోహం, నీతి, ధర్మ వ్యతిరేకభావాలు ప్రమాదకరం

"శ్రీ వాత్సవ"

జాగృతి పత్రిక పది సంవత్సరాలపాటు వర్ధిల్లి ఈ శుభసమయంలో 11 వ జన్మదినోత్సవం చేసుకోవడం చాల సంతోషకరమైన విషయం. తెనుగుదేశంలో ఒక పత్రిక పదేండ్లు నిర్విరామంగా కొనసాగడం బాలపాప చిన్నెలు దాటి దినదిన ప్రవర్ధమానంగా కొనసాగుతూ ఉండటం విశేషమే. ఈ పదేండ్లలోనూ యావత్ భారతదేశంలోనూ, ఆంధ్రదేశంలోనూ కూడ ఎన్నో మార్పులు వచ్చాయి. నాటకరంగంలో కూడా మార్పులు మరీ హెచ్చుగా కన్పిస్తున్నవి. ఈ పదేండ్లలోనూ ఆంధ్రదేశంలో నాటక సమాజాలు అనేకం బయలుదేరాయి. వీనిలో ఎక్కువ భాగం ఖులాసాకోసం నాటకాలు ప్రదర్శించే అమెచ్యూరు నాటక సంఘాలే. వీటి సంఖ్య పెరిగేకొద్దీ వృత్తి నాటక సంఘాల సంఖ్య తగ్గిపోయింది. ఈ మార్పు మంచికా చెడ్డకా అని అడిగితే ఒకవిధంగా మంచికీ ఒకవిధంగా చెడ్డకు అని సమాధానం చెప్పుకోవచ్చు అమెచ్యూరు నాటకసంఘాలు నేడు ఆంధ్రదేశంలో ఊరూర ఏర్పడ్డాయి. బెజవాడవంటి పట్టణాలలో నలభై యాభైసంఘాలున్నవంటే నాటకకళలో ప్రజలకిగల ఉత్సాహం ఎంత మిక్కుటంగా ఉందో గమనించవచ్చు. ఈ సంఘాలవల్ల ఎక్కువ మంది నటీనటులు తమ సహజ నటనాభినయ ప్రజ్ఞ వెల్లడించడానికి అవకాశం కల్గుతున్నది. ఇన్ని సమాజాల ఉనికివల్ల, కొత్తనాటకాలు ప్రయోగం చేయడానికీ, కొత్త ప్రయోగాలు రంగస్థల మీద ప్రవేశపెట్టడానికీ వీలుగా ఉంది. దేశం మొత్తంమీద, ఊరూర ఏర్పడిన నాటక సమాజాలలో కేవలం వినోదంకోసమే కాక విశిష్టమైన నటనా కౌశలం ప్రదర్శించాలనే జిజ్ఞాస బయలుదేరింది. ఇది చాల అభిలషణీయమైన అంశం. వీరి ఇచ్చట తీర్చదగిన ఉత్తమనాటకాలు దొరకుతున్నవా అనేది ఒక ప్రశ్న! ఇంత ఉత్సాహంతో, ఎన్నో వ్యయప్రయాసలతో కూడిన నాటక ప్రదర్శనం చేస్తున్నపుడు ప్రేక్షకులవద్దనుండి సరియైన ప్రోత్సాహం లభిస్తున్నదా అనేది మరొక ప్రశ్న. ఈ రెండు ప్రశ్నలకు అసంతృప్తి కరమైన ప్రత్యుత్తరాలే వస్తాయి. అయినా యీ సమాజాలలో ఉత్సాహం పోలేదు. ఎప్పటికప్పుడు కొత్తనాటక సమాజాలు వస్తున్నాయి, కొత్తప్రయోగాలుచేసి కొత్త ప్రదర్శనలుప్రదర్శిస్తున్నారు. ఈ ఉత్సాహానికి కారణం ఏమిటి అని పర్యాలోకన చేస్తే కొన్నిశక్తులీ నాటక కళాభివృద్ధికి హేతువులని గమనించవచ్చు. ఈ దశాబ్ది ఆరంభంలో స్వాతంత్ర్యం రావడంతో పాటు ఒక రాజకీయ చైతన్యం ప్రజలలో కలిగింది. ఆ సమయంలో రాజకీయ ప్రచారం కోసం కొన్ని నాటకసంఘాలు వచ్చాయి. అవి కేవలం రాజకీయ నినాదాలతో, తమ వర్గ చైతన్యంకోసం ప్రయత్నంచేసినప్పటికీ రంగస్థలాన్ని ఒక ప్రబల సాధనంగామాత్రం ఉపయోగించుకున్నాయి. తెనుగు జాతికి పరిచితమైన వినోదాలలో బుర్రకథలు, వీధి భాగవతాలు, యక్షగానాలూ, నాటకాలూ ఇటువంటివి విరివిగా ఉపయోగించి ఊరూర ఆరుబయట రంగస్థలంమీద ప్రదర్శనలిచ్చి అశేష జనసమూహాలను ఆకర్షించాయి. సాంఘిక నాటకాలవైపు విముఖులయిన ప్రజలను, వృత్తి నాటకాలకంటె ఎక్కువగా ఆనందపరచాయి. అదొక పొంగులాగవచ్చి చల్లారిపోయింది. కాని ఆ ధోరణి రచనలూ, ప్రదర్శనలూ పోలేదు. నాటకకళ అభివృద్ధి పొందడానికి మరొక ప్రబల హేతువు పోటీలూ, బహుమతులూ. ఆంధ్ర నాటక కళా పరిషత్తు మొదట ఉత్తమ నాటకాలకూ, నాటికలకూ పోటీలు పెట్టి రచనకు, ప్రదర్శనకు, నటనకు బహుమతులు ఏర్పాటు చేసింది.

పరిషత్తుద్వారా ఎందరో కొత్త రచయితలూ, నటులూ, నటీమణులూ వెలుగులోకి వచ్చారు. వారందరికీ ఏటేటా బహుమతులు లభించడం అటుంచి, ఈ పోటీనాటకాలు వారు సినీమారంగంలో ప్రవేశించడానికి నిచ్చెనలలాగ పనిచేశాయి. ఈ కారణంచేతనే ఎందరో రచయితలూ, నటులూ, సినీమారంగంలో ప్రవేశించాలనే పరమలక్ష్యంతో నాటకాలు ప్రదర్శించడం, పోటీలలో పాల్గొనడం మొదలుపెట్టారు. స్పర్థవల్ల కళ కొంత వృద్ధి అయింది. కొందరు రచయితలూ, నటులూకూడ ఈ సాధనద్వారా సినీమారంగంలోకి ప్రవేశించారు. అక్కడ తమ కళకు తగిన సాఫల్యం పొందారు.

సినీమా యిలాగేకాక పరోక్షంగా మరొక విధంగాకూడ తెనుగునాట నాటకాభివృద్ధికి దోహదంచేసింది. సినీమాలో ప్రదర్శించే అంతర్నాటకాలద్వారానూ, సినీమాలో చూపించే ఆహార్యమూ, వాచకమూ, రంగాలంకరణ మొదలయిన సాధనలద్వారా ఒక వాస్తవికతవైపు మన నాటకసమాజాలదృష్టి ప్రసరించింది. సినీమాలలోవంటి వాస్తవ వాతావరణం తమ వస్త్రధారణవల్లా, ఆహార్యంవల్లా, రంగాలంకరణవల్లా, ఉచ్చారణవల్లా, నేపథ్య సంగీతంవల్లా తేవడానికి మన నాటకప్రయోక్తలు ప్రయత్నం చేస్తున్నారు. ధ్వని యంత్రాలూ, వెలుగుయంత్రాలూ, సెట్టింగులూ, వాద్యసమ్మేళనం, ప్లేబాక్ పద్ధతి సంగీతం మొదలైనవి ప్రవేశపెట్టి తమ నాటకాలలో సహజ వాతావరణం తెచ్చే కృషి చేస్తున్నారు. కొత్త ప్రయోగాలు ప్రవేశపెడ్తున్నారు. ఇది కొంతవరకు జయప్రదమైనట్టే చెప్పవచ్చును.

తెనుగు నాటకసంఘాలు వృద్ధిపొందడానికి మరొక దోహద శక్తి నేడు మన ఆంధ్రదేశంలో

వృద్ధిపొందిన కళాశాలలూ, ఆ కళాశాలలలోని నాటకసంఘాలున్నూ. విద్యార్థి నాటక సంఘాలు ప్రతి కళాశాలకూ, ప్రతి పాఠశాలకూ ఒకటి చొప్పున పనిచేస్తున్నవి. దీనికి ఏటా విశ్వవిద్యాలయంవారు పోటీలు జరిపి యువజన నటీనటులను ప్రోత్సహిస్తున్నారు. ఇదీగాక, దేశంమొత్తంమీద అంతర్విశ్వవిద్యాలయ విద్యార్థులకు నాటక ప్రదర్శనలు పోటీలు జరుపుతున్నారు. వీనివల్ల నాటక కళకు ఎక్కడ లేని ప్రోత్సాహమూ వచ్చింది. ఈ విద్యార్థులు తమ చదువులు పూర్తిచేసి ఏ ఉద్యోగంలోనో చేరినపుడుకూడ తమ అభిరుచులు అంతరించకుండా వేరే సమాజాలు పెట్టి అప్పుడప్పుడు ప్రదర్శనాలు ఏర్పాటుచేసుకొంటున్నారు. ఊరూర క్లబ్బుల తరఫునా, యువజన సంఘాల తరఫునా, కార్మిక సంఘాల తరఫునా, వివిధ సంస్థలతరఫునా ఆమెచ్యూర్ నాటక సంఘాలు పనిచేస్తున్నవి. సంవత్సరానికి ఒకటో రెండో ప్రదర్శన లిస్తున్నవి.

కొన్ని పట్టణాలలో నెలసరి చందాలు వసూలుచేసి కొందరు సభ్యులను చేర్చి వారి సహాయంవల్ల నెలకు ఒకటి రెండు ప్రదర్శనలు ఏర్పాటు చేసే సంఘాలు పనిచేస్తున్నవి. ఈ సంఘయాజమాన్యం క్రింద, ఎన్నో నాటకసమాజాలు తమ నాటకాలను ప్రదర్శించే అవకాశం ఏర్పడుతున్నది. ఇదంతా నాటక సంఘాలూ, నటులూ సంఖ్యాభివృద్ధి పొందడానికి అన్ని విధాల తోడ్పడింది. ఈ నాడు తెనుగుదేశంలో నాటకకళ అని విధాలా అభివృద్ధి పొందడానికి మంచి వాతారణ మున్నమాట నిజం.

అది పూర్తిగా వినియోగించుకొని తెనుగు నాటకకళ ఎన్ని విధాల నిజంగా వికాసం పొందగలిగిందీ అని మనం పరిశీలించుకోవాలి. ఈ నూతన చైతన్యంవల్ల, మన రంగస్థలంమీద ప్రయోగకళ కొంత అభివృద్ధి పొందింది. వెలుగు నీడలు మలచడంలోనూ, మైక్రోఫోన్ ఉపయోగించడంలోనూ, సెట్టింగులు వేయడంలోనూ స్వాభావికత తేవడానికి ప్రయోక్తలు ప్రయత్నించి కృతకృత్యులయ్యారు. హావభావ ప్రదర్శనంలోనూ, ఆంగిక వాచక సాత్వికాభినయంలోని సహజకళలోనూ మన నటీనటులు కొంత ప్రత్యేకత గణించారు. మంచిపేరు ప్రఖ్యాతులు సంపాదించారు.

అయితే రచనలో కాని, అభిరుచులలో కాని ఎక్కువ మార్పు రాలేదు. రచనలో ఏవో విదేశీ నాటకాలను తీసుకొని దానిని మన వాతావరణానికి తగినట్లు మార్చి, మన దేశీయ పాత్రలతో కొత్త నాటకాలు తయారు చేస్తున్నారు. ఇవి మనదేశీయవాతావరణం తేలేక పోయినప్పటికీ రంగస్థలంమీద చాల బాగా రక్తికట్టున్నాయి. అందుకే వీటికి పోటీలలో బహుమతులు లభించాయి. ఉదాహరణగా నాటకం, కాళరాత్రి, ఆకాశరామన్న, ఇనప తెరలు వంటి నాటకాలను పేర్కొనవచ్చును. ఇవిగాక, రాజకీయ నినాదాలు లేవదీసి వర్గ విభేదాలు పురస్కరించుకొని, ఒక తరగతి వారిని దూషించి మరొక తరగతివారిని ఆదర్శప్రాయులుగా చూపి ఉద్రేకంతో సంభాషణలు నడిపించి వ్రాసే రచనలు వచ్చాయి ఈ రచనలలో కూడ ఏ పాత్రలు వచ్చినా, ఏసన్నివేశాలు బయలు తెచ్చినా, ఒక నినాదం తీసుకొని దానిని ప్రచారం చేయడమే పరమావధిగా పెట్టుకొన్నట్లు కనిపిస్తుంది. అందుచేత ఈ నాటకాలుకూడ ఉత్తమ రచనలు అనిపించుకోలేదు. కాని నాటక రంగస్థలావసరాలు, రంగ విభజన, పాత్ర చిత్రణ, సంభాషణా నిర్వహణ ఇటువంటి విషయాలలో శ్రద్ధ తీసుకోవడం వల్ల కొందరు రచయితలు ఒక విధమైన కార్యసిద్ధి సాధించారు. ఇటువంటి రచయితలలో ఆచార్య ఆత్రేయ, సుంకర, పినిశెట్టి మొదలయిన వారిని చెప్పవచ్చు. నాటకానికి హెచ్చు ప్రయోజనం లేకుండా కేవలం వినోదంనిమిత్తం ఏవో కొన్ని పాత్రలను ప్రవేశపెట్టి, ఆ పాత్రలతో చిత్రవిచిత్ర సంభాషణలు పలికించి, రంగస్థలంమీద ఉన్నంతసేపు ప్రేక్షకుల్ని కవ్వించడంలో ఒక విధమైనజయం సాధించిన నాటకాలు మరి కొన్ని ఉన్నవి. అలాంటివి వ్రాయడంలో కొఱ్ఱపాటి గంగాధరరావు అందెవేసినచెయ్యి. నలభై నాటకాలకు పైగా వ్రాసి, వాటి ప్రదర్శనా సౌలభ్యంవల్ల ఆంధ్రదేశమంతటా ఎక్కువసార్లు ప్రదర్శించే నాటకాలు వెలువరించారు. ఈయన నాటకాలలో స్త్రీ పాత్రలు తక్కువ. కొన్నింటిలో అసలు స్త్రీ పాత్రలే ఉండవు. రంగాలు అనేకం వుండవు. దృశ్యాల మార్పు, సెట్సుచేయడం ఈ బెడద ఎక్కువ ఉండదు. పాత్రలు ప్రవేశించడం నిష్క్రమించడమూకూడ త్రొక్కుడుగాఉండదు. మధ్య అగ్నిప్రమాదం, దొంగతనం, తుపాను, అలజడి యిటువంటి వేవో వచ్చి నాటకీయత "మెలోడ్రామా" తీసుకొనివచ్చి ప్రేక్షకుల్ని విభ్రాంతుల్ని చేస్తాడు. ఈ చిటకాలు అన్ని తెలిసినకారణంచేతనే రక్తికట్టే నాటకాలు ఈ రచయిత వ్రాయగలిగాడు.

మొత్తంమీద, ఈ పదేండ్లలోనూ కొందరు రచయితలూ, ఎందరో నటులూ తెనుగుదేశంలో బయటికివచ్చారు. పేరు ప్రఖ్యాతులు పొందారు. ఇది ఆరోగ్యకరమైన విషయమే. కాని ప్రపంచ నాటకరంగంలో ఉత్తమ నాటకాలు అని పేరొందిన వానితో తుల తూగగల్గిన ఒక్క నాటకంకూడ మన తెనుగు దేశంలో ఇంతవరకు రాలేదు. అంతవరకు ఎందుకు; భారతీయ భాషలలోనే, బెంగాలీ, తమిళం, మరాటీ భాషలలో రంగస్థలం పొందిన అభివృద్ధి తెనుగు నాటకాలు సాధించలేకపోయాయి. తెనుగు రంగస్థలంలో తాత్కాలికంగా ప్రేక్షకుల్ని తన్మయుల్ని చేసినప్పటికీ, ఈ నాటకాల రచనలు చూస్తూ ఉంటే ఒక చౌకబారుతనం గోచరిస్తున్నది. దీనికి కారణం మనలో ఒక అల్ప సంతుష్టి ప్రబలడమే! తాము విదేశీ భాషలలో అధమరకం నాటకాలకు అనువాదాలు చేసి అవి ప్రదర్శనలో రక్తికట్టినప్పటికీ అవే ఉత్తమ రచనలని సంతృప్తి పొందుతున్నారు. తాత్కాలికంగా ప్రేక్షకుల్ని ఆకర్షించే నిమిత్తం కొన్ని అద్భుత దృశ్యాలు ప్రవేశపెట్టి స్టంట్సుచేస్తున్నారు. ఇటువంటి అనుకరణలవల్లా, చౌకబారు ప్రయత్నాలవల్లా, ఈనాటకాలు ప్రేక్షకులలో తెచ్చే ఫలితాలను మరచిపోతున్నారు.

ఈ నాటకాలలో హంతకులూ, దుండగులూ, చోరులూ, జారులూ ఉత్తమ నాయకులుగా చూపబడుతున్నారు. భగవంతుడు, వివాహము, ధర్మము, నీతి, పరిపాలన ఇటువంటివాటిని కించపరచి అవహేళనచేస్తున్నారు. సంఘ మర్యాద నతిక్రమించిన వారినీ, దుర్మార్గుల్నీ, దుశ్చరిత్రుల్నీ ఉగ్గడించి వారిని ఆదర్శ స్వరూపులుగా చిత్రిస్తున్నారు. ఈ నాటకాలలో తండ్రులందరూ పాషండులుగా కనిపిస్తారు; యువతీ యువకులందరూ బుద్ధిమంతులే. ధనవంతులందరూ దుర్మదాంధులు, పేదవారందరూ ఆదర్శప్రాయులు. జమీందారులూ, మిల్లు యజమానులూ పిశాచాలు; రైతులు, కార్మికులు పరమ సాధువులు. ఆడపిల్లలందరూ తల్లిదండ్రుల మాటల్ని ధిక్కరిస్తారు. విచ్చలవిడిగా చరిస్తారు. మాటాడితే సంఘాన్నీ, సంఘాచారాన్నీ దూషిస్తూ ఉద్రేకంతో ఉపన్యాసాలిస్తారు. ఇటువంటివి అన్నీ రంగస్థలంమీద ప్రదర్శించేటప్పుడు

నవ్వడానికీ, ప్రేక్షకులవద్దనుండి కరతాళ ధ్వనులు పొందడానికీ బాగానే ఉంటాయి. కాని యీ రచనల ప్రభావం అంతకంతకు నీతి విరుద్ధంగానూ, సంఘద్రోహకరంగానూ పరిణమించవచ్చు. అందుచేత ఈ సంఘవిద్రోహకరమైన రచనలు ప్రోత్సహించడం సంఘానికి ఆరోగ్యకరం కాదు. అయితే ఈ నాటకాల రచనలో అంత బలంలేదు. నీరసమైన రచనలే. అయినప్పటికీ వీటివల్ల కలిగే దుష్ఫలితాలు త్రోసిపుచ్చడానికి వీలులేదు.

మానవలోకంలో రామచంద్రులతోపాటు రావణాసురులుకూడ ఉంటారు. మంచితోపాటు చెడుకూడా ఉంటుంది. నాటకరంగం జీవితానికి దర్పణం అయినప్పుడు మంచి చెడులు రెండూ సమభాగాలలో నాటకాలలో చూపవలసిందే. కాని చివరకు అధర్మం నశించినట్టూ ధర్మసంస్థాపనం జరిగినట్టూ నిరూపించాలి, దుష్టశిక్షణ శిష్టరక్షణా జరిగినట్టూ లోక కళ్యాణం నెరవేరినట్టూ ప్రతిపాదించాలి. మనం చూస్తూన్న నేటి నాటకాలలో అలాజరగడం లేదు. అవినీతికి ప్రాముఖ్యం హెచ్చి, సంఘ విరోధులు గెలుపొందినట్లు చూపిస్తున్నారు. మన సినీమారంగంలో చూపుతూన్న దొంగవీరుల్నీ, దుర్నీతిపరుల్నీ, కామోద్రేకపరుల్నీ నాటకాలలోకూడ మహానాయకులుగా పైకి ఎత్తుతున్నారు. ఇది చాల ప్రమాదకరమైన భావన. ఇది ఎక్కువ పరిపాటి అయినకొద్దీ ఇటువంటి వాంఛలూ, ఆశయాలూ ప్రేక్షక లోకంలోకూడ పనిచేయవచ్చు. ఇది అరికట్టడానికి పోటీలుపెట్టూన్న పరిషత్తువంటి సంస్థలూ, సద్విమర్శకులూ కృషిచెయ్యాలి. మంచి లక్ష్యాలున్న రచయితలూ, నటులూ, సహృదయులూ ఒక ఉద్యమంలాగ బయలుదేరదీసి, మన సాహిత్యక్షేత్రంలో అంకురించిన కలుపు మొక్కల్ని వేళు చెయ్యాలి.

మరొకవిషయం: అభిరుచులు ఉన్నతపరచడం. అదికూడ సద్విమర్శకులవల్ల జరుగవలసిందే. మన నాటకరంగం దురదృష్టమో ఏమో నిష్పాక్షికంగా విమర్శ చేసేవారే లేరు. తమ అభిమానపాత్రులైన నటీ నటులయితే పొగడటం లేకపోతే నిరసనగా వ్రాయడం. మన సంప్రదాయాలలోగాని, విదేశ సంప్రదాయాలలోగాని కొన్ని ఉన్నత ప్రమాణాలు ఉన్నవి. ఆ మానదండంతో మన రచనలకు, మన నటనకు, మన ప్రదర్శనకు విలువకట్టి ఉత్తమ లక్ష్యాలవైపు ప్రేక్షకుల దృష్టి మరల్చేటట్టు చెయ్యాలి నాటకాల పోటీలూ, ప్రదర్శనలూ జరుగుతూన్నపుడు, కొందరు వేత్తలను పిలిపించి వారిచేత ఉపన్యాసాలిప్పించడం ఒక లాంఛనంగా జరుగుతున్నది. ఈ ఉపన్యాసాలిచ్చేవారు ఏదో తమకు తోచిన మాటలు ఆ సమయానికి నోటికి వచ్చినవి అంటున్నారుకాని చెప్పదలచుకొన్న విషయంలో పరిశోధనచేసి, చదివి, ముందు సన్నద్ధులై ఉపన్యాసాలివ్వడం లేదు. అందుచేత ఈ ఉపన్యాసాలకు ఎవ్వరూ విలువ యివ్వడంలేదు. ప్రేక్షకుల అభిరుచులు బాగు పరచడాని తెలిసిన పెద్దల ఉపన్యాసాలు ఎంతయినా ఉపకరిస్తవి. అంతేకాక, మన దేశీయ భాషలలోనూ, పాశ్చాత్య భాషలలోనూ ఉత్తమ నాటకాలని పేరుపొందిన వాటిని నాటక సమాజాలలో చదివి, వానిని గూర్చి చర్చించుట ద్వారా మన అభిరుచులు పెంచవచ్చు.

మన నాటకాలు ఎంత లోప భూయిష్ఠమైనప్పటికీ వాటికే ఉన్నవాటిలో ఉత్తమమైనవానికి సన్మానాలు, సత్కారాలు చేయడంలో, మరో ఉత్తమ నాటకం ఉన్నదని కూడ మనవారు ఊహించుకోలేకపోతున్నారు. కూపస్థమండూక న్యాయంతో తమ నాటకాలే గొప్పవి అనుకునే ప్రమాదం సంభవించవచ్చు. ఇలాంటి ప్రమాదం రానీయకుండా అరికట్టడానికి వివిధ భాషలలోని ఉత్తమ నాటకాలు, హిందీ, సంస్కృత, ఆంగ్లభాషలలో కాని, వాటి తెనుగు అనువాదాలలో కాని మన సమాజాలవారు పఠన సంఘాలుగా ఏర్పడి చదువుకోవచ్చు. ఆ చదువులో ఒక ఆహార్యం వినా ఆంగిక, వాచక, నాట్యకాభినయాలకు ప్రాధాన్యమీయవచ్చు. ఆవిధంగా మంచి నాటకాలతో పరిచయం ఏర్పడడానికి,మంచిఅభిరుచులు అలవరచుకోవడానికి వీలు చిక్కుతుంది.

ఆమధ్య మన తెనుగు దేశంలో రంగస్థలం ఎలాగున్నదో చూడటానికి విచ్చేసిన బ్రిటిష్ ప్రయోక్త 'అలెగ్జాండరు మూరు' మన నాటకాలు చూచి ఒక మాట అన్నాడు. ఈయన పదిసంవత్సరాలపాటు, మద్రాసు కళాక్షేత్రంలో ఉన్నాడు. పాకిస్తానులో పనిచేశాడు. ప్రస్తుతం ఏషియన్ నాటకసంస్థలో ప్రజానాటకరంగంగురించి చెప్పే ఆచార్యుడుగా పని చేస్తున్నాడు. ఇతడు తెనుగుదేశంలో సాంఘిక నాటకాలూ చూచాడు. వీధిభాగవతాలూ, పద్య నాటకాలూ చూచాడు. ప్రపంచ విజ్ఞాన సమితిలో పనిచేస్తున్న ఈకళాకారుడు ఇచ్చిన సలహా ఒకటే: "మీరు ఆధునిక పరికరాలతో పెద్ద రంగస్థలం కట్టి, అక్కడ లైటింగు,మైక్రోఫోనులు, సెట్టింగులూ ఇవన్నీ వేసి ఏదో చెయ్యాలని కుతూహల పడుతున్నారు. అవన్నీ పాశ్చాత్య లోకాన్ని చూచి చేసే అనుకరణలు. ఇవి యెంత గొప్పగా అనుకరించినా అసలు మాతృకతో సరిపోలలేవు. అది మీ ప్రతిభను, మీ ప్రజ్ఞాపాటవాలను నిరూపించే సాధనలు ఎన్నటికీ కాలేవు. మీరు నిజంగా ప్రదర్శించవలసినది మీ తెనుగుతనం; మీ ప్రత్యేకత; మీ ప్రతిభ. అది మీ యక్షగానాలలోనూ, మీ వీధినాటకాలలోనూ, మీ పద్యనాటకాలలోనూ కనిపిస్తున్నది అది ప్రదర్శించడానికి యీ పెద్ద రంగస్థలాలూ భవనాలూ అక్కరలేదు. పూర్వంలాగు, తీర్థాలలో, సంబరాలలో ప్రదర్శించే ఆరుబయట నాటకాలలాగే ప్రదర్శించాలి. లక్షలుఖర్చుపెట్టి రంగస్థలం కట్టినా, అక్కడ ప్రదర్శించవలసినవి మీ ఆచార సంప్రదాయాలను, మీ కళాహృదయాలను, మీ సహజ నటనా ప్రావీణ్యాన్నీ.చక్కగా చూడగలిగే తెనుగు నాటకాలుకాని తెనుగు వేషాలు వేసిన అధమరకం ఆంగ్ల నాటకాలూ, అమెరికన్ నాటకాలూకావు." అని ఆయన ప్రబోధించాడు.

ఆమాట లెంతయినా విలువయినవి.ఇవి నేటి తెనుగు నాటకరంగం అభివృద్ధి పొందడానికి ఎంతయినా తోడ్పడతాయి.

నేడు తెనుగుదేశంలో నటీనటులకు కొదువ

లేదు. రచయితలకు కొదువలేదు. నాటకాలంటే ప్రజలలో ఉత్సాహానికి కొదువలేదు. అయితే ఈ ఉత్సాహమూ, ఈ ప్రజ్ఞ తప్పుత్రోవలలో దుర్వినియోగం అయిపోతుందేయని నిజమైన కళాభిమానులు మొరపెడుతున్నారు.

నృత్య సంగీతాత్మకమైన నాటకాలు, యక్షగానాలూ, పూర్వం రంగస్థలాన్ని ప్రజానురంజకంచేసిన పద్యనాటకాలూ తిరిగి ఉత్తమోత్తమంగా ప్రదర్శించాలి. అపస్వరాలకీ అపశ్రుతులకీ ఎంతమాత్రం తావీయకూడదు. మన యక్షగానాలలో సంఖ్యకిలోటులేదు. పద్యనాటకాలకు లోటులేదు. ఏటూ చ్చి వాటిని ఉత్తమలక్ష్యాలతో చక్కని సంగీతంతో సహృదయ ప్రీతిపాత్రంగా ప్రదర్శించాలి. దానికి అమెచ్యూర్ సంఘాలతోపాటు వృత్తి సంఘాలు పైకిరావాలి. ప్రస్తుతం మన తెనుగునాట నాటకసంఘాల సంఖ్య అమితంగాఉంది. ఎవరికి వారు విడి విడిగా ఏవో ప్రయత్నాలు చేస్తున్నారుతప్ప అందరూ ఒక ఉన్నత లక్ష్యం పెట్టుకొని దానివైపు పురోగమించాలనీ, పట్టుదలతో దీక్షతో పనిచెయ్యాలనే కాంక్షలేదు. వ్యష్టిప్రయత్నంతప్ప సమష్టి ప్రయత్నంలేదు.

ఎన్ని నాటక సంఘాలున్నప్పటికీ వీటిని ఉత్తమ లక్ష్యాలవైపు ముందంజ వేయించే సంఘటనా శక్తి ప్రస్తుతం మనదేశంలో లోపించియున్నది. ఆ సంఘటనా శక్తి యేర్పడి, అమెచ్యూరు నాటక సంఘాలకుగాని, వృత్తి సంఘాలకుగాని సరియైన శిక్షణ, పోషణ యిచ్చి సక్రమ మార్గాలలో నడిపించాలి. అటువంటి సంఘటనా శక్తి ఆంధ్ర నాటక కళా పరిషత్తు, సంగీత నాటక అకాడమీవంటి సంస్థలు సమకూర్చ వచ్చు. అయితే సంగీత నాటక అకాడమీ యేర్పడి సంవత్సరమైనా, ఏ యున్నత లక్ష్యాన్నీ సాధించలేక అమిత వ్యయప్రయాసలతో ఒక సర్వసభ్య సమావేశం, ఒకటి రెండు ప్రదర్శనలు చేసి సంతృప్తిపడింది. ఈ ప్రదర్శనలు కాని, ఈ సమావేశాలుకాని అకాడమీ ప్రతిష్ఠలను పెంచేవిగామాత్రం లేవని సహృదయులు నొచ్చుకున్నారు.

ఏది యెలాగయినా ఆంధ్రదేశంలోని ఈ యుత్సాహం చల్లారిపోకుండా యీ వేడి యున్నపుడే ఉన్నత ఉత్తమ లక్ష్యాలవైపు సమాజాల దృష్టి, సామాజికుల దృష్టి మరల్చి, ఆంధ్రనటుల అభినయ ప్రజ్ఞ అఖిలభారత లోక ప్రఖ్యాతి ఆర్జించేటట్లు చెయ్యాలి. ఈ సంకల్పంతో ఏ చిన్న కృషి జరిగినా అది ప్రోత్సహించ వలసిందే! ★

(36 వ పుట తరువాయి)

నాశనం కావటమే గాకుండా ప్రపంచాన్ని మొత్తాన్ని ధ్వంసంచేయ పూనుకున్న భస్మాసురుడు అయింది.

ఇదే ఆశయసాధనకు రాజ్యంకూడా సృజించారు మనద్రష్టలు. ప్రభుత్వం, శాసనం ఎందుకు ? ప్రతిహిందువు నిస్సంకోచంగా, నిర్భయంగా, నిరాఘాటంగా పురోగమించటానికి. తామనుకున్నదే పరమసత్యమని విర్రవీగే దురహంకారులను, దురాశాపీడితులైన విదేశీయ దోపిడీ మూకలను, సన్మార్గులను పీడించి దుష్టవర్తనులను నిరోధించటానికి రాజుగాని, అధ్యక్షుడుగాని, రాజరికంగాని, ప్రజాస్వామికంగాని మద, మోహ, ధనాశా, పదవీపీడితులైన రాజకీయనాయకులకు 'శాసన నిర్మాణ' అధికారం లేదు. నియమ నిగ్రహ జీవితాన్ని గడుపుతూ, స్వసుఖాలను వదలి, కక్షలకు, పోరాటాలకు అతీతంగా వుండే మహర్షులే శాసనకర్తలు. వీరి శాసనమే ఏరాజయినా పాలించాలి. రాజు కెప్పుడు శాసన నిర్మాణాధికారం లేదు. ధర్మాన్ని రాజు పాలించి తీరవలసిందే. అతడు నిరంకుశుడు (autocrat), నియంత (dictator) కాడు. అతడిని సన్మార్గాన నడపటానికి మంత్రిమండలి వుండేది. లోకకంటకులైన రాజుల పిచ్చికుక్కలను వేటాడినట్లు వేటాడి చంపమని ధర్మజ్ఞుల ఆదేశం.

ఆయుర్వేద వైద్యశాస్త్రం సహితం హిందువుని ఆరోగ్యం కాపాడుకోమని, వందసంవత్సరాలు ధృఢశరీరుడై జీవించమని శాసిస్తున్నది. ధృఢశరీరం లేనిదే, మోక్షగామి కాలేడు. అన్నిశాస్త్రాలు, అన్ని కళలకు గమ్యం మోక్షప్రాప్తి.

ప్రపంచంలో నేడు రెండురాజ్యాలు అగ్రస్థానంలో వున్నాయి. రష్యా నేడు 'కమ్యూనిజం' అనే తత్వాన్ని ప్రపంచంలో వ్యాప్తి చెయ్య నడుంకట్టింది. కమ్యూనిజం అనేది ఒక ఆర్థికతత్వంమాత్రమే కాదు. ఇదొక జీవిత సూత్ర ప్రణాళిక. అదేవిధంగా అమెరికా ప్రజాస్వామిక- పెట్టుబడి విధానాన్ని ప్రపంచంలో వ్యాప్తిచేయ కృషిచేస్తున్నది. ఈరెండు తత్వాలకు మూలం మానవుని భౌతిక వాంఛా తృప్తి. మానవుడు సుఖం, శాంతి పొందాలంటే అతడి కోరికలన్నీ తీరాలి. అతడి కోరికలన్నీ తీర్చగలగటమే పురోభివృద్ధి. కొన్ని కోరికలు తీరినట్లల్లా కొత్తవి పెరుగుతుంటాయి వాటిని మళ్ళీ తీర్చుకోవటమే ప్రగతి లక్షణం. ఈ లక్ష్యసాధనకు కమ్యూనిజం మానవులను ఒక ఖైదీలుగా ప్రపంచాన్ని ఒక చెరసాలగా పరిగణిస్తున్నది. పెంపుడు కుక్కకు పెట్టినట్లు ఇంత తిండి, గుడ్డ, తదితర సుఖాలు ఇస్తారు. అందువల్ల కమ్యూనిష్టు ప్రభుత్వం ఒక యజమాని, ప్రజలు బానిసలు. భౌతిక వాంఛలు తీర్చుకోటానికి మానవుడు ఈ వ్యవస్థలో తన స్వాతంత్రాన్ని త్యాగంచెయ్యక తప్పదు. ఇక అమెరికాలో పెట్టుబడిదారి విధానంక్రింద నిరంతర ఆర్థిక సంఘర్షణలో ధనికుడు, తెలివితేటలు కలిగిన మానవుడు దరిద్రుని, తెలివితక్కువ వానిని పాలిస్తుంటాడు. కాబట్టి రష్యా అమెరికాల వ్యవస్థల ఆదర్శం భౌతికవాంఛా తృప్తి.

ఇక హిందూరాష్ట్ర వ్యవస్థలో ఎవడు వందనీయుడు ? ఎవడైతే తన కోరికలను తగ్గించుకొని, నియమ నిగ్రహపూరిత జీవితం నడుపుతుంటాడో వాడే గౌరవనీయుడు. ఎంత భూస్వామి అయినా, ఎంత ధనవంతుడయినా' ఎంత విద్యావంతుడయినా ఈ 'సన్యాసి'కి ప్రణమిల్లవలసిందే. అతడి శాసనాన్ని అంగీకరించవలసిందే.

హిందూ జీవన వ్యవస్థ 'కర్మ-పునర్జన్మ'ల సిద్ధాంతంమీద ఆధారపడింది. మానవుడు సకల జీవరాసులలో స్వతంత్రుడు. తన భవితవ్యానికి తానే కర్త. తన ప్రస్తుత జీవితానికి పునాది పూర్వజన్మలో అతడు చేసిన కర్మ. వచ్చే జన్మలో అతడెట్లా వుండాలనుకుంటాడో ఈ జన్మలో అతడు చేసే కర్మమీద ఆధారపడి వుంది. ఒక ఆదర్శాన్ని, ఒక ఆశయాన్ని సాధించటానికి ఒకజన్మ చాలదు. అందువల్ల క్రితం జన్మలో సాధించినది ఈ జన్మలో ఆది అవుతుంది; లేకపోతే శంకర, వివేకానంద, రామానుజుల బాల్యంలోనే విశేష వ్యక్తిత్వానికి, అసమాన ధీశక్తికి వేరొక కారణం ఏమీలేదు. ఈ సిద్ధాంతాన్ని, అమెరికన్ రష్యన్ వ్యవస్థలు అంగీకరించవు. అనుభవించే దంతా ఈజన్మంలోనే అనుభవించాలి. చచ్చేదాకా అనుభవించాలిసిందే. ఆతర్వాత విషయం అనవసరం. మానవులకు సర్వసుఖాలను ఇచ్చే రాజకీయ - సాంఘిక - ఆర్థిక వ్యవస్థే అత్యుత్తమమైనదని వారి భావన, కాన మనకు, పాశ్చాత్యులకు ఎంత వ్యత్యాసం వుందో మనకు తెలుస్తున్నది.

హిందూరాష్ట్ర భావనలో హిందువులు భౌతిక సుఖాలకు దూరంగా వుండాలని కాదు. భోగికానిదే త్యాగి కాడనే సూత్రం వుంది. మనమెప్పుడు భౌతిక సంపదను కాలదన్న లేదు. భారతదేశం రత్నగర్భగా ప్రఖ్యాతిగడించిందని ఎవరునూ మరచిపోరాదు. అయితే భౌతిక సంపదే జీవిత పరమ ఆశయంకాదు. దానికి తోడు అధ్యాత్మికతను జోడించాలి. అందువల్ల భౌతిక - ఆధ్యాత్మిక సమన్వయమే హిందూరాష్ట్ర ఆశయం. ధనాన్ని సంపాదించరాదనే సూత్రం ఎక్కడా లేదు. ఎంతైనా సంపాదించవచ్చు. కాని ఆ సంపదకు తాను యజమాని కాడు... తాను ధర్మకర్తమాత్రమే. తాను ఎక్కడినుంచి ఈ సంపదను సంపాదించాడో, దానిని ఆ సమాజానికే సమర్పించాలి. ఇదే ఆశ్రమ ధర్మ రహస్యం.

హిందూ ధర్మీయులకు ఈ దేశం కర్మక్షేత్రం. ఈదేశంలో అరవిందుడన్నట్లు మానవాతీతుల (Super human beings) ను తయారుచేసే ఒక మహా పరిశోధన విదేశీయ పాలనలో ఆగిపోయింది. హిందూ దర్శనాల ఆశయాల ప్రకారం రాజకీయ, ఆర్థిక, సాంఘిక వ్యవస్థల పురోగమనం ఆగిపోయింది. వాటిని హిందూరాష్ట్రంలో తిరిగి పుష్పింపచేయుటమే ఆశయం. ప్రపంచానికి ఏదో ఒక సందేశాన్ని ఇవ్వటానికే మనలను భగవంతుడు నాశనంకాకుండా కాపాడాడు. ఒక ఆదర్శ సమాజాన్ని, ఆదర్శమానవులను ప్రపంచానికి ఇవ్వటమే మన స్వరాజ్య, స్వధర్మ, స్వతంత్ర పరమార్థం: ఇది కాకపోతే రోమను, గ్రీకు, ఈజిప్టు, బాబిలోనియా, పర్షియా నాగరికతల లాగా రూపుమాసివుండేదేగదా ! గాన హిందూరాష్ట్ర నిర్మాణం భగవదాశయం. అందువల్లనే ధర్మస్థాపనకు భగవానుడైన శ్రీకృష్ణుడు ఎన్ని జన్మలైనా ఎత్తుతానని మనకు హామీ ఇచ్చాడు.

ఈ మధ్య శ్రీ సి. రాజగోపాలాచారిగారు మాట్లాడుతూ ధర్మరహితరాజ్యాంగం విఫలమయిందన్నారు. ధర్మరహిత విద్యావిధానం విద్యార్థులను నైతికంగా దరిద్రులను చేసిందన్నారు. మన మహర్షులపట్ల విశ్వాసం, ఆదరం నశించితే మన తర్వాత వచ్చేవారు మనలను కృతఘ్నులుగా గర్హిస్తారు. కాన వారి ఆశయాలను, మనం ఆచరించి, హిందువులు శారీరకంగా (Physical) హిందూ తల్లిదండ్రులకు జన్మించినవారుగానే గాకుండా, నిజమైన హిందువులుగా జీవించటానికి అనుకూలమయిన హిందూరాష్ట్ర పునర్నిర్మాణం జరుగక తప్పదు.

— శ్రీ వీరంరాజు.

# ప్రశ్నలు? సమాధానాలు!

★ పరిమి సాంబశివరావు, విజయనగరం

పాకిస్థాన్, బర్మావగైరా దేశాల్లో వచ్చిన సైనికశాసన పరిస్థితివంటిది ఇండియాలో ఏర్పడబోదన్నారు శ్రీ నెహ్రూ...

నిజమేకావచ్చు. కాని కొల్లేటి ముంపు కొండుభొట్లుకు చెప్పివస్తుందను కోరాదు.

తక్కువ వేతనాలు పుచ్చుకుంటున్న మధ్యతరగతి ఉద్యోగులను పొదుపు ఉద్యమానికి సామ్మింమంటూ, రెండవప్రక్క ప్రభుత్వాధికార్ల విలాసాలకు భారీగా డబ్బు ఖర్చుపెట్టడాన్ని ఏమనాలి ?

డివిజన్ ఆఫ్ లేబర్! కూచమ్మకూడబెట్టేందుకు, మాచమ్మ మాయంచేసేందుకు !

★ ఆర్. రామప్ప, వరంగల్

మన మాజీ ఉపమంత్రి ఒకరు ఇటీవల అమెరికాలో 'మాదేశంలో ఆర్. యస్. యస్. లాంటి సంస్థలున్నంతవరకు మాకు కమ్యూనిష్టు భయం లేదన్నారట...

భావప్రకటనా స్వాతంత్ర్యానికి భారత్ కన్న అమెరికాయే నయమనుకొనిఉంటారు ! ఇంతకూ ఆయనన్నది నిజం.

★ తిరునగరు జనార్దన, సూర్యాపేట

పాకిస్థాన్, బర్మా, థాయ్‌లెండ్ ఇత్యాది చోట్ల ఉన్న సైనిక పాలనలలో ఎవరు ఎక్కువ ప్రజా స్వామ్యంగా వ్యవహరిస్తారు?

అశుద్ధంలో ఏభాగం మంచిదన్నట్లుంది ప్రశ్న.

★ పి. సురేంద్ర, హైద్రాబాద్

గోహత్యను ఆంధ్రలో నిషేధిస్తే కొన్ని లక్షలు నష్టము వస్తుందంటున్నారట కొందరు మంత్రులు...

వారికా లేక కసాయిలాలకు, వెటర్నరీ శాఖీయులకా?

★ ఎం. వి. సుబ్బారెడ్డి, పొదిలి

గురూ! రాష్ట్రీయ స్వయంసేవక సంఘము మత సంస్థయని, పరమత ద్వేషియని, చివరకు దేశాన్ని అల్లకల్లోలం చేస్తుందని చెప్తారు మీ వ్యాఖ్య?

చోరులు, జారులు, గబ్బిలములు, గుడ్డగూబలు సూర్యుని వేలనిందించునో నీవెరుగవా శిష్యా?

అన్నగారూ ! ఎన్నికల సమయమున ఆమాయిక ప్రజల నోళ్లుకొట్టి బుట్టలో ఓట్లు వేయించుకున్నవారు మరల ఎన్నికలు వచ్చువరకు మచ్చునకైనను కానరారు. మీ వ్యాఖ్య?

పాలుపితికినతర్వాత మళ్ళీ చేపు వచ్చేదాకా కుండలో కూర్చొనమంటారా?

గురువుగారూ ! ధర్మమునకు అధర్మమునకు దూరమెంత?

ఏమాత్రము దూరమును లేదు ధర్మము దాటగనే అధర్మమువచ్చును శిష్యా!

★ ఎన్ లక్ష్మీనారాయణ, గుంటకల్

విశ్రాంతి కావాలనేవారికి కాంగ్రెసులో స్థానంలేదని శ్రీ నెహ్రూగారన్నారు...

తాము విశ్రాంతికై కులూలోయ వెళ్లినప్పటిపార్టీ పరిస్థితిపై వ్యాఖ్యకాదు కదా !

'రైతుపట్ల నిర్లక్ష్యం చూపడంవల్లనే అధికాహారోత్పత్తి దెబ్బతింటోంద'నే నినాదం నూటికి నూరునయాపైసలు సత్యమంటాను మీరేమంటారు ?

50 నయాపైసలు మాత్రమే. గోసంతతిఎడ నిర్లక్ష్యంకూడా మన ఆహారసమస్యకు పెద్దకారణం.

శ్రీ జయప్రకాశ్ భూదానయజ్ఞం ఎంతవరకు వచ్చింది ?

ప్రస్తుతం 'పదవీదానం' చేసేవారికోసం వెదుకుతున్నారంటున్నారు కొందరు సాహసులు !

★ పెంపటి శ్రీనివాసశాస్త్రి, బ్రాహ్మణపల్లి

కాశ్మీర్, కాల్వనీటి సమస్యలు శాంతియుతంగా తేలకపోతే బలప్రయోగం తప్పదన్న పాక్ నియంత ఆయూబ్ ఖాన్ బెదిరింపుపై మీ వ్యాఖ్య ?

బెదరింపులని భావించకండి. కాశ్మీరుపై దండయాత్రను నడిపిందీతడే. చూస్తూ ఊరుకునే పాలంకాపరి ఉండగా, పోయే గొడ్లకీ ప్రపంచంలో కరువు లేదు!

★ టి. రామాచార్యులు, తెనాలి

వికలాంగులై, తిండి, గుడ్డకూడా ఎరుగని నిరుపేదలకు ఆశ్రయాలు నెలకొల్పలేని మన ప్రభుత్వం అన్ని హంగులూ ఉన్నవారికి విహారయాత్రకు చిత్తూరు జిల్లాలోని హార్స్లీ కొండపై 10 లక్షలు ఖర్చుచేయడంలో ఆంతర్యమేమంటారు?

ఉన్న కాస్తడబ్బు ఈ కోట్లకొలది తిండిలేనివారి కెలా సరిపోతుంది ?

ధాన్యపు ధరలు రైతులకూ గిట్టుబాటుగాక, పేదవారికి ఆ ధరలుకూడా భారమైన ఈ విషమసమస్యకు పరిష్కారమార్గమేమంటారు ?

విపులంగా చర్చించదగిన సమస్య ఇది. క్లుప్తంగా చెప్పాలంటే మన ప్రభుత్వ ఆర్థికవిధానం - పూర్తిగా మారాలి. లేదా ఈ ప్రభుత్వమైనా మారాలి.

(42 వ పుట తరువాయి)

పశు ఉద్ధార కేంద్రాలవంటి సంస్థలు ఎంత వరకు ఉపయోగిస్తాయి?

౫. పశువధను నిషేధించే నేటి శాసనాలు, వాటిని అమలు జరుపుటలో ప్రభుత్వ పథకాలు - వీటి విషయమై దర్యాప్తు.

## 4. గోసంవర్ధన సమితి సిఫార్సులు

పై సమితి ఈ క్రింది విధంగా సిఫార్సు చేసింది:

భారతదేశంలో ఎట్టిపరిస్థితులలోనూ పశువధ అవాంఛనీయమేనని ఈ సమితి భావిస్తోంది. భారతదేశంయొక్క సమృద్ధి చాలవరకు దాని పశుధనంపై ఆధారపడిఉంది. పశువధ సంపూర్ణంగా నిషేధింపబడి, దురవస్థలో ఉన్న పశువుల స్థితి చక్కబరచబడినప్పుడే దేశంయొక్క ఆత్మసంతుష్టమవుతుంది. ఈ ఉద్దేశాన్ని సఫలంచేయటంకోసం సమితి ఈ క్రింది పథకాలు అమలు జరుపబడాలని భావిస్తోంది.

౧. 14 ఏండ్ల పైబడిన పశువులు; పని చేయటానికీ, సంతానోత్పత్తికీ పనికిరానివీ; వికలాంగులవటం వల్ల, రోగాలవల్ల పనిచేయలేనివీ, సంతానం ఇవ్వలేనివీ- అవి ఏ వయస్సువైనాసరే- అయిన పశువులుమినహా మిగతావాటన్నిటివధ నిషేధింపబడాలి.

౨. అధికార పత్రం లేకుండా జరిగే పశువధ చట్టరీత్యా శిక్షార్హం కావాలి.

3. వీలైనంత వరకూ పశువధ వెంటనే పూర్తిగా నిషేధింపబడాలి. అయితే శాసనం అమలులోకి వచ్చిన తర్వాత రెండేళ్ళలోగా నిరుపయోగ పశువుల పోషణకై ఎక్కడెక్కడ గోసదనాలు స్థాపించాలో వాటి కెంత ఖర్చవుతుందో వివరాలు తయారుచేసి, వాటికి సరైన ఏర్పాట్లు చేయటం జరగాలి. గోశాల పన్ను వేసి ఆధనాన్ని గోశాలల, గోసదనాల ఉన్నతి కొరకు వినియోగించాలి.

విశ్వసనీయమైన లెక్కలు లేనందువల్ల దేశంలోని పశుసంఖ్యలో 2% పనికిరానివనీ, 8% అనుత్పాదకములని, ఆర్థికంగా లాభదాయకములు కావనీ అంచనా వేయబడింది. అంటే సుమారు 28 లక్షల పశువులు పనికిరానివనీ, 1 కోటీ 12 లక్షల పశువులు నష్టదాయకములనీ అర్థం. నాటి కేంద్రీయ వ్యవసాయ శాఖామాత్యులు శ్రీ జైరామ్‌దాస్ దౌలత్‌రామ్ రెండు సిఫార్సులను ఆమోదించారు. మిగతా సఫార్సులను ప్రాంత ప్రభుత్వాలకు వారి అభిప్రాయాన్ని తెలుపటానికి పంపారు. ఆ తర్వాత రాజ్యాంగ నిర్ణాయకసభ 48 వ సూత్రములో ఇలా పేర్కొన్నది:

## 5. భారత రాజ్యాంగం

"ప్రభుత్వం వ్యవసాయం, పశుపోషణ ఆధునిక వైజ్ఞానిక పద్ధతులలో సంఘటితం చేయటానికి ప్రయత్నించాలి; విశేషంగా పశువంశోద్ధరణకు, వంశరక్షణకు, ఆవుల, దూడలను, పాలిచ్చేవి, కృషి యోగ్యమైనవి అయిన పశువుల వధపై నిషేధం పెట్టటానికి ప్రయత్నించాలి."

ఈ విధంగా మన రాజ్యాంగం శాసన విషయకమైన సమస్యను పరిష్కరించింది. పశురక్షణ, పశువంశాభివృద్ధి- అనే సిద్ధాంతానికి ప్రజాభిప్రాయానుసారం పరిపుష్టి లభించింది. అయితే ప్రభుత్వం- ముఖ్యంగా ప్రాంత ప్రభుత్వాలు-రాజ్యాంగంయొక్క 48 వ సూత్రాన్ని అవశ్యం పాలించాలనే విషయంపై పూర్తి శ్రద్ధను తీసుకోలేదు. 37 వ సూత్రానుసారం ఈ సిద్ధాంతం దేశ ప్రభుత్వానికి మౌలికమైనది, రాజ్యనీతికి ఆధారభూతమైనది అయినందువల్ల రాజ్యాంగంయొక్క ఇతర సూత్రాలతో సమానంగా ప్రభావవంతమై ఉండవలసింది.

(సశేషం)

స్త్రీ జనాభ్యుదయాసక్తై

# నేటి మహిళా నాయకత్వం పూర్తిగా మారాలి

## గృహ, సమాజ బాధ్యతా నిర్వహణంలో సమన్వయం కావాలి

## భారతీయ నారీత్వానికి ప్రాధాన్యత నివ్వాలి

శ్రీమతి కమలామధోక్

ప్రపంచంలోని దేశాలన్నిటిలోనూ నాగరికతా విలసనంలోనూ, జాతీయ జీవన వికాసంలోనూ స్త్రీలు ప్రముఖపాత్ర వహించారు. స్త్రీ పురుషుల సహకారం లేని మానవజాతి పురోభివృద్ధి కాని-వాస్తవానికి మనుగడ కాని ఊహాతీతాలు. కనుక నే జీవితరథానికి స్త్రీపురుషులు రెండు చక్రాలుగా వర్ణింపబడ్డారు. కాని వివిధ దేశాలలోనూ, సమాజాలలోనూ స్త్రీకి ఇవ్వబడే ప్రాముఖ్యత, ఆమెపట్ల ప్రదర్శితమయే దృక్పథము ఒకే విధంగా లేవు.

నాగరికతా ప్రారంభంనుంచీ స్త్రీకి పురుషునితో సమానమైన పాత్రను, విలువను ఇచ్చిన దేశం భారతదేశం ఒక్కటే. ఋగ్వేదకాలపు ఆర్యులు స్త్రీకి గౌరవ ప్రదమైన స్థానాన్ని ఇచ్చారు. సారస్వతంలోనూ, తత్వజ్ఞానంలోనూ రాజ్యనిర్వహణలోనూ భారతీయ మహిళ జరిపిన కృషి ప్రశంసార్హమైనది. హైందవ జీవనంలోని సాంస్కృతిక, సామాజిక విలువలను పరిరక్షించటంలో ఆమె ఒనర్చిన సేవ సర్వజనామోదాన్ని పొందింది. సీత, సావిత్రి, భారతీదేవి (మండన మిశ్రుని సతి), ఝాన్సీ లక్ష్మీబాయి వీరంతా భారతీయ జీవనంలో ఆదర్శమూర్తులుగా వెలుగొందారు. భారతీయ జీవితాన్ని, భావనలను, చరిత్రను తీర్చి దిద్దటంలో వారి పాత్ర అనన్య సామాన్యమైనది.

పాశ్చాత్యుల తాకిడివల్ల భారతీయులలో కలిగిన నవచైతన్యం భారతీయ మహిళలను ప్రభావితం చేసింది. స్వామి దయానంద సరస్వతివంటి సంస్కర్తల భగీరథ ప్రయత్నాల ఫలితంగా, పాశవికమైన ముస్లిము పాలనలో ఆమపై బలవంతంగా రుద్దబడ్డ సామాజిక బంధనాలనుండి విముక్తులయారు. వారు తిరిగి జాతీయ జీవనంలోని వివిధ రంగాలలో తమ ప్రతిభను ప్రదర్శించ నారంభించారు. ఆనీ బిసెంటు, సోదరి నివేదితల ఉదాహరణలు కూడ వారిలో ఆత్మవిశ్వాసాన్ని కలిగించటంలో ఎక్కువగా తోడ్పడ్డాయి.

ఇదేసమయంలో స్త్రీ పురుషుల సర్వ సమానతపైన, స్త్రీల ఆర్థిక స్వాతంత్ర్యంపైన పాశ్చాత్యభావాలు విద్యావంతులైనమహిళలలో ఒక వర్గాన్ని ప్రభావితంచేశాయి. తత్ఫలితంగా స్త్రీ పురుషుల కార్యరంగాలలో వేర్వేరనీ, అవి పరస్పర పూరకాలనే భారతీయ భావన వారికి వెగటయింది. అట్టి మహిళలు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కలిగిఉండటంచేత, వారంతా సుసంఘటితంగా ఉండటంచేత వారు పరంపరంగా వస్తూన్న స్త్రీ పురుష సమానత్వ భావనకు వ్యాఖ్యానం చేయగలిగారు.

కాని సామాన్య భారతీయ మహిళ నేటికీ తన అస్తిత్వాన్ని, తన పరంపరనూ కాపాడుకుంటూనే వచ్చింది. విద్య ఆమెకు తన హక్కులనుగూర్చి, బాధ్యతలనుగూర్చిన పరిజ్ఞానాన్ని మరింతగా కలిగించింది; అయితే ఆమె భావనలు మనగడ్డపై వేళ్లుప్రాతుకొని ఉన్నాయి. వైవాహిక జీవనంయొక్క పవిత్రత, సీతా సావిత్రుల ఆదర్శం నేటికీ ఆమెకు అక్షయమైన స్ఫూర్తిని ప్రసాదిస్తూనే ఉన్నాయి.

స్వాతంత్ర్యం రావడంతో భారత ప్రజలందరిపైనా క్రొత్త బాధ్యతలు వచ్చాయి. వయోజన వోటింగు పద్ధతితో పార్లమెంటరీ ప్రజాస్వామ్యంఏర్పడటంతో స్త్రీలకు రాజకీయ జీవనంలో గతంలో లేని ప్రాముఖ్యత వచ్చింది. విద్యలోనూ, సామాజికంగాను వారి పురోభివృద్ధి ఆత్యావశ్యకమని నేడు సర్వత్రా గుర్తింపబడుతోంది.

శాసనసభలలోనూ, సారస్వత కళా రంగాలలోనూ ఆమె నిర్వహిస్తూన్న బాధ్యత, తనపై మోపబడిన గురుతర బాధ్యతను సమర్థవంతంగా నిర్వహించగలశక్తి ఆమెకు కలదనినిరూపిస్తోంది.

కాని ఈక్రొత్త పరిస్థితి నేడు దేశానికి—ముఖ్యంగా స్త్రీలకు రెండు గంభీరమైన సమస్యలను తెచ్చిపెట్టింది. వోటింగుహక్కును విస్తృతం చేయటంవల్ల సాధారణ స్త్రీలకు వచ్చిన క్రొత్తబాధ్యతలను వారు విజ్ఞతతో నిర్వహించేందుకై వారికి తగు శిక్షణ గరపటం మొదటిసమస్య; పురుషుని వోటుకు ఎంత విలువ ఉన్నదో ఆమె వోటుకూ అంతే విలువఉన్నది; కాని ఆ బాధ్యత విషయమై ఆమె అంతగా పట్టించుకోవటం లేదు. సామాన్య రాజకీయ విజ్ఞానం స్త్రీ లందరికీ వ్యాపించనంతవరకూ దేశపునర్నిర్మాణంలో వారు తమ బాధ్యతను సక్రమంగా నిర్వహించలేరు.

భారతీయ మహిళలను ఎదుర్కొంటున్న రెండవ సమస్య మరింత ప్రముఖమైనది. ఒక ప్రక్క పరంపరాగతంగా వస్తూన్న భావాలకు, విలువలకు, గృహంలో కుటుంబంలో తమకున్న సహజ బంధనాలకు; మరో ప్రక్క అధునాతన విద్యావ్యాసంగానికీ, బయటి సామాజిక జీవన పరిస్థితులకూ ఎలా సమన్వయాన్ని సాధించాలనేదే ఆ సమస్య. పూర్తిగా గృహకృత్యాలలో నిమగ్నమై ఉండటంవల్ల కొన్ని బాధలున్నాయి. బాహ్యసామాజిక జీవనపు మోజులో పడి ఇంటి విషయాల నశ్రద్ధ చేయటం మరింత ప్రమాదకరంగా పరిణమిస్తోంది. ఈ రెంటికీ ఒక మధ్యేమార్గాన్ని ఒక సామరస్య పూర్వకమైన సమన్వయాన్ని ఏర్పరచాలి.

గృహకృత్యాలయెడ తమ బాధ్యతలను అశ్రద్ధ చేసినా పరవాలేనివారు, పాశ్చాత్యుల

ప్రభావాలకు లోనైనవారు అయిన స్త్రీల (westernized society ladies) చేతులలో స్త్రీల నాయకత్వం ఉన్నంతవరకూ అట్టి సామరస్యం సాధ్యంకాదు. పండిత నెహ్రూ నాయకత్వాన్ని అనుసరించే పురుషులకు భారతీయ జీవనంలోని వాస్తవిక విషయాలు తెలియని విధంగా, అట్టివారి మిత్రులైన ఈ మహిళామణులకు భారతీయ మహిళల వాస్తవిక స్థితిగతుల పరిజ్ఞానం ఉండదు. తమ పరంపరకు దూరంకాకుండా, తమ గృహకృత్యాలను నిర్వహిస్తూన్న మహిళలు బాహ్య సామాజిక జీవనానికి, గృహజీవనానికీ సామరస్యాన్ని ఏర్పరచడానికి ముందుకు వచ్చినప్పుడే అపసవ్యమైన ఈ స్థితి తొలగుతుంది. ఇది సాధింపబడిననాడు భారత పునరుజ్జీవనంలో మహిళలు ఇతోధికంగా సహకరించే అవకాశం ఉంటుంది. సాంఘిక శాసనాలు, స్త్రీల అవసరాలు, చలనచిత్రాల సెన్సార్ చేయటం, విద్య-ఇత్యాది విషయాలలో మన నాయకులు పాశ్చాత్య వ్యామోహంలోపడిన స్త్రీలకు బదులు గృహిణులను సలహాలకు సహకారానికి అర్థిస్తే అభిలషణీయమైన ఈ పరివర్తన త్వరితగతిని సాధ్యపడుతుంది. స్త్రీలలో దుష్ప్రభావాలను కలిగించి, తద్వారా పరంపరపై ఆధారితమైన అభ్యుదయ పథంలో పురోగమించే జాతిగా భారతదేశం రూపొందటానికి అడ్డుకట్టలు వేస్తున్న విద్యావంతులైన స్త్రీలయొక్క ఈవిపరీత భావాలను తొలగించటానికి మన నాయకుల దృక్పథంలో ఈ మార్పు అత్యవసరం. ★

---

( 41 వ పుట తరువాయి )

2. ఈ పక్షంలో అధికాధిక స్థానాల్లో సభలు, సమావేశాలు, ప్రభాతఫేరీలు, ఊరేగింపులు జరపాలి. ఎంతకాలం దేశమంతా సంపూర్ణంగా గోవధ నిషేధింపబడదో అంతవరకు ఆందోళన సాగించ దృఢసంకల్పం వహించాలి.

3. సభలలోని తీర్మానాలనుప్రధానమంత్రికి, రాష్ట్రపతికి పంపాలి.

4. స్థాన స్థానంలోనూ గోహత్యా నిరోధ సమితులను స్థాపించాలి.

5. డిశంబరు 13. 14 తేదీలలో దేశరాజధాని అయిన ఢిల్లీలో జరుగనున్న సమ్మేళనం, గోరక్షాప్రదర్శనాదులను విజయవంతం చేయాలి.

6. గోహత్య నిషేధింపబడని ఆంధ్రాది ప్రాంతాలలో శాసన సభాసభ్యులను కలిసి నచ్చచెప్పి శాసనమును చేయించుకోవాలి. ★

# నెహ్రూ - నూన్ ఒడంబడికపై ఆంధ్రలో నిరసన సభలు

## విజయవాడ

ఈ నెల 2 వ తేదీ సాయంత్రం పట్టణ జనసంఘ ఆధ్వర్యాన ఆంధ్రప్రాంత జనసంఘ సంఘటనా కార్యదర్శి శ్రీ గోపాలరావ్ ఠాకూర్ గారి అధ్యక్షతన గాంధీపార్కులో నెహ్రూ - నూన్ ఒడంబడికకు నిరసన తెలిపేందుకై బహిరంగసభ జరిగింది. ప్రార్థనానంతరం శ్రీ గోపాలరావుగారు మాట్లాడుతూ ఒడంబడిక ప్రకారం నెహ్రూగారిచ్చిన భూదానం రాజ్యాంగ వ్యతిరేకమనీ, ఆ భాగంలోని ప్రజలకు ప్రమాదకరమనీ పేర్కొంటూ దీనికి నిరసనను తెలియజేయవలసిందిగా ప్రజలకు హెచ్చరిక చేశారు. అనంతరం జాగృతి సహాయ సంపాదకులు శ్రీ కందర్ప రామచంద్రరావుగారు భారత - పాకిస్థాన్ సంబంధాలను సమీక్షిస్తూ, నెహ్రూ ప్రభుత్వంయొక్క అసమర్థ విధానం వల్లనే పాకిస్థాన్ దుండగాలు మితిమీరడం జరిగిందన్నారు. కాంగ్రెసు ప్రభుత్వం నేటికీ ఆ విధానాలనే అనుసరిస్తున్నదనీ, వాటిని మార్పించే బాధ్యత ప్రజలపై ఉన్నదనీ అన్నారు. ఒడంబడికను నిరసిస్తూ శ్రీ బాయిన అప్పారావుగారు ప్రవేశపెట్టిన తీర్మానం సభవారిచే ఏకగ్రీవంగా ఆమోదించబడింది. కార్యదర్శి వందన సమర్పణతో సభ ముగిసింది.

## గుడివాడ

స్థానిక జనసంఘ యాజమాన్యాన ఈ నెల 2వ తేదీ సాయంత్రం గుడివాడలో స్థానిక న్యాయవాదులు శ్రీ పెద్యోటి వెంకట్రావుగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది. శ్రీ శీతేపల్లి కాశీ విశ్వేశ్వరశర్మ, శ్రీ కొట్రగడ్డ నాంచారయ్యగారలు ప్రసంగించారు. అనంతరం నెహ్రూ - నూన్ ఒడంబడికను నిరసిస్తూ ఏకగ్రీవంగా తీర్మానించ బడింది.

## నర్సరావుపేట

నర్సరావుపేట పట్టణ జనసంఘ ఆధ్వర్యాన ఈ నెల 2వ తేదీ సాయంత్రం విక్టోరియా హాలులో జరిగిన బహిరంగ సభలో స్థానిక న్యాయవాదులు శ్రీ ధర్మవరపు రామనాథం, శ్రీ బి. రవీంద్రనాథ్ గారలు, శ్రీయుతులు బత్తుల వెంకటరత్నం. జె. యల్. కాంతారావు, పి. ఆంజనేయులుగార్లు ఉపన్యసించారు. నెహ్రూ - నూన్ ఒడంబడికకు తీవ్ర నిరసనను తెలుపుతూ, దానిని రద్దుచేయవలసిందిగా లోక్‌సభవారిని కోరుతూ ఏకగ్రీవంగా తీర్మానించబడింది.

## కంభం

జనసంఘ ఆధ్వర్యాన కంభంలో ఈ నెల 2వ తేదీ సాయంత్రం శ్రీ తిరివీధి సుబ్బారాయుడుగారు అధ్యక్షులుగా, మార్కాపురం పంచాయితీబోర్డు మాజీ అధ్యక్షులు శ్రీ తురగా పూర్ణచంద్రరావుగారు గౌరవాధ్యక్షులుగా బహిరంగసభ జరిగింది. శ్రీయుతులు పూర్ణచంద్రరావు, వేముల వెంకటేశ్వర్లు, బాదం శ్రీరాములు గార్లు ప్రసంగించారు. నెహ్రూ - నూన్ ఒడంబడికను రద్దుచేయవలసిందిగా కోరుతూ తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

# ✻ 1961 లో శోకావళి! ✻

## ప్రొఫెసర్ కె. ఎస్. స్వామి

1959 దీపావళి! 30 స్వాతి నక్షత్రం. 1959 అక్టోబరు 2న కన్యారాశిలో రవి బుధ కుజ చంద్ర రాహుల కలయికవల్ల ఐక్యరాజ్య సమితి పేరిట ఆంగ్లో-అమెరికన్ సేనలు మధ్య ప్రాచ్యమున అడుగిడును. సంయుక్త అరబ్ రిపబ్లిక్ విచ్ఛిన్నమగును. ఈజిప్టును ఆంగ్లో, అమెరికన్, ఫ్రెంచి, ఇజ్రాయిల్ సైన్యములు ముట్టడించును. ఈ సమయమందే తూర్పు యూరపు రాజ్యములలో కొన్ని రష్యాపై తిరుగుబాటు చేయును. కనుక రష్యా సేనలు మధ్య ప్రాచ్యమునకు వచ్చినచో, ఐక్యరాజ్య సమితి పేరుతో ఆంగ్లో, అమెరికన్, ఫ్రెంచి ఇత్యాది దేశముల సైన్యములు తూర్పు యూరపు రంగమును ప్రవేశింప సంసిద్ధమగును. నాడు ఐక్యరాజ్యసమితినుండి రష్యాకూటమి ని ప్రక్కమించు అవకాశములు కలవు. మనదేశంలో 1959 ఆగష్టు - అక్టోబరుల మధ్య పలు ప్రాంతములలో కాంగ్రెసుకు విరుద్ధంగా హింసావాదులు సాయుధ పోరాటమారంభింతురు. గాలివానలు, కుంభవృష్టి వరదలు, భూకంపము వలన అపారమైన నష్టములు కలుగును. పై పంచగ్రహకూటము కాంగ్రెస్ గ్రహణ యోగముండుటచే, ఆ తేదీ నాటికి కాంగ్రెస్ సూర్యాస్తమానఘడియలలో ప్రవేశింపనున్నదని తలంపవలసియున్నది.

1961 దీపావళి నాడు. శని గురు కేతువులు మకరమందును, తులలో రవి కుజ బుధ చంద్రులును ఉందురు. ఇంచుమించుగా నీ సమయమున మిగత గ్రహములన్నిటిని మందుడు తన కరగతము కావించుకొనును. కాగా శన్యంగారకులకు పరస్పర కేంద్రస్థితియు, పరస్పర వీక్షణమును సంభవించినది. నాడు అగ్రరాజ్య కూటముల నడుమ మూడవ ప్రపంచయుద్ధము వచ్చి దూరప్రాచ్య, మధ్యప్రాచ్య దేశములు నశించును. కమ్యూనిష్టు - కమ్యూనిష్టేతర దేశాధిపతులు పశుత్వముగలవారివలె వ్యవహరించి 1962 ఫిబ్రవరి అఖరుకు మానవజాతికి తీవ్ర అపచారము చేసినవారగుదురు.

1-11-1958.